





# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# తోలుబొమ్మలాట ప్రదర్శనం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100047350

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో **భారత ప్రభుత్వపు** సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తోలుబొమ్మలాట ప్రదర్శనం

> తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో
> ఈ పుస్తకం ప్రచురించబడింది.

డాక్టర్ బిట్టు వెంకటేశ్వర్లు
జానపద కళల శాఖ
తెలుగు విశ్వవిద్యాలయం,
పబ్లిక్‌గార్డెన్స్, హైదరాబాద్ - 500 004.



శ్రీ కె.వి.రమణా, ఐ.ఏ.ఎస్. గారు

# నా నుడి

"సహజంగా జీవితంలో పూలను కోరుకుంటారందరూ. పూల నేరు కుంటారు. పూలను దాచుకుంటారు. కాని - ముళ్ళను - తుమ్మముళ్ళను కావాలని కోరుకుని, మురిపెంగా ఏరుకుని, పదిలంగా దాచుకునేవాళ్ళు కూడా కొందరుంటారని మనలో చాలా మందికి తెలియదు. జీవితం ఒక బొమ్మలాట. బొమ్మలాటే జీవితంగా గడిపేవాళ్ళు తోలుబొమ్మలాటగాళ్ళు. 'తోలుబొమ్మ లాటగాళ్ళ జీవితంలో కీలకమైన పాత్ర వహించేవి ఎందుతుమ్మముళ్ళే"నని - హృద్యంగా తోలుబొమ్మలాటగాళ్ళ జీవన సరళిని, సంప్రదాయాన్ని సామా న్యునికి కూడా అర్థమయ్యే రీతిలో సరళంగా అందించడానికి ప్రయత్నించారు సహృదయ మిత్రులు డాక్టర్ బిట్టు వెంకటేశ్వర్లుగారు. 'తాగుడు తక్కువైతే శివరంజని; తాగుడు ఎక్కువైతే మోహనరాగం' అని గ్రంథకర్త చెప్పిన దాన్నిబట్టి చూస్తే - తోలుబొమ్మలాటగాళ్ళకు 'తాగడం' ఒక జీవనరాగమన్న సంగతి తెలిస్తోంది. పూర్వపు రోజుల్లోని తొంభై అమడబోయి తోలుబొమ్మ లాట, అరవై అమడబోయి అవుల వబ్బం చూడాలన్న సామెతను గుర్తు చేశారు రచయిత ఈ గ్రంథంలో ఒకచోట.

జుట్టు పోలిగాడు, బంగారక్కలు ఏయే గ్రామాల్లో ప్రదర్శన ఇస్తారో ఆయా గ్రామాలకు సంబంధించిన అంశాల్ని ప్రవేశ పెట్టి గ్రామ ప్రజల్లో ఒక సంబంధ బాంధవ్యాన్ని ప్రేరేపించి, అంతగా చదువుకోకున్నా - మాడర్న్ పద్ధతిలో ఇంగ్లీషు మాటల్లో - Begin చెయ్' లాంటి ప్రయోగాలుచేస్తూ - రామాయణ - భారత - భాగవతాది కథలను స్వీకరించి, వేమన - సుమతీ శతకాల్లోని నీతివాక్యాల్ని సందర్భోచితంగా వాడుకుంటూ - 'మంచి'ని చాటి చెప్పడానికి తాము కష్టాల కడలిలోవున్నా ప్రజానీకానికి వినోదాన్ని కల్గించ డానికి ప్రయత్నిస్తుంటారు తమదైన శైలిలో.

జానపద కళాకారుల జీవనరీతుల్ని మెరుగుపరచడానికి, వెలుగులోకి తేవటానికి ఎందరెందరో ఎన్నిరకాలో కృషి చేసినా, జానపద కళాకారుల;

ముఖ్యంగా తోలుబొమ్మలాటగాళ్ళ జీవన పరిస్థితు లీనాటికీ దుర్భరంగానే వున్నా
యంటే అతిశయోక్తి కాదు మంచిని వినోదాత్మకంగా ప్రబోధిస్తూ శ్ర
స్తూన్న వీరి ఆస్తిపాస్తులంతా కలిపి బుట్టలు, తట్టలు, తడికెలు, వెదు
కర్రలు, డబ్బాలు, బొమ్మలు, తె"గుడ్డలు - తుమ్మముళ్ళూనూ.

ఏది ఏమైనా, డాక్టరు బిట్టు వెంకటేశ్వర్లుగారు తమ రచన ద్వా
తోలుబొమ్మలాటగాళ్ళ జీవితాల్లోకి తొంగిచూడ్డానికి ఒక అవకాశం కల్గించా
ఆంధ్ర ప్రజానీకానికి - పఠితృ లోకానికీ.

ఈ పుస్తకం నాకు అంకిత మీయాలని ఎందుకనుకున్నారో నా
తెలియదు. నాలో ఏ అర్హత వుందని ఈ నిర్ణయాని కొచ్చారో నాకు తెలియదు
డాక్టరు బిట్టు వెంకటేశ్వర్లు నాకు సహృదయ మిత్రులు. అందుకే మైత్రీ పు
స్సరంగా ఈ పుస్తకం నాకు అంకితమిస్తున్న ఈ తరుణంలో - కృతజ్ఞ
పూర్వకంగా నా మనఃపూర్వక వినమ్రాంజలుల సమర్పించుకోవడం కన్న
మిన్న ఏముంది కనుక?

అందుకే - కృతజ్ఞతా పూర్వక నమస్సుమాల్తో-

రమణ

# అభినందనలు

డా॥ బిట్టు వెంకటేశ్వర్లుగారు 'తోలుబొమ్మలాట ప్రదర్శనం'ను గురించి సాధికారికమైన, సమగ్రమైన పరిశోధన గ్రంథాన్ని రచించి ప్రచురించినందుకు వారిని ముందుగా అభినందిస్తున్నాను.

డా॥ వెంకటేశ్వర్లు ఇంతకుముందే కోలాట ప్రక్రియను, ప్రదర్శనను గురించి పరిశోధనచేసి పిఎచ్ డి పట్టాను పొందినారు ఇప్పుడు తోలుబొమ్మలాటల ప్రారంభ వికాసాలనుంచి ఆ ప్రక్రియ విశేషాలను సమగ్రంగా వివరిస్తూ ఎన్నో క్రొత్త విషయాలను క్రోడీకరించినారు. వీటిని ప్రదర్శించే వృత్తి కళాకారుల పుట్టుపూర్వోత్తరాలను, వాళ్ళ ఆచార వ్యవహారాలను ఈ ప్రదర్శన ఆద్యంతం జరిగే విధానాలను విశ్లేషణాత్మకంగా ఇందులో వివరించినారు. ప్రాచీనకాలం నుండి జనరంజకంగా ఉంటూ వచ్చిన తోలుబొమ్మలాట ప్రదర్శించే విధానాన్ని కూడా వివరించడం వల్ల ఔత్సాహికులు ఆ విధానాన్ని అనుసరించి, కాలానుగుణమైన కథాంశాల్ని ఎన్నుకొని ప్రదర్శిస్తూ ఈ కళారూపం వ్యాప్తికి దోహదం చేయడానికి వీలుకలుగుతుంది. అంతేగాక, చివరలో ఈ ప్రదర్శనకు సంబంధించిన కథా పాఠాన్ని కూడ సేకరించి యథాతథంగా ముద్రించినారు. అది పరిశోధకులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది. వెంకటేశ్వర్లుగారు స్వయంగా కళాకారులు నివసించే ప్రాంతాలకు వెళ్ళి వాళ్ళ చేత ఆడించి, కడముట్టదాకా వీటి విశేషాల్ని సాకల్యంగా పరిశీలించి పాఠకుల ముందుంచుతున్నారు. వారు తోలుబొమ్మలాట వృత్తికళాకారుల జీవితాల, ఆచార వ్యవహారాల సంస్కృతి, సంప్రదాయాల్లోకి కూడ తొంగిచూసి, ఆ విశేషాలు గ్రంథస్తం చేసినారు. కొన్ని చిట్కా వైద్యాలను గురించి కూడ రాసినారు. తరతరాల తెలుగువారికి జీవితాదర్శాలు నేర్పే రామాయణాది కథాంశాలను పుక్కిటబట్టి శాశ్వతత్వాన్ని సంతరించుకొన్న ఈ కళకు ఈ గ్రంథం ప్రాచుర్యాన్ని కల్పిస్తుంది. ఇట్లాగే ఇకముందు కూడ ఆంధ్రదేశంలో ఆదరణకు నోచుకోకుండా ఉన్న మారుమూల ప్రాంతాల్లోని జానపద కళారూపాలను తెలుగు ప్రజలకు పరిచయం చేస్తారని ఆశిస్తూ. వారి కృషిని అభినందిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం
వైస్-ఛాన్సలర్
తెలుగు విశ్వవిద్యాలయం.

హైదరాబాదు.
తేది 24 3 1993.

# ఒక మాట

ఆదికవి నన్నయ్యకు పూర్వమే జానపద సాహిత్యం ప్రజల్లో ప్రచారంలో ఉందని ఋజువులున్ననూ, ఈ శతాబ్దం అరవై దశకంలోనే జానపద సాహిత్యం పరిశోధనా మార్గంలోకి అడుగిడింది. జానపద సాహిత్య పరిశోధనకు శ్రీకారం చుట్టినవారు, పరిశోధకులకు మార్గదర్శకులైనవారు డా॥ బిరుదురాజు రామరాజుగారు. వీరి శ్రమ, శ్రద్ధాసక్తుల ఫలితంగానే విశ్వవిద్యాలయాల్లో జానపద విజ్ఞానం పరిశోధనాంశంగానూ, బోధనాంశంగానూ ప్రవేశించి దినదిన ప్రవర్ధమానం అవుతున్నది. రామరాజుగారి పదవీ విరమణ సందర్భంలో జానపద సాహిత్య పరిషత్తు "రామరాజు జానపద విజ్ఞాన బహుమతి"ని ఏర్పాటు చేసింది. ఈ బహుమతి స్వీకర్తలు, డా॥ బిట్టు వెంకటేశ్వర్లు జానపద విజ్ఞాన అభిజ్ఞులు. బహుమతి పొందిన వీరి "తోలుబొమ్మలాట ప్రదర్శనం, రామరాజు జానపద విజ్ఞాన బహుమతి" పరస్పర ప్రతిష్ఠాపూరకాలు. ఈ గ్రంథం వెంకటేశ్వర్లుగారి రచనల్లో ద్వితీయమైననూ, అద్వితీయమైంది

అనాదినుండి మన దేశంలో జానపద విజ్ఞానం మన జాతి సంస్కృతికి ప్రతీకగానే నిలచింది. అయితే ఈ ఆధునిక యుగంలోనే మనవారికి జానపద విజ్ఞానాన్ని పరిరక్షించుకోవాలనీ, మన సంస్కృతిని పదిలపరచుకోవాలనే తపన కలిగింది. తద్ఫలితంగానే అనంతమైన జానపద సాహిత్యాన్ని సేకరించడం ప్రారంభించారు. వీరి కృషి పాశ్చాత్య జానపద విజ్ఞాను లేర్పరచిన సిద్ధాంతాలనూ, పరిశోధనా మార్గాలనూ అనుసరిస్తూ సాగుతున్నది. నేటి పాశ్చాత్యుల సిద్ధాంతాల్లో వినూత్నమైంది, విశిష్టమైంది "Performance Theory" (ప్రదర్శనా సిద్ధాంతం). జానపద కళా ప్రదర్శనను వివిధ దృక్కోణాలతో ఉన్నది ఉన్నట్లుగా వివరించడమే ప్రదర్శనా సిద్ధాంత ధ్యేయం. బిట్టు వెంకటేశ్వర్లుగారు 'తోలుబొమ్మలాట ప్రదర్శనం' పుస్తకాన్ని ఈ సిద్ధాంతాన్ని అనుసరించే రచించారు. ప్రదర్శనా సిద్ధాంతంతోపాటు సామాజిక శాస్త్రాన్ని, మానవ శాస్త్రాన్ని కూడ తోలుబొమ్మలాట ప్రదర్శకుల జీవితాలకు అన్వయించడంవల్ల వీరి పుస్తకాన్ని త్రివేణి సంగమంగా పేర్కొనవచ్చు.

చిత్రం, సంగీతం, నాట్యం, సాహిత్యాలతో కూడిన ప్రాచీన జానపద కళా రూపం బొమ్మలాట. ఈ కళ శాతావాహన, పల్లవ, చాళుక్య, కాకతీయ రాజుల ఆదరణను పొంది తంజావూరు రాజుల కాలంలో ఉన్నత దశకు చేరుకొని, విదేశాలకు వెళ్ళిన భారతీయులతోపాటు ఆగ్నేయ ఆసియాలోకి ప్రవేశించింది. నేటి ఇండోనేషియా, జావా, బలి ద్వీపాల్లోని తోలుబొమ్మలాటకు మాతృక తెలుగు వారి బొమ్మలాటలనే చరిత్రకారుల అంచనా. ఇంతటి ప్రాచీన, ప్రసిద్ధ చరిత్ర కలిగిన తోలుబొమ్మలాటపైన తెలుగులో చాలా వ్యాసాలు వచ్చాయి. కానీ సమగ్ర సమాచారాన్ని అందించే ఏకైక పంశోధనా వ్యాసం వెంకటేశ్వర్లుగారిదే అని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

''తోలుబొమ్మలాట ప్రదర్శనం" పుస్తకంలో రచయిత బొమ్మలాట పుట్టుపూర్వోత్తరాలు, ప్రదర్శకులు ప్రదర్శించే కథలు, బొమ్మలాట వారి సామాజిక పరిస్థితులు, సంప్రదాయాలు, బొమ్మలాట ప్రదర్శనకుపయోగించే సామగ్రి, వాద్యాలు, తోలుబొమ్మలను తయారు చేసే విధం, ప్రదర్శనా సందర్భాలు, ప్రదర్శించిన విధానం, ప్రేక్షకుల స్పందన మొదలైన అంశాల నన్నింటినీ అతి సరళంగా వివరించి, తోలుబొమ్మలాట సమగ్ర చిత్రాన్ని మన కళ్ళెదుట నిలబెట్టారు.

మొదటి అధ్యాయం బొమ్మలాట చరిత్రను, రెండవ అధ్యాయం బొమ్మలాట వారి ఆర్థిక సామాజిక పరిస్థితులను, వారి ఆచార సంప్రదాయా లను వివరిస్తుంది. బొమ్మలాట ప్రదర్శనకూ, ప్రదర్శకుల జీవిత పరిస్థితులకూ మధ్యగల అవినాభావ సంబంధాన్ని ఈ అధ్యయనం సూచిస్తుంది సాధారణంగా ఒక్క కుటుంబంలోని సభ్యులే ప్రదర్శనలో పాల్గొంటారు. ప్రదర్శనకు ఎక్కువ మంది అవసరమవుతారు అందుకే బొమ్మలనాడించే వారు 2, 3 పెళ్ళిళ్ళను చేసుకుంటారు భార్యలనూ, వారి సంతానాన్ని ప్రదర్శనకు ఉపయో గించుకుంటారు "పెద్ద కుటుంబమే ప్రదర్శనకు సౌఖ్యం" అని వారను కుంటారు. ఈ అధ్యాయంలో నా స్త్రీ దృష్టిని ఆకట్టుకుంది కుల పెద్దలు భార్యను వదలిపెట్టిన భర్తకు విధించే శిక్ష భర్త భార్యను వదలివేస్తే ఆమెకు భరణం తప్పకుండా చెల్లించుకోవాలి. అంతేకాకుండ అతణ్ణి కులం నుండి వెలి వేస్తారు. 3 నెలల నుండి 3 సంవత్సరాల వరకు శుభకార్యాలకు రానివ్వరు.

పీటల పైన కూర్చొని శుభకార్యాలను చేయనివ్వరు. శిక్షాకాలం ముగిసిన తర్వాత కులంలో కలుపుకుంటారు. ఈ శిక్షలు మన సమాజంలోని మగవారికి కూడ వర్తింపచేస్తే, స్త్రీలకు జరిగే అన్యాయాలు కొంతవరకైన తగ్గుతాయి. తోలు బొమ్మలాట ప్రదర్శకుల ఆచార వ్యవహారాల్లోని ప్రత్యేకాంశాలను అందించడం వల్ల రచయిత విషయ సేకరణలోని విశిష్టత విదితమవుతున్నవి.

తోలుబొమ్మలాట ప్రదర్శనలో స్త్రీలు పురుషులతో సమానంగా పాల్గొంటారు. ఇతర జానపద కళల్లో స్త్రీల పాత్ర అప్రధానం. పురుషులే స్త్రీల పాత్రలను పోషిస్తుంటారు కానీ తోలుబొమ్మలాటలో స్త్రీలు స్త్రీ పాత్రలనే కాకుండా అప్పుడప్పుడు పురుష పాత్రలను కూడ ఆడిస్తుంటారు. "బొమ్మలాట వారి సామాజిక పరిస్థితులు" అధ్యాయంలో రచయిత అపురూపమైన, అద్భుతమైన సమాచారాన్ని సేకరించి వివరించారు ఈ అధ్యయనం జానపద విజ్ఞానులకే గాక, సామాజిక శాస్త్రవేత్తలకు కూడ ఉపకరిస్తుంది

మూడవ అధ్యాయంలో తోలుబొమ్మలను తయారు చేసే విధానాన్ని వివరించడం జరిగింది తెలుగు వారి తోలుబొమ్మల తయారీకి, జావా- బలి ద్వీపాల్లోని బొమ్మల తయారీకి మధ్యగల పోలికలను రచయిత తెలిపారు. జానపద విజ్ఞాన పరిశోధనలో తులనాత్మక పరిశీలనకు అత్యంత ప్రాధాన్యముంది. తులనాత్మక పరిశీలన వల్ల ప్రాంతాలు, మతాలు, భాషలు వేరైనా కళాకారుల మధ్య భావసారూప్యాలు కనపడుతాయని స్పష్టమవుతుంది.

అయిదవ అధ్యాయం "ప్రదర్శనా విధానం"లోకి ప్రవేశించిన పాఠకులు ఒక్కసారిగా శ్రోతలుగా, ప్రేక్షకులుగా మారిపోతారు. పుస్తక పఠనమే కాకుండా, బొమ్మల మాటలను, పాటలను వింటూ ఆటను చూచిన అనుభూతిని పొందుతారు రచయితతోపాటు పాఠకులు కూడ ఒకవైపు బొమ్మలాటను తిలకించడం, మరోవైపు సంగీత సాహిత్యాలను పరిశీలించడం, వేరొకవైపు ప్రదర్శనకు ప్రేక్షకుల ప్రతిస్పందనను పరికించడం జరుగుతుంది.

ప్రదర్శనలోని ప్రతి సూక్ష్మాంశాన్ని పరిశీలించి వివరించడానికి పరిశోధకునకు సహనం, ఏకాగ్రత అవసరం. ఈ విశిష్ట గుణాలు రచయిత సహజ స్వభావాలని ఈ అధ్యాయం ఋజువు పరుస్తుంది. రచయితకు తల చుట్టూ కన్నులున్నాయా అనే అనుమానాన్ని కూడ మనకు కలిగిస్తుంది.

తోలు బొమ్మలాటలోని హాస్య పాత్రల సృష్టినీ, ప్రయోజనాలను రచయిత సునిశిత పరిశీలనా దృష్టితో వివరించారు. ఈ హాస్య పాత్రలు ప్రేక్షకులకు వినోదంతోపాటు, ప్రదర్శకుల జీవితాల్లోని విషాదాలను కూడ అందిస్తాయి.

తమ ఆవేదనలనూ, ఆరాటాలనూ తోలు బొమ్మలను ఆడించేవారు హాస్య పాత్రల ద్వారా ప్రేక్షకుల ముందు వెళ్ళబోసుకుంటారు వారి సహాయాన్ని అర్థిస్తుంటారు. ఒక్క వాక్యంలో చెప్పాలంటే "హాస్య పాత్రలు ఆటగాళ్ళ జీవిత ప్రతిబింబాలు" అని రచయిత సోదాహరణంగా నిరూపించారు.

కళా ప్రదర్శనా వివరణతోనే పరితృప్తి చెందడం సామాన్యాంశం. ఈ పుస్తకంలోని విశేషాంశం ప్రదర్శనకు ప్రేక్షకుల స్పందనలను కూడ వర్ణించడం. తోలుబొమ్మలాటలోని కథా ప్రదర్శనకు కారకులు ప్రేక్షకులే. ఆట ఆరంభంలో ప్రేక్షకులు తమ పేర్లను కీర్తించమంటారు. హాస్యాన్ని అందించమంటారు. కథాగమన వేగాన్ని పెంచమంటారు తగ్గించమంటారు. ఆటను ఆరంభించమంటారు ముగించేయమంటారు వారి కోరిక మేరకే ఆట నడుస్తుంది. అందుకే ప్రేక్షకుల పాత్రను కూడ రచయిత వివరించడం వల్ల తోలుబొమ్మలాట ప్రదర్శనానికి పరిపూర్ణత ప్రాప్తించింది.

ఈ పుస్తకంలో వేదిక నిర్మాణ నమూనా, ప్రేక్షకులు కూర్చుండే విధానాన్ని సూచించే చిత్రాలున్నాయి ఈ చిత్రాలను చూడగానే మన సమాజ స్వరూపం కూడ కొంతవరకవగతమవుతుంది. ప్రేక్షకులు కూర్చునే విధానంలో ముందు భాగంలో చిన్న పిల్లలు, తర్వాత యువతులు, వారికి రెండువక్కల యువకులు, పెద్ద వయస్సులోని ఆడవారు, వారి తర్వాత మగవారు కూర్చొని ఆటను చూస్తుంటారు యువతులకు యువకులు, ఆడవారికి మగవారు రక్షకులుగా కూర్చున్నట్టు కూర్చుంటారు వెంకటేశ్వర్లుగారి తొలి పుస్తకం"పల్నాటి సీమలో-కోలాటం"లో కూడ కోలాటం వేసేవారి స్థానాలను సూచించే చిత్రాలవల్ల ఆట ఆడే విధానం సులభంగా అర్థమవుతుంది ఊహించుకోవడానికి క్లిష్టమైన దృశ్యాలను సరళమైన చిత్రాల్లో చిత్రించడం వీరికి కరతలామలకం

తోలు బొమ్మలాట ప్రదర్శనంలోని ప్రతి చిన్న అంశాన్ని వివరించటంలో రచయితకున్న పరిశీలనాసక్తి, పరిశోధనాశక్తి, శ్రమించడంలో స్థిర ప్రజ్ఞ విదితమవుతున్నాయి. "తోలు బొమ్మలాట ప్రదర్శనం" ఒరవడిలోనే రచయిత కలం నుండి మరిన్ని కళా ప్రదర్శనల గురించి పుస్తకాలు రావాలనీ, జానపద కళా పరిశోధనా రంగం విస్తృతం కావాలని ఆశిస్తున్నాను.

డాక్టర్ రావి ప్రేమలత
హైదరాబాద్.

25-3 1993

# కళ ఒంటరి కాదు

కదలలేని, మెదలలేని బండరాయి కాదు కళ. నిరంతరం చలించే గతిశీలమైనది కళ. సమాజ ప్రతిబింబం కళ. మానవ జీవనగమనానికి ప్రతి రూపం కళ.

ఒక కళను కదిపితే ఆటల అడుగులు, పాటల నుడుగులు లోకాన్ని తట్టి లేపుతాయి కళ ఒంటరి కాదు. ఎందరో కళాకారుల సమష్టి శ్రమరూపం కళ. ఒక్కొక్క కళ పుట్టుక వెనుక దాగిన చరిత్ర ఎంతో.

మరీ ముఖ్యంగా జానపదకళల జాడలు వందల, వేల సంవత్సరాల లోయల్లోకి, గత సంస్కృతుల, సంప్రదాయాల లోయల్లోకి తీసుకెళతాయి వాటిని అందుకోవడానికి ఆరాటంతోపాటు ఓర్పు, నేర్పు కావాలి అన్నింటి కన్న ముఖ్యంగా నిర్భీతితో కూడిన నిజాయితీ కావాలి

పరిశోధన ప్రవృత్తిరీత్యా సాగాల్సిందేకానీ, వృత్తికో, ఉపాధికో పరి మితం కాకూడదు పరిశోధనకు కార్యరంగం సమాజం, ప్రజలు. పుస్తకాల పుటలు లెక్కించడం, నాలుగు చదివి ఒక్కదానిని రాయడం పరిశోధన అనిపించుకోదు.

జానపద విజ్ఞాన అన్వేషణలో నిత్యం పరిశోధకుడుగా, వృత్తిరీత్యానే కాక ప్రవృత్తి రీత్యా కృషి చేస్తున్న డా॥ బిట్టు వెంకటేశ్వర్లు 'తోలుబొమ్మ లాట'ను అక్షరరూపంలో అందించడం ఎంతో సంతోషదాయకం.

ఈ తోలు బొమ్మలాట పుస్తకం కళారూపం విశిష్టతకు, కళాకారుల జీవితాలకు నిలువుటద్దం తెరమీద ఎగిరే బొమ్మలు, అవి చెప్పే కథలే కాకుండా ఆడించేవారి అంతర్ లోకాలను. అట్టడుగున పడి కన్పించని సజీవ సత్యాలను ఈ పుస్తకం కళ్ళకు కట్టినట్టు మనముందు నిలుపుతుంది

సత్యాలన్నీ ఒకేసారి బయటకురావు. సాగర గర్భమంతటి సమాజం ఒకేసారి అర్థంకాదు. అవగతం కాదు ఒక్కరుకాదు. అనేకమంది పరిశ్రమిస్తే తప్ప అది సాధ్యంకాదు తోలుబొమ్మలాట పుస్తకంలో లేని ఒక విషయాన్ని నేను ఇక్కడ చెప్పాలనుకుంటున్నాను. తోలుబొమ్మలాట ఒక కళా ప్రక్రి యగా రూపొందడానికి దోహదపడిన పరిస్థితుల గురించి ప్రచారంలో ఉన్నదే

ఆ కథ. దీనిని ఎవరిద్వారా విన్నానో, ఎక్కడ చదివానో గుర్తులేదు. క్షమించాలి.

మహారాష్ట్ర ప్రాంతంలో ఒక దుర్మార్గుడైన రాజుతో ఏర్పడిన శత్రుత్వం వల్ల కొందరు అడవుల్లోకి పారిపోయి అజ్ఞాతంగా జీవిస్తుంటారు. వారికి ఆహారం దొరకనందున జంతువులను చంపి తినడం తప్పనిసరైంది. క్రమంగా అడవులలో, అడవుల నానుకొని ఉన్న మానవ సమాజాలతో వీరి పరిచయాలు ఏర్పడినతర్వాత రాజు దుర్మార్గాలను, దురాగతాలను వారికి చెప్పేవారు. అయితే పాటలు, మాటలే కాకుండా రాజు నిజరూపం కళ్ళకు కట్టినట్టు చూపించాలంటే, అప్పటివరకు జంతువుల తోళ్ళను పారవేస్తున్న వీరు వాటితో బొమ్మలను తయారు చేయాలనే ఆలోచనకు వచ్చారు. ఆ విధంగా తోలు బొమ్మలాటకు రూపకల్పన జరిగిందని, దీనిద్వారా ప్రజల్లో చైతన్యం తీసుకొచ్చి, దుర్మార్గుడైన రాజును ఓడించారని ఈ కథ సారాంశం.

దీని గురించిన వాస్తవాలను పరిశీలించడానికి కృషి జరిగితే, ఇది నిజమో అబద్ధమో తేలిపోగలదు. ఈ పుస్తకం మరింత పరిపుష్టం కాగలదు.

కళారూపాల పరిశోధనలో సంగీత, నృత్య సాహిత్య విషయాలతోపాటు ప్రజల సాంస్కృతిక చరిత్ర కూడా బహిర్గతం కాగలదు. భారతదేశం కులాల, తెగల సమ్మేళనం. ఏ కళారూపమైనా ఏదో ఒక కులం, తెగ యొక్క సాంస్కృతిక చరిత్రను ఇముడ్చుకొని ఉంటుంది. కళాకారులు కూడ ఒక పరిణామ దశలో, ఆనాడున్న సాంస్కృతిక అవసరాలరీత్యా ఈ కళారూపాన్ని రూపొందించి ఉంటారు. బిట్టులాగా పరిశోధకులు మిగతా కళారూపాల మీద పరిశోధన జరిపితే, దానంతటదే కులాల, తెగల సాంస్కృతిక చరిత్ర బహిర్గతం కాగలదు. భారతదేశ సాంస్కృతిక చరిత్ర రూపొందాలంటే ఈ పరిశోధన క్రమం నిరంతరం సాగాల్సిందే.

ఇప్పటికే ఎన్నో కళారూపాలు కనుమరుగయ్యాయి. మరెన్నో వికృత రూపాల్లోకి మారిపోతున్నాయి. సమయం దాటిపోకముందే మేల్కొని, జానపద కళారూపాలను వెలికితీసి, చీకటిలో దాగిన చరిత్రను బయటకు తీసుకవద్దాం. బిట్టులాంటి పరిశోధకులు ప్రేరణగా ఆ మార్గంలో పయనించి మన గతచరిత్రను తవ్వితీద్దాం. చరిత్రహీనులం గాకుండా మనల్ని మనం రక్షించుకుందాం.

—మల్లేపల్లి లక్ష్మయ్య

25.3.1993 హైదరాబాదు.

# కృతజ్ఞతలు

1982లో ఆచార్య తూమాటి దొణప్పగారు తోలుబొమ్మలాట మీద కొంత సమాచారం కావాలని అడిగారు. సత్తెనపల్లి దగ్గర రాజుపాలెంలో ఒక తోలు బొమ్మలాట బృందం వారిని ఇంటర్వ్యూ చేసి వారికి విషయాన్నిచ్చాను. అదే ఉత్సాహంతో తోలుబొమ్మలాట మీద నేనూ ఒక పుస్తకాన్ని రాయాలని నిశ్చయించుకొని కోటప్పకొండ దగ్గర ఒక మిత్రుని సాయంతో ఒక బృందాన్ని, కడపలో రేకందార్ సుబ్బారావు బృందాన్ని, అనంతపురంలో ఒక మిత్రుని సాయంతో సింధే నారాయణప్ప బృందాన్ని ఇంటర్వ్యూ చేసి విషయాన్ని సమగ్రంగా సేకరించి పదిలపరచాను పుస్తకం రాయాలంటే ప్రదర్శన మీద సమగ్ర అవగాహన ఉండాలని ఒకమారు దొణప్పగారు నాతో అన్నమాటల్ని మనసులో ఉంచుకొని, మాచర్ల పరిసరాలలోని కోలగుట్ల (మా స్వగ్రామం), ఆత్మకూరు, తాళ్ళపల్లి, దాచేపల్లి, గుంటూరు సమీపంలోని నల్లపాడు మొదలైన గ్రామాల్లో అచటి నా బంధువుల, మిత్రులసహాయంతో మొత్తం 5 ప్రదర్శనలు పరిశీలించాను. ఈ రకంగా ఈ పుస్తకం రాయడానికి ఆచార్య తూమాటి దొణప్పగారు ప్రేరకులు. ఒక Ph D విద్యార్థితో కలిసి International Folkloristics workshop series వారి Asignment లో భాగంగా తోలు బొమ్మలాట ప్రదర్శన అధ్యయన నిమిత్తం, అనంతపురం జిల్లా, ధర్మవరం తాలూకా నిమ్మలకుంట గ్రామంలోని తోలుబొమ్మలాట సహకార పరపతి సంఘం కళాకారులను కలిసి, ప్రదర్శన ఏర్పాటు చేయించుకొని పరిశీలించడం జరిగింది. ఈ బృందాన్ని ఒక మిత్రుడు పరిచయం చేశాడు International Folkloristics workshop series సందర్భంగా చదువుకున్న International Folk Performance Theries ను ఉపయోగించుకుని తోలు బొమ్మలాట ప్రదర్శనం అనే ఈ పుస్తకాన్ని రాయడం జరిగింది. 1990 లో ఆచార్య బిరుదురాజు రామరాజు జానపద విజ్ఞాన బహుమతి లభించింది పుస్తకానికి. ఆ కమిటీకి ధన్యవాదాలు. నా కృషికి ఓపికతో విషయాన్ని విపులీకరించి పునాది రాళ్ళుగా నిలచిన తోలుబొమ్మలాట కళాకారులకు నా కృతజ్ఞతలు.

ప్రచురణ నిమిత్తం తిరుమల - తిరుపతి దేవస్థానం వారు ఆర్థిక సహాయాన్ని అందజేశారు. వారికి కృతజ్ఞతలు మంచిని ప్రోత్సహిస్తూ, ఎన్నో కళా ప్రదర్శనలకు, సాంస్కృతిక విషయాలకు తన వ్యక్తిగత బలాన్ని, పలుకుబడిని సహాయంగా అందిస్తూ, తన శక్తినంతా కూడగట్టుకొని తెలుగు వారి సంస్కృతీ పురోభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతున్న శ్రీ కె. వి. రమణ గారికి ఈ పుస్తకం అంకిత మివ్వాలనుకున్నాను. మిత్రులు శ్రీ మల్లేపల్లి లక్ష్మయ్య గారు శ్రీ రమణగారిని అంకితం పుచ్చుకోవడానికి ఒప్పించారు. ఒప్పించిన శ్రీ లక్ష్మయ్యగారికి, ఒప్పుకున్న శ్రీ రమణ గారికి నా ధన్యవాదాలు.

అడగ్గానే అభినందనలు అందజేసిన పూజ్యులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారికీ, అభిప్రాయాన్ని రాసి ఇచ్చిన డాక్టర్ రావి ప్రేమలతగారికీ, శ్రీ మల్లేపల్లి లక్ష్మయ్యగారికీ, బొమ్మలు వేసి ఇచ్చిన డాక్టర్ గోపాలరాజ్ భట్ గారికీ నా కృతజ్ఞతలు. పుస్తకాన్ని అందంగా ప్రచురించిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్‌గారికి ధన్యవాదాలు. ఇందులో సహకరించిన ఎందరో మిత్రులు, బంధువులు, శిష్యులు అందరికీ నా కృతజ్ఞతలు.

బిట్టు వెంకటేశ్వర్లు
31-3-1993

## 1. తోలు బొమ్మలాటకు కట్టిన స్టేజి




1, 2, 3, 4, 5=కర్రలు

6. లైటు

7. తెర

8. పై భాగంలో కట్టిన పరదా

# II. తెర లోపలి భాగం - నేల భాగం




1. బొమ్మల బుట్ట
2. బొమ్మల బుట్ట మూత
3. హార్మోనియం
4. మద్దెల
5. తాళాలు
6. మంచం
7. బండ
8. తొక్కుడు చెక్క

9 - 10. పడమర

9 - 11. దక్షిణం

11 - 12. తూర్పు

10 - 12. ఉత్తరం

## III. తెరలోపల ప్రదర్శన : తెరముందు ప్రేక్షకులు




1. డప్పు, 2. కార్పెట్, 3. గుంజ, 4. తెర, 5. లైటు, 6. మంచం, 7 & 9. బొమ్మల బుట్ట, 8. హార్మోనియం, 10. మద్దెల, 11. తాళాలు, 12. గుడ్డబొంత, 13. బండ, 14 తొక్కుడు చెక్క, 15. పిల్లలు, 16. యుక్త వయస్సులోని యువతులు, 17. 40 – 50 సంవత్సరాల మధ్య స్త్రీలు, 18 40 – 50 సంవత్సరాల మధ్య పురుషులు, 19. & 21. ఇండ్ల వాకిళ్లలో కూర్చున్న 40 – 50 సంవత్సరాల మధ్య స్త్రీలు, 20. & 22. యుక్త వయస్కులైన యువకులు, 23 తుమ్మముల్లు, 24. తోలుబొమ్మ.

# విషయ సూచిక

పుట

# 1. బొమ్మలాట పుట్టుపూర్వోత్తరాలు:

ధర్మప్రబోధ సాధనంగా అవతరించిన బొమ్మలాట ధర్మ ప్రబోధంతో పాటు వినోదం, విజ్ఞాన, వికాసాలకు ఆధారభూతంగా విస్తృత ప్రచారం పొందింది. దీని జన్మస్థలం భారతదేశమని అనేకులు అంగీకరించారు. దీనిని ఎక్కువగా వినియోగించుకున్నవాడు అశోకుడు. అశోకుని కాలీ, గిర్నారు శిలాశాసనాలు ఈ విషయాలను తెలుపుతున్నాయని ప్రతీతి.[1]

## 1.1. బొమ్మలాట రకాలు :

ఈ బొమ్మలాటలు 1) తాళ్ళ బొమ్మలాటలు (Marrionettes or string puppets), 2) తొడుగు బొమ్మలాటలు (Glove puppets), 3) ఊచబొమ్మలాటలు (Rod puppets), 4) తోలు బొమ్మలాటలు (Coloured shadow leather puppets) అని నాల్గు రకాలు.[2] ఈ బొమ్మలాటకు వేస్తున్న రంగులు, వాటి ఆకారాలు ఆధారంగా వీటిని కొందరు 7 విభాగాలు గానూ మరికొందరు 9 విభాగాలుగానూ చేశారు. ఐతే ఆ విభాగాలలో కేవలం ఒకే పదార్థంతో చేసినపుడు చిన్నవి, పెద్దవి అని విభజన చేయడమే కన్పిస్తుంది తప్ప వేరు తేడాలు కన్పించడం లేదు. చిన్నవి, పెద్దవి అనే విభజనగానీ, లేదా వాటికి వేసే రంగుల తేడాలుగానీ, ఒకే పదార్థంతో చేసిన వాటి ఆకారాలలో తేడాలుగానీ, విభాగాల క్రింద విభజించవలసినంత సూక్ష్మ పరిశీలన పరిధిలోనికి చేర్చవలసిన అవసరంగానీ కన్పించదు. అట్లా అతిసూక్ష్మ పరిశీలనకు దిగినట్లయితే ఒకే పదార్థంతో చేసిన అనేక ఆకారాల, రంగుల విభేదాలెన్నో లెక్కకు వస్తాయి.

1. విజ్ఞాన సర్వస్వం, సం. 6. పు. 948,
2. ఎం. వి. రమణమూర్తి, తోలు బొమ్మలాటలు, నాట్యకళ, పు. 120. మే - 1969,

## 1.2. బొమ్మలాట చరిత్ర :

మధ్యప్రదేశ్‌లోని సర్గూజా సంస్థానం నందలి రామగిరి కొండల మీద సీతాబెంగా గుహలో క్రీ.పూ. 2 శ. నాటి శిలాశాసనంలో ఛాయ నాటకాన్ని గురించి కన్పిస్తుంది. ఈ గుహ ఛాయా నాటక మందిరంగా ఉపయోగపడిందని అంచనా.[3] ఉత్సవ సంధర్భాలలో వినోదం, ధర్మ ప్రబోధం కోసం, విజ్ఞాన వికాసాల ఆధారంగా ఈ ప్రదర్శనలు జరిగినట్టు శాసనాలవల్ల తెలుస్తుంది. కథా సరిత్సాగరంలో కీలుబొమ్మలను గురించిన వర్ణన ఉంది. పాల్కురికి సోమన (13 శ.) తన పండితారాధ్య చరిత్రలో-

'భారతాది కథల జీరమరుగుల
నారంగ బొమ్మల నాడించువారు
గడునద్భుతంబుగ గంబ సూత్రంబు
లడరంగ బొమ్మలనాడించువారు' అనే పద్యంలో కొయ్య బొమ్మలాటలను ప్రస్తావించాడు. శ్రీశైలంలో శివరాత్రి ఉత్సవ సందర్భంగా ఈ యాటలు ప్రయోగింపబడినట్లు చెప్పబడింది. ఈ బొమ్మలను మొదట్లో కీలుబొమ్మలని పిలిచేవారు. పాల్కురికి సోమన తన బసవపురాణంలో కీలుబొమ్మలనే ప్రస్తావించాడు. ప్రతి కీలు కదులుతుంది కాబట్టి కీలుబొమ్మలు అని పేరు పడి ఉండవచ్చు.

చైనాలో కీలుబొమ్మలే ఇప్పటికీ ప్రచారంలో ఉన్నాయి. పాశ్చాత్య దేశాల్లోని నేటి "షేడో ప్లేస్" (ఛాయా ప్రదర్శనాలు) ఇటువంటివే.[4]

### 1.2.1. దేశ విదేశాల్లో బొమ్మలాట చరిత్ర :

తోలుబొమ్మలాటకు పుట్టుక చైనా దేశమని కొందరూ, కాదు- భారత దేశమని కొందరూ అంటున్నారు.[5] ఆసియా ఖండమనేది నిర్వివాదాంశం.

---

3. విజ్ఞాన సర్వస్వం, 6-946
4. ఎల్లోరా, నేటి తోలుబొమ్మలాటలు, నాట్యకళ, పు-13; ఏప్రిల్ 1965.
5. M. V. రమణమూర్తి, తోలుబొమ్మలాటలు, నాట్యకళ, పు. 3; జూన్ 1969.

చైనా చరిత్ర గ్రంథం 'లెట్‌ట్సీ'లో బొమ్మలు చేయబడిన విధానం వర్ణించబడింది. ఇది క్రీ. పూ. వెయ్యి సంవత్సరాల నాటి పుస్తకం. అయితే భారత దేశంనుంచి కంబోడియా, బర్మా, లావోస్, సియాం, ఆఫ్రికా, గ్రీస్, రోమ్, మెసడోనియా, బిజాండైన్ ఎంపైర్, టర్కీ, ఈజిప్టు మొదలైన తూర్పు పశ్చిమ దేశాలకు వ్యాపించింది.[6]

"క్రీ. శ. మొదటి శతాబ్దంలో భారత దేశ సంస్కృతి కళా సంప్రదాయాలు, మతమూ, వ్యాపారాలతో పాటు కళలు కూడా సుమిత్ర, జావా, బలి మొదలైన దీవుల్లో ప్రవేశించాయి. ప్రస్తుతం అక్కడ ప్రచారంలో ఉన్న బొమ్మలాటను వాయంగ్ అంటారు. ఆ ద్వీపాలలోని వాయంగ్‌లో చాలా రకాలున్నాయి. వాయంగ్ వోంగ్ అనేది మన వీధి భాగవతాలతో దగ్గర సంబంధం ఉంది. "వాయంగ్ లిటిక్" అనేది కొయ్య బొమ్మలాట. "వాయంగ్ టోపెంగ్" అనేది మన బుట్ట బొమ్మల్ని పోలి ఉంటుంది. చరిత్రల్లో, పురాణాల్లో ఉండే ఉత్తమ పురుషులు, దుర్మార్గులు, దేవతలు మొదలైనవారి ముఖాకారాలను చర్మాలతోను, పేడతోను మాస్కులుగా తయారుచేసి, వాటివాటి వికారాదివేషధారణలను ధరింపజేసి, ముఖాలకు వాటిని తగిలించుకొని, ఆయా ప్రాంతాల మనస్తత్వాలకు తగినట్లు నృత్యం, అభినయంద్వారా ప్రదర్శన లిస్తుంటారు. తిరువాన్కూరు, కొచ్చిన్, మలబారు కథాకళి సంప్రదాయాలకు దగ్గరగా ఉంటుంది". ఇట్లాంటి మునుగుబొమ్మలు లేదా బుట్ట బొమ్మలు[7] మన దసరాలకు బెజవాడ, కాకినాడ, ఏలూరు, రాజమండ్రి, విశాఖల్లో కాళి, శక్తి, దుర్గ, రావణ, భేతాళ మొదలగు ముసుగు ముఖాలు ధరించి వినోద ప్రదర్శనలిస్తారు.

"ఈ జావా, బలి ద్వీపాల్లో ప్రదర్శించే తోలుబొమ్మలాటలకు తేడా లేదు. బొమ్మల ఆకారంలోను, కథా విధానంలోను, ప్రదర్శనా విధానంలోనూ, ఆడించడంలోనూ, వెనుక నుండి పాటలు పాడడంలోనూ, మనకు

6. Tolu Bommalata, Prof. M.N. Sarma.
7. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, మన బొమ్మలాటలు - భాగవతాలు, నాట్యకళ, పు. 102-105. నవంబరు-డిశంబరు-1977,

వీటితో పోలిక వుంది" అంటారు మిక్కిలినేనివారు. ఈ తోలుబ వాయంగ్ గెడక్, వాయంగ్‌పూర్వ అనే రెండు రకాలున్నాయి పూర్వలో పౌరాణికాలయిన రామాయణ, భారతాల గాథలను వాయంగ్ గెడక్‌లో చారిత్రాత్మకమైన కథలు ప్రదర్శిస్తారు. ప్రదర్శనలో తేడా లేదు. రెంటిలోనూ ఒకే బొమ్మలను, పేర్లు పెట్టి వాడుతారు.[8] ఇవి మన పౌరాణిక, చారిత్ర నాటకాల్లాంటివి.

ప్రస్తుతం మన తోలుబొమ్మలు, చెక్క బొమ్మలు సరాస యథాతథంగా ప్రవేశిస్తున్నాయి. తోలుబొమ్మలు తయారు చేసే కార పరపతి సంఘాలు పెట్టుకొని, వాటిద్వారా బొమ్మలు బొంబాయి మార్కెట్టులో అమ్మకం చేస్తున్నారు. బొం ఆ బొమ్మలు అరేబియా దేశాలకు, యూరపు దేశాలకు సరా అవుతున్న సంగతి అందరకు తెలిసిందే. ఏ పేర్లతో ఏ ఆకా రంలో ఉన్నా ప్రస్తుతం మనవే వాటిని అధిగమిస్తున్నాయి.

## 1.2.2. కొయ్యబొమ్మలాట చరిత్ర :

"పెళ్ళాడే బొమ్మ - బీబీ నాంచారి' యని పాడుతూ వి యాచకులాడించు బొమ్మల వంటివే కొయ్యబొమ్మలు. వివిధ సూత్రములుగట్టి వాటి నన్నింటిని బొమ్మల తలగుండా తెచ్చి రమునకు గూర్చి దానిని చేత నుంచుకొందురు. ఈ సూత్రముల నాడించుటకు చాలా నేర్పు కావలెను. తెరముందు వీటినుంచి తెర ప్రేక్షకులకు కన్పింపకుండ నుండి ఆడించెదరు. వీరికి తెరతో పనిలేదు. దీపము మాత్రము చాలును. వీరినే గంటె భాగవ ఆచార్య దోణప్పగారి ఉవాచ[9].

---

8. పైది.

9. విజ్ఞాన సర్వస్వం, 14 సం., పు. 948, తెలుగుభా హైదరాబాదు.

ఇట్టి కొయ్యబొమ్మలాటలు 12 వ శతాబ్దికే ఆంధ్రదేశంలో ఉన్నట్లు ఆధారాలున్నాయి. "16 వ శతాబ్దిలోని కోలారు మండలమునందలి సిద్దల ఘట్ట ప్రాంతముల బొమ్మలాట వీరప్ప కుమారుడు కిష్టప్ప, హంపి - విజయ నగరముననున్న బొమ్మలాట కాళయ, నెల్లూరు సీమలోని ఉదయగిరి ప్రాంతం లోని బొమ్మలాట వీరప్ప, అనంతపురం మండలం లేపాక్షి చుట్టుపట్లగల బొమ్మలాట సిద్దయ్య మొదలైనవారంతా సమకాలికులని" దొణప్పగారి అంచనా.[10] అయితే కేరళ, కర్నాటక, రాజస్థాన్ ప్రాంతాలలో నేటికీ కొయ్య బొమ్మలే ప్రదర్శింపబడుతున్నాయి. "వాయంగ్ లిటిక్ అనే కళా రూపం జావాలో ప్రదర్శింపబడుతుంది. కొయ్యబొమ్మలాటలో, బొమ్మ అడుగు ఎత్తు ఉండి చక్కని రూపు రేఖలతో, చిత్ర విచిత్రాలైన రంగులతో వారు సృష్టించుకున్న పాత్రకు పాత్రోచిత ఆభరణాలనూ, దుస్తులనూ ధరింపజేస్తారు. ఈ కొయ్యబొమ్మలాట ఇతివృత్తం చరిత్రాత్మకమైన గాథలతోటి, శౌర్య సాహసాలతోటి నిండి ఉంటుంది. ఈ ప్రదర్శనకు రంగస్థలం తెరలు వాడరు. ఎక్కడబడితే అక్కడ వీటిని పదర్శిస్తారు."[11]

కేరళ, కర్నాటకలలో ప్రదర్శిస్తున్న కొయ్యబొమ్మలు అడుగు ఎత్తువరకే ఉంటాయి. అంతకంటే ఎత్తైతే ప్రదర్శనలో ఇబ్బందులుండవచ్చునేమో. చెక్క బరువెక్కువైతే తాళ్ళు మోపలేని బరువు అవుతుంది. ఈ కొయ్యబొమ్మలకు అచ్చటచ్చటా బెజ్జాలుచేసి, ఆ రంధ్రాల గుండా దారాలు దూర్చుతారు. తెర వెనుక నిలబడి ఆ దారాలు పట్టుకొని బొమ్మలనాడిస్తారు. తోలుబొమ్మలను ఆడించడంకంటే ఈ కొయ్య బొమ్మల నాడించడం కష్టతరమైనపని. దీనికి ఎంతో నేర్పరితనం అవసరం. ఎంతో అనుభవమూ, ప్రతిభాపాటవాలూ ఉంటేనే ఇటువంటివి వీలవుతాయి. కాలగమనంలో సులువైన మార్గంద్వారా సాధించే ప్రతిఫలాలవైపు మొగ్గు చూపుతారు. కాబట్టి ఈ కొయ్యబొమ్మలు కేరళ, కర్నాటకలలో కూడా నెమ్మది నెమ్మదిగా తగ్గిపోతున్నాయి. వాటి స్థానాల్లో తోలుబొమ్మలు ప్రదర్శనల్లో చోటు చేసుకుంటున్నాయి.

---

10. పైది.
11. మిక్కిలినేని, మన బొమ్మలాటలు-భాగవతాలు, నాట్యకళ, నవంబరు, డిశంబరు 1967.

## 1.3. బొమ్మలాట కన్పిస్తున్న ప్రాంతాలు :

ఆంధ్ర కన్నడదేశాలలోనికి మరాఠీవారు వచ్చి బొమ్మలాట కళాకారులుగా నిలచిపోయారు. కన్నడంలో వారిని (ఆరెవారని) కి (షి) ల్లెక్యా (ఖ్యాత) జాతివారని అంటారు. ఈరు జంగాలుకూడా బొమ్మలాటలు వేస్తారు. తమిళనాటవారిని, కిల్లెక్యాతవారు అని అంటారు. బొంబాయి-మైసూరు సరిహద్దుల్లో కళుబులు, కూత్తాడీలనే నట్టువజాతివారు ప్రదర్శిస్తారు. తమిళనాటలోని మధుర, తంజావూరుల్లోకూడా కూత్తాడీలనే నట్టువజాతి వారు ప్రదర్శిస్తుంటారు. తెలుగు దేశంలో ఈ ప్రదర్శకులను బొమ్మలాటవారనీ, చర్మనాటకులనీ అంటారు. ఆంధ్రప్రదేశ్‌లో కాకినాడ, మాధవపట్నాలలోనూ, కోటప్పకొండవద్దనూ, అనంతపురం జిల్లా నిమ్మలకుంట గ్రామంలోనూ, కడప జిల్లాలోనూ, శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలోనూ ఈ బొమ్మలాట ప్రదర్శకులు ఉన్నారు. ఐతే వీరు స్థిరనివాసాలు ఎచ్చట ఏర్పాటు చేసుకోలేదు. కాబట్టి ఆంధ్రప్రదేశ్‌లో ప్రతి జిల్లాలో కన్పిస్తారు. తెలంగాణా ప్రాంతాలలో వీరు ఎక్కువగా కన్పించడం లేదు. భూములు సంపాదించుకున్న వారు మాత్రం అక్కడక్కడా బొమ్మలాట వృత్తిని వదలుకుని వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరిస్తున్నారు. గుంటూరు జిల్లాలో సత్తెనపల్లి పరిసరాల్లో కొందరు ఇట్లే వ్యవసాయ వృత్తిలో స్థిరపడ్డారు. అయితే వారు బొందిలీలు. ఆరె మరాఠీలు మాత్రం ఎక్కువ మంది ఇప్పటికీ బొమ్మలాట వృత్తిలోనే జీవిస్తున్నారు.

## 1.4. పూర్వ పరిశోధన :

ఆచార్య యస్వీ. జోగారావుగారు తన ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర అనే పిఎచ్.డి. థీసిస్‌లో బొమ్మలాట, యక్షగానాల పూర్వాపరాలు చర్చించారు. ఆచార్య తూమాటి దొణప్పగారు తెలుగు విజ్ఞాన సర్వస్వంలో బొమ్మలాట పైన ఒక వ్యాసం రాశారు. డాక్టర్ నేలటూరి వెంకట రమణయ్యగారు తమ మధుర - తంజావూరు నాయకరాజుల నాటి ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో బొమ్మలాట ప్రదర్శనపై సవిమర్శక ప్రతిపాదనలు చేశారు. డా॥ యం. కృష్ణమాచార్యులుగారు వారి సంస్కృత వాఙ్మయ చరిత్రలో బొమ్మలాట గురించి ప్రస్తావించారు. ఆంధ్రపత్రికలో మల్లంపల్లి సోమశేఖరశర్మగారు జావా ద్వీపవాసుల వినోదాలు అనే పేరుతో వాయింగ్ ఆటలు అనే వ్యాసం రాశారు. జావాలోని ఈ వాయింగ్ ఆటకు బొమ్మలాట అని అర్థం.

తెలుగునాటి బొమ్మలాటను గూర్చి ఆచార్య మొదలి నాగభూషణశర్మ గారు ఇంగ్లీషులో తోలుబొమ్మలాట అనే పేరుతో ఒక పుస్తకం రాశారు. దాన్ని కేంద్ర సంగీత నాటక అకాడమీవారు ప్రచురించారు. మోహన కవి 'సాంబయ్య బొమ్మలాట' (భారతి, 1942, పు. 49, సం. 19) అనే వ్యాసాన్ని ప్రచురించారు.

బొమ్మలాటపై విశేష కృషి జరిపిన యం.వి. రమణమూర్తిగారు తోలు బొమ్మలాటలపై నాట్యకళ అనే మాసపత్రికలో అనేక వ్యాసాలను ప్రకటించారు. ఇంకా మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు, వేలూరు రామలింగారెడ్డి గారు, ఎల్లోరాగారు, సి.ఆర్. ఆచార్యగారు, శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి గారు నాట్యకళ మాస పత్రికలో వ్యాసాల్ని ప్రచురించారు.

History of classical sanskrit Literature (Item No - 170) అనే పుస్తకంలో డా॥ యం. కృష్ణమాచారి గారు రూపోప జీవనం (అంటే బొమ్మలాట) పై చర్చించారు. A. B. Keat గారు sanskrit Drama అనే పుస్తకంలో బొమ్మలాటకు సూత్రధారి బ్రహ్మ వంటి వాడని సవిమర్శకంగా చర్చించారు. Savitry Shiva Lingappa గారు Marionettes and their Role in Society అనే పేరుతో UNESCO (Teheran) వారి డాక్యుమెంటేషన్ నుపయోగించి ఒక పుస్తకాన్ని రాశారు. Dr. B. R. Chatterjee గారు India and Java అనే పుస్తకంలో The Mahabharata and the wayang in Java అనే పేరుతో (Greater India Society Bulletin No. 5, Part I. P P 48-50) బొమ్మలాటలను కూలంకుషంగా చర్చించారు. L. V. wall గారు రచించిన The puppet Book Edited (P P 187-188) లో Paper and Faber Publication వారు అచ్చువేశారు. తమిళ సంగం కాలం నాటి Silappadigaram అనే పుస్తకంలో బొమ్మలాట నృత్యాన్ని పేర్కొన్నారు. తమిళం నుండే తిరువల్లువార్ రచించిన 'తిరుక్కురల్'లోగూడ బొమ్మలాటను పేర్కొన్నారు.

## 1.5. తెలుగు ప్రదర్శకులు :

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యంగా విశాఖ జిల్లాలో ఈదెవారు, బొందిలీలు, ఖలిజెలు; గోదావరి జిల్లాలో తెలుగు గొల్లలు, గుంపు తెగవారు; నెల్లూరు, కర్నూలు, అనంతపురం, కడప జిల్లాలలో మరాఠీవారు ఈ వృత్తిలో ఉన్నారు. అయితే తెలుగువారు ఆరెవారికన్నా ప్రదర్శనా నైపుణ్యంలో వెనుకబడి ఉన్నారు. వీరు వ్యవసాయ కూలీలుగాను, తాళాలు, పాతగొడుగుల అమ్మకాలు, స్టీలుసామాన్లు గుడ్డలకు అమ్మడం మొదలైన వృత్తులవారుగానూ ఉన్నారు. కొందరు మాత్రమే ఉపవృత్తిగా బొమ్మలాటను స్వీకరించారు. బళ్లారి ప్రాంతంలో జంగాలు బొమ్మలాట వృత్తిలో ఉన్నారు. మరాఠీ వారిని ఆరె వారంటారు. ఈ ఆరెవారు ముఖ్య వృత్తి బొమ్మలాట. వ్యవసాయ కూలీ వీరి ఉపవృత్తి. అదీకూడా వర్షాకాలంలో వారు ప్రదర్శనలు పూర్తిగా నిలిపి వేసినపుడు మాత్రమే. ఏదో ఒక ఊర్లో ఎక్కువగా ఉంటున్నా వీరు భిక్షాటనమే ఎక్కువగా చేస్తున్నారు. సంచారులుగానే వినికిడి. ఆరెవారు బొమ్మలాట ప్రదర్శనమే కులవృత్తిగా స్థిరపరచుకున్నారు. ఇతర తెగలవారు మాత్రం బొమ్మలాటను ఉపవృత్తిగా స్వీకరించారు. అందువల్లనే వారు ప్రదర్శనలలో రాణింపు తేలేకపోతున్నాయి. బొమ్మలాట ప్రదర్శనంలో ఇంటింటికి వెళ్ళి ధాన్యం, పప్పు, పదార్థాలు, బట్టలు, మేకపిల్లలు, కోళ్లు అడుక్కుంటారు. దీన్ని ధనంగా మార్చుకుంటారు. డబ్బు కూడా వసూలు చేసుకుంటారు.

ప్రధాన వృత్తిలోని ఆరె వారికి జీవనానికి లోటు లేదు. ప్రదర్శన మీద వచ్చిన ఆదాయాన్ని పొదుపుగా దాస్తూ పొలం - ప్లాటా కొనుక్కుంటున్నారు. కోటప్పకొండవద్ద, కాకినాడ దగ్గరి మాధవపట్నం, అనంతపురం జిల్లా ధర్మవరం మండలంలోని నిమ్మలకుంట ఈ బొమ్మలాట వారు స్థిరనివాసాలు ఏర్పరచుకుంటున్నా రనడానికి నిదర్శనాలు. అయితే నిమ్మలకుంట, మాధవపట్నాలలోని వారంతా ఆరెవారు. కోటప్పకొండ వద్ద మాత్రం బొందిలీలు. వీరు ఆంధ్రప్రాంతం వారే. వీరు వ్యవసాయం, వ్యవసాయ కూలీలను ముఖ్య వృత్తులుగా స్వీకరించి, ఉపవృత్తిగా తోలుబొమ్మలను స్వీకరించారు. నెల్లూరు, కడప, చిత్తూరు, కర్నూలు జిల్లాల్లో ఆరెకుటుంబాలున్నాయి వీరిలో సృజనాత్మక శక్తి గలిగి, ద్రష్టగా మారిన వనారస గోవిందరావు నాటకంలో

సంచలనాత్మక విధానాన్ని ప్రవేశపెట్టారు. అవే సురభి నాటకాలు. ఈ సురభి నాటక ప్రయోగంతో అక్షరాభ్యాసంచేసి, చైతన్యవంతులైన ఆరెవారంతా సురభి సమాజంలోనికి దుమికారు. ఆరెవారిలో సురభి అనుసరణీయులు ఆస్తి పరులకింద లెక్క. ఆర్థికంగా వీరు బలపడడంవల్ల స్థిరనివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. అందువల్ల బొమ్మలాటవారికి, సురభివారికి అంతరం కొట్టవచ్చి నట్లు కన్పిస్తుంది ప్రస్తుతం.

## 1.6. ప్రదర్శించే తెలుగు కథలు :

మొట్టమొదట రామనామ తారకం అని రామాయణాన్ని బొమ్మలాటలో ప్రదర్శించేవారు. బ్రతుకుమీద అసహ్యంపుట్టి, దేశదిమ్మరై తిరిగి చివరకు రామతారకం బొమ్మలాట చూసిన తర్వాత వేమన పద్యాలు రాయడం మొదలు పెట్టినట్లు పూర్వీకుల కథనం. "ఎలుకతోలు" అనే పద్యంలోని కొయ్యబొమ్మ-బొమ్మలాటలోనిదేనని ప్రతీతి.[12] భారతం, భాగవతాలతోపాటు దేశీయాలు కూడా చోటు చేసుకున్నాయి.

### 1.6.1. రామాయణం :

లంకాదహనం, సతీ సులోచన, లక్ష్మణ మూర్ఛ, అతికాయుని యుద్ధం (రావణుని కుమారుడు), యయాతికథ, అంగద రాయబారం, మైరావణ, రావణ వధ, పాతాళహోమం[13] మొదలైన ఘట్టాలుగా రామాయణాన్ని 8 రోజులు ఆడు తారు. అన్ని కథలలో వేమన, సుమతి, నరసింహ శతకాలు, అమరకోశం, ఓనమాలు, అక్షరాలు, తెలుగు సంవత్సరాలు, నీతిశాస్త్రం, విశ్వకోశం, ఆంధ్ర నిఘంటువులలోని నీతులు, సామెతలు సందర్భానుసారంగా వాడుకుంటారు. రామాయణ కథకు రంగనాథ రామాయణం, మొల్ల రామాయణం, సూక్ష్మ రామాయణం, మోక్షగుండ రామాయణాలతోపాటు, నీతిశాస్త్రిలలోని శ్లోకాలు, వాడుతారు. ఇందులో రామ లక్ష్మణ భరత శత్రఘ్నులు, ఆంజనేయుడు, సుగ్రీవుడు, వాలి, జాంబవంతుడు, కపిసైన్యం, రావణాసురుడు, మండోదరి,

---

12. రేకందార్ సుబ్బారావు, కడప.
13. సింధే నారాయణప్ప, ధర్మవరం మండలం, అనంతపురం జిల్లా.

సీత, కైక, సుమిత్ర, కౌసల్య, విభీషణుడు, కుంభకర్ణుడు, అతికాయుడు, ఇంద్రజిత్తు, అక్షయుడు, లంకిణి మొదలైన పాత్రలను ప్రవేశ పెడతారు.

## 1.6.2. భారతం :

విరాటపర్వం, పద్మవ్యూహం, ఉత్తరగోగ్రహణం అనే మూడు ముఖ్య ఘట్టాలతో మూడురోజుల నుండి ఎనిమిది రోజులవరకూ ప్రదర్శిస్తుంటారు. తోలుబొమ్మలాట కథలలో రామాయణ భారతాలు సమాన పాత్రను వహిస్తాయి. ఉత్తరగోగ్రహణానికి, పద్మవ్యూహానికి మంచి హడావిడి చేస్తారు. భారతంలోని పాత్రలలో దాదాపు అన్నీ ప్రవేశ పెట్టలేరు. పాండవులు, దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, ద్రోణ విదురాదులు, అభిమన్యుడు, శ్రీకృష్ణుడు, రుక్మిణి, భానుమతి, ద్రౌపది, భీష్ముడు, విరాటుడు, ఉత్తరుడు, కీచకుడు, సుదేష్ణ, పాండవుల మారువేషాల బొమ్మలు మొదలైనవి ప్రవేశ పెడతారు. వీటిలో ఎక్కువగా రామాయణంలోని బొమ్మలను వాడుకుంటారు. సమాన పరాక్రమం గల పాత్రల బొమ్మలు అటువి ఇటు, ఇటువి అటు వాడుకుంటారు. భారతంలోని కథతోపాటు నీతి శతకాల్లోని నీతి పద్యాలు, శ్లోకాలు, సూక్తులు, సామెతలు సందర్భానుసారంగా వాడుకుంటారు. భారతంలో రామాయణ కథలో వాడుకున్న నీతిపద్యాలు కూడా యథాతథంగా వాడుకుంటుంటారు.

## 1.6.3. భాగవతం :

భక్త ప్రహ్లాద, సావిత్రి, కృష్ణలీల మొదలైన కథలతో భాగవతాన్ని మూడురోజులు ప్రదర్శిస్తారు.

భారత భాగవత రామాయణాలలో ఒకే బొమ్మలను వాడుకుంటారు. లక్ష్మణుడు, అర్జునుడు, నకుల, సహదేవులకు ఒక బొమ్మను వాడటం, విభీషణుని బొమ్మను వసుదేవుడుగానూ, కర్ణుడుగానూ, ధర్మరాజుగానూ వాడుతుంటారు.

## 1.6.4. దేశీయాలు :

జింజి దేశింగురాజుకథ, పల్నాటివీరుల చరిత్ర, కరెవంటన కథ, కుమార రాముని కథ మొదలైన దేశీయాలకు సంబంధించిన కథలు కూడా ప్రదర్శి

స్తున్నారు. ఈ దేశీయ కథలకు ప్రత్యేకంగా కొన్ని బొమ్మలను తయారు చేయించుకుంటారు. పాండవుల మారువేషపు బొమ్మలు, భారత రామాయణ భాగవతాల్లోని సామాన్యుల బొమ్మలు, సైనికుల బొమ్మలు, సేవకుల బొమ్మలను దేశీయాల్లో ఆయా పాత్రల వస్త్రధారణనుబట్టి అనుకూలమైన పాత్రలకు వాడుకుంటారు. కథలకు ఆయా కథలలో ప్రాధాన్యత గలవీ, సరళంగా ఉన్నవీ స్వీకరించి, వాటిలో వేమన, సుమతి, సుభాషితాలు మొదలుగా గల నీతులను సందర్భానుసారంగా వాడుకుంటున్నారు. ఒకటి రెండు భారత కథలు, ఒకటి రెండు రామాయణ కథలు, ఒకటి రెండు దేశీయాలు కలిపి ఒక గ్రామంలో వాడుతారు. అంతేగానీ అచ్చంగా దేశీయాలు ఆడరు. అవి ప్రజల కెక్కవు.

# 2. బొమ్మలాటవారి సామాజిక పరిస్థితులు – సంప్రదాయ విధానాలు

బొమ్మలాట ప్రదర్శించటానికి 6 నుండి 10 మంది దాకా అవసరమవు తారు. మృదంగం, హార్మోనియం, తప్పెట లేదా ఖాళీ రేకుడబ్బా మొదలయి నవి వాయించడానికి నల్గురు తప్పనిసరిగా అవసరం. ప్రధాన కథకు ప్రదర్శ కులు ఇద్దరు అవసరం. ఈ యిద్దరిలో ఒకరు మగ, మరొకరు ఆడ అయి వుంటారు. పద్యం, శ్లోకం, పాట పాడేది వీరే. పద్యానికి టీకా తాత్పర్యాలుకూడా కన్పిస్తుంది. మరొక ఇద్దరు తెరమీద బొమ్మలను పెట్టెలో వేయడానికి, పెట్టెలోని బొమ్మలను తెరమీదకు అందివ్వడానికి, సన్నివేశాలను గుర్తించి వ్యవధానం లేకుండా బొమ్మలను అమర్చేందుకు ఉండాలి. ఇదిగో, ఈ అవ సరాన్ని గుర్తించే వీరిలో కొందరు ముగ్గురు భార్యలను చేసుకుంటారు. కొందరు ఒక పెళ్ళిఅయిన తరువాత, ఇద్దరినో, ముగ్గురినో శారీరక సంబంధాలు పెట్టు కొని స్త్రీలను చేరదీస్తారు. దీనినే ఉంచుకోవడం అంటారు. అంతా పెద్దవారు కూడడం ఒక కుటుంబములో కుదరదు అందువల్ల వాద్యాలకు పిల్లల్ని వాడు తారు. హార్మోనియం, మృదంగం, తాళాలవాళ్ళు తప్పనిసరిగా వంత పాడు తారు. అందరూ కలిపి పాడితే శ్రావ్యతపోయి ప్రేక్షకులకు అర్థం కాకుండా పోతుంది. ఒకోసారి ప్రధాన నాయకులలో స్త్రీ ఎల్లప్పుడు స్త్రీ పాత్రలను పట్టడం, స్త్రీ పాత్రల తరపున పాడడం జరుగుతుంది. పురుష పాత్రల్లోని బొమ్మల తరపున ప్రధాన నాయకుడు పాడుతాడు. అన్నీ అందరకు తెలియక పోవచ్చు. దాదాపు తెలీదు. ఒక్కొక్కరికి రెండు మూడు పనులు వస్తాయి. కథానాయకులిద్దరికి మాత్రం అన్నీ వస్తాయి.

## 2.1. సామాజిక పరిస్థితులు :

ముందుగా పిల్లలకు ఓనమాలు, గుణింతాలు, తెలుగు సంవత్సరాలు నేర్పిన తర్వాత వేమన, సుమతి, నరసింహ శతకాలు, అమరకోశం నేర్పు

తారు. తాళగతులను, మద్దెలను నేర్పుతారు. ఆటతాళం, త్రిపుట, జంపె, ఆది తాళాలతో రాగం, సరిగమలు, హార్మోనియం నేర్పుతారు. తర్వాత వారు భారతం, రంగనాథ రామాయణం, మొల్ల రామాయణం, మోక్షగుండ రామాయణాలలోని కథా గట్టాలను తీసుకొని నీతిశాస్త్రంలోని శ్లోకాలతో పెట్టి రాసుకున్న కథా భాగాలను, హాస్యప్రసంగాలను వరుసగా నేర్పుతారు. దాదాపు ఎవరి పిల్లలకు వారే శిక్షణ నిస్తారు. ఇతరుల వద్ద నేర్పిస్తే నేర్పిన వారికి డబ్బులు ఇవ్వాలి. పూర్తి శిక్షణ పొందటానికి ఏడెనిమిదేండ్లు పడుతుంది. కాబట్టి ప్రత్యేక శిక్షణ ఉండదు. ఆటలోనే నేర్పుతారు. ఆట సామాన్యంగా 3 గంటల నుండి 6 గంటలదాకా వేస్తారు. సుమారు 9 గం. లకు ఆట మొదలు పెడతారు. ఆట తొందరగా ముగించాలనుకుంటే కొన్ని పాత్రలను తగ్గించి పూర్తి చేస్తారు. రామాయణం ప్రదర్శించాలనుకుంటే పది రోజులు పడుతుంది. భారతం మూడు రోజులు, భాగవతం మూడు రోజులు పడుతుంది. ఒక కథా ఘట్టాన్ని ఒకరోజు పూర్తిచేస్తారు. దాదాపు ఆటను పేరే పూర్తిచేస్తారు. తర్వాత ఇంటింటికి తిరిగి డబ్బులు, ధాన్యం వసూలు చేసుకుంటారు. ఒకవేళ ఎవరైనా ముందుకు వచ్చి ఆట వేయమని అడిగితే ఎక్కువగా వసూలు చేస్తారు. ఒక్క రోజుకు 200 రూపాయలు దాకా సంపాదిస్తారు. ఆటకు ఆటకుమధ్య ఒక రోజు వ్యవధానం ఉంటుంది.

పూర్వకాలంలో రాత్రంతా ఆడేవారు. రాత్రిళ్ళు మాత్రమే ప్రదర్శిస్తారు. కాబట్టి ప్రదర్శకులకు, ప్రేక్షకులకు రాత్రంతా నిద్రవుండేదికాదు. అందువల్ల రోజువిడిచి రోజు ఆడేవారు. ఆట రాత్రికదా పగలు మేకలు, ఆవులు, గేదెలు ఉంటే వాటిని మేపుకుంటానికి పొలాలకు పోతారు. పూర్తి వేసవికాలమైతే ఆయా గ్రామాల్లోని రైతులవద్దకెళ్ళి పశువుల మేతను అడుక్కుంటారు. బొమ్మలు చిరిగిపోయినవి, కుట్లు తెగిపోయినవి ఉంటే వాటిని పగలు కుట్టు కుంటారు.

పూర్వకాలంలో ఒక ఊరినుండి వేరొక ఊరికి, గాడిదలు, గుర్రాలు, ఆవుల మీద గంతలుగట్టి సామానులు, బొమ్మల బుట్టలు వేసుకొని వెళ్ళేవారు. ఒంటెద్దుబండ్లు కూడా కొందరికి ఉన్నాయి. నిర్ణీత గ్రామానికి చేరగానే, డేరా కొట్టడం, సామానులు డేరాలో వేయడం, తర్వాత ఆట గురించి పరిశీలించడం.

కుటుంబానికి యజమాని అంతా పరిశీలిస్తుంటాడు. ఒక్కొక్క జట్టుకు 60 నుండి 100 దాకా బొమ్మలుంటాయి. ఎందరు భార్యలున్నా వారి పిల్లలందరికి సమానంగా పంచుతారు. ఇదే వీరి స్థిరాస్తి. ఆడపడచులకు మాత్రం బొమ్మ లేమీ ఇవ్వరు. వీరి వంశాలలో ఇంకా ఓలి నడుస్తుంది. కుమారుల మధ్య జ్యేష్ఠ, కనిష్ఠ భాగాలుగాని, తారతమ్యాలుగానీ లేవు. మగపిల్లలు ఎంతమంది ఉంటే యజమాని అన్ని జట్లుగా మొదటి నుండి చేస్తుంటారు. ఒకవేళ భాగ పంపిణీలో బొమ్మలు తక్కువగా వస్తే అటువంటి తక్కువవున్న జట్టుతోగాని, లేదా మరేదన్నా జట్టుతో కలిసిగాని వాటాకు పోతారు. కొంత మంది అద్దెకు కూడా తీసుకోవడం ఉంది. అంతే కానీ, వారిలో వారు అమ్ముకోవడం కనిపించదు.

ప్రదర్శనలో ఎక్కువగా మోహన, భైరవి, దేవ గాంధారి, జంజూటి, గౌళ, నాదనామక్రియ, తోడి, నాట, అరభి. రేగుప్తి, శంకరాభరణం, కన్నడ, కమాచి, అఠాణ, కాంభోజి, ముఖారి, ధన్యాసి, మాలకోస్, బిలహరి, కల్యాణి, మాయామాలవగౌళ, అసావేరి, శివరంజని, వలజ, శ్యామ, మధ్య మావతి, కాఫీ, ఉదయరాగం, భాగేశ్వరి, శ్రీరాగం మొదలైనరాగాలు పాడు తుంటారు. అందరికీ అన్నిరావు. కొందరు కొన్ని పాడుతుంటారు. ముఖ్యంగా సాహసఘట్టాలైన ఆంజనేయుడు లంకను లంఘించటం లాంటి సమయంలో నాట, భైరవి రాగాలు పాడుతుంటారు. కోపం ప్రదర్శించే సమయాల్లో శ్రీరాగం, మోహనరాగం పాడుకుంటారు. ప్రశాంత వాతావరణ పరిస్థితుల్లో కల్యాణిరాగం పాడుతారు. "తాగుడు తక్కువైతే శివరంజనీ, తాగుడు ఎక్కువైతే మోహనరాగం వస్తుంది" అనే సామెత వారి జీవన విధానాన్ని తెలుపుతుంది.

పూర్వకాలంనుంచీ బొమ్మలాట ప్రదర్శకులకు బహుమానాలు లభించి నట్లు ఆధాలున్నాయి. అనంతపురం జిల్లాలో రేగులకుంటవద్ద కేతిగాని బొమ్మతో కూడిన శిలాశాసనం ఉండేది. అది కేతిగాడి మాన్యంగా పేరు. ఆ పొలం ప్రస్తుతం వేరే రైతుల ఆధీనంలో ఉంది. బొమ్మలాట వారు ఆ పొలం కోసం వస్తారని ఆ శిలాశాసనాన్ని తీసివేశారంటారు.[1] అనంతపురం

1. సిందే నారాయణప్ప.

జిల్లాలోని బుక్కరాయ సముద్రం దగ్గర బోడిగాని దొడ్డి అనే గ్రామంలో జుట్టుపోలుగాని బొమ్మ ఉంది. ఇదే జిల్లాలో క్యారపాడు గ్రామంలో కేతిగాని మాన్యం ఉండేది. చౌటిరెడ్డి (మరుట్ల వాస్తవ్యుడు) రాజుకు బొమ్మలాట నాయకుడు శివంగులు పట్టిస్తే బంగారు కడియాలు, 10 ఎకరాల కేతిగాని మాన్యం యిచ్చి, ఒక పెద్ద రాతికి కేతిగాని బొమ్మ చెక్కించాడని ప్రచారంలో ఉంది. అప్పటి వెండి, తామ్ర శాసనాలు పోయాయి. కర్నూలు జిల్లాలోని శిల్లావోన్ (ద్రోణాచలం దగ్గర) కర్నూలు నవాబుగారు కేతిగాని మాన్యం ఇచ్చారు. అది వివాదాల్లో పడినట్టు చెబుతున్నారు.[2] నిలుపుకోలేకపోయారు.

## 2.2. ఆచార సంప్రదాయాలు :

ఆరె కులంలో తెగలున్నాయి. జ్యోతిపిర్ మరాఠీ, దర్జీ, బండిగిరి, రంగరాజు, ఆరె మరాఠీ, ఛత్రపతి శివాజీ మరాఠీ మొదలైన తెగలున్నాయి. ఆరె మరాఠీలంటే ఆంధ్రదేశంలోని బుడబుక్కలవాళ్ళు. జ్యోతిపిర్ మరాఠీలు ఎద్దులవెంట వెళ్ళి గవ్వలను పడతారు. దర్జీ, బండిగిరి, రంగరాజు అనేవారు బొమ్మల నాడిస్తారు. బట్టలకు రంగులు వేస్తుంటారు.

### 2.2.1. పెండ్లి :

ఏ తెగవారు ఆ తెగలోనే పెండ్లిండ్లు చేసుకుంటారు. నిశ్చయమైన సమయానికి వరుడు లేకపోతే పిల్లవాడి వస్తువేదయినా పెండ్లిపీటలమీద పెట్టి తలంబ్రాలు పోస్తారు. ముఖ్యంగా కత్తికి పోస్తారు. శివాజీకి వారసకులం అని, అందువల్ల అట్లా పోయడం ఆచారం అని చెప్పుకుంటారు. ముందుగా సాక్షి (నిశ్చయ) తాంబూలం పెట్టుకుంటారు. కులం వారందరిని పిలిచి భోజనం పెట్టి కంచు పళ్లెం మీద గాని, గంటమీద గాని మోగిస్తే ఫలానా వాళ్ళ పిల్లను, ఫలానా వాళ్ళ పిల్లవాడు చేసుకుంటున్నాడని అర్థం. ఒక పీటమీద దుప్పటి పరచి, దాన్ని ఆ ప్రదేశం మధ్యలో పెట్టి దానిమీద తాంబూలం పెట్టి, దానిచుట్టూ అంతా కూర్చున్న తర్వాత ఇట్లా కొడతారు. దానికి అంతా అంగీకారం తెలుపవలసి ఉంటుంది. అభ్యంతరాలుంటే అప్పుడే చెప్పాలి. అంతేకాదు, మేనరికం

---

2. రేకందార్ సుబ్బారావు.

వారున్నట్లైతే అభ్యంతరం లేదని తెలపాలి. తర్వాత తాంబూలం అందరికీ పంచుతారు. పెండ్లి ఐదు రోజులు.

## 2.2.1.1. ముహూర్తం :

ఈరోజు పెండ్లి ఇంటిముందు పందిరి వేస్తారు. తోరణాలు కడతారు. పెండ్లి వరుని ఇంట్లోనే జరుగుతుంది. ఓలి యిచ్చి వధువును స్వీకరిస్తారు. నల్ల కుండలతో బావి దగ్గరనుండి గాని, లేదా నది (గంగ) దగ్గర నుండి గాని నీటిని తెస్తారు. దీనినే గంగను తేవడం అంటారు.

## 2.2.1.2. తలంబ్రాలు :

బ్రాహ్మణుని పిలచి మంత్ర పుష్పాలు చదివించి, మాంగల్యం కట్టిస్తారు. వరుసకు మామ కుడికాలి రెండో వేలికి మెట్టెను తొడుగుతాడు. తర్వాత వధువు కాలికి పిల్లమామ (వరుని తండ్రి) మెట్టెను తొడుగుతాడు.

## 2.2.1.3. మెరివిడి :

ఊరేగింపు చేస్తారు. ఆరోజు చుట్టాలు ఉత్సాహంగా బండ్లు గుండ్లు ఎత్తుతారు.

## 2.2.1.4. నాగేలి (వసంతం) :

నాలుగు రోకళ్ళు చతురంగా చేర్చి, నాల్గుమూలల్లో నాలుగు చెంబులు పెట్టి మధ్యలో వధూవరులను కూర్చోబెట్టి స్నానం చేయిస్తారు. ఆ స్నానం తరువాత వసంతంనీళ్ళు వరుసలుగలవాళ్ళు చల్లుకుంటారు. తర్వాత చెండాట ఆడిస్తారు.

## 2.2.1.5. చెండాట :

రెండు రాళ్ళు పెట్టి వాటిమీద కర్రబెట్టి రెండువైపుల రెండు గుంపులుగా చేరుతారు. ఒకవైపు వరునివర్గం, రెండోవైపు వధువు వర్గం గుంపులుగా చేరుతారు. వధూవరులకు చెండు (బంతి) ను ఇస్తారు. దీనితో వారు ఆ కర్రను పడగొట్టాలి. ఉత్సాహంకొద్ది కాసేపు ఆ చెండాట ఆడిస్తారు.

### 2.2.1.6. 5 వ రోజు :

కుడిచేతికి కంకణం (దారానికి పసుపుకొమ్ముతో) ఉంటుంది. బాసిగం (భాషికం) ఉంటుంది. గంగవద్దకు కత్తితో వెళ్ళి అన్నీ విడిచి వస్తారు. ఇవన్నీ తొలిరోజు కట్టినవి. తొలిరోజు ఇవి కట్టి గంగనీరు తెప్పిస్తారు. గంగనీరు తెచ్చే వరకు మంచంమీదగాని, చాపమీదగాని కూర్చోరాదు. కంబళిగాని, సింహాసనంపైగాని కూర్చోవాలి. ఆ నీళ్ళతో భోజనం వండుతారు. అది బంధువులంతా భుజిస్తారు. దానిని దాసంగంబంతి అంటారు. ఆ రోజు వధూవరులు ఉపవాసం ఉండాలి. రెండో రోజు తింటారు. గంగవద్ద అన్నీ విడిచిన తర్వాత తీసుకొని వచ్చిన వధూవరులకు స్నానం చేయించి శోభనం జరుపుతారు. పిల్ల చిన్నదైతే ఐదో రోజు గంగవద్ద కంకణం విడవడంతో సరిపెట్టి, పిల్ల రజస్వల అయిన తర్వాత శోభనం జరుపుతారు. ఖర్చంతా పెండ్లికుమారునిదే. మొదటిరోజు దాసంగంబంతి, రెండో రోజు తలంబ్రాలు పడిన తర్వాత వేటలు కోసి, భోజనాలు పెడతారు. తలంబ్రాలు వేసే రోజునే అక్షింతలు వేయించి బ్రాహ్మణుడు యజ్ఞోపవీతం వరునికి వేయిస్తాడు.

### 2.2.2. రజస్వల చేసే సంప్రదాయం :

పిల్ల రజస్వల అయితే బంధువులందరికి చెబుతారు.పిల్లమేనమామ, మామ (భర్త- పెళ్ళిఅయివుంటే)లలో ఏవరో ఒకరు వచ్చి కానుగాకుతోగాని, మరేదైనా అనుకూలమైనదానితో గానీ, గుడిసె వేస్తారు. పిల్లతల్లి ఆ గుడిసె వేసిన వారికి రూ 5/- లు ఇస్తుంది. 3,5,7,9,11 రోజులు శక్తికొలది ఆ గుడిసెలో ఉంచుతారు. తర్వాత స్నానంచేయించి ఆరోజు వేటను కోయించి విందు చేసి, బంధువులందరికీ పెడతారు. బంధువులు నలుగులు (బహుమతులు) పెడతారు. నలుగులు పెట్టడం అంటే వీరి పరిభాషలో బహుమతులు ఇవ్వడం.

### 2.2.3. ప్రసవించిన బాలింతలకు చేసే ఆచారాలు :

మూడో రోజు బిడ్డను చేటలో పండబెడతారు. తర్వాత ఆ చేటను తాకకుండా దూరంగా ఉంచుతారు. తర్వాత తొమ్మిదోరోజు బిడ్డకు, కులస్థులంతా కలసి నామకరణం జరుపుతారు. విందు ఉంటుంది. ఆ రోజు బిడ్డకు ఉయ్యాల కడతారు. వేటను కోస్తారు.

## 2.2.4. శవ సంస్కారాలు :

మరాఠీలలో మనిషిని చనిపోగానే గోడకు ఆనించి కూర్చోబెడతారు. కాళ్లు పద్మాసనం వేసి, చేతులు కట్టుకొని ఉండేటట్లు, కాళ్ళుచేతులు ముడిచి కూర్చోబెడతారు. ముత్తైదువచనిపోతే పసుపు, కుంకుమ, పూలతో అలంకరణ వుంటుంది. పురుషులైతే జంధ్యం వేస్తారు. విధవైతే నొసట విభూతి బొట్లుగా పెడతారు. అయితే బంధువులంతా వచ్చేవరకు ఉంచి, తర్వాత మాత్రమే ఈ తంతు చేస్తారు. తర్వాత ఒక జోలె కట్టి జోలె నాల్గుమూలలు కలిపి తాటితో కట్టి, దానిలో పొడవైన కర్రను దూర్చి కర్రకు ముందు వెనుకల ఇద్దరు చొప్పున పట్టుకొని శ్మశానానికి తీసుకుపోతారు. గర్భవతిగా చనిపోతే కాలుస్తారు. మిగిలిన వారిని పాతర లాంటి గుండ్రటి గొయ్యి తీసి అందులో శవాన్ని తూర్పు ముఖంగా కూర్చోబెట్టి మన్ను కప్పుతారు. శవం పద్మాసనంలోను, చేతులు కట్టుకొనే ఉండాలి. శవం రక్త సంబంధీకులు స్నానాలు చేస్తారు. దేవాలయానికి వెళ్ళి దీపారాధన చేయించి దేవునికి నమస్కరించి ఇంటికి వస్తారు. పూడ్చి వచ్చిన తరువాత ఇంట్లో శవాన్ని కూర్చోబెట్టిన చోట ఒక కోడిని కోసి నిప్పులో కొద్దికొద్దిగా కాల్చి దానిని శవానికి సంబంధించిన రక్త సంబంధ బంధువులంతా నోటితో కొరికి పక్కకు ఊస్తారు. తర్వాత ఊడ్చి పారవేస్తారు. రక్తసంబంధీకులు 3 రోజులు పస్తుంటారు. 3 వ రోజుతో ఉపవాసం పోతుంది. ఆ రోజు వేటను కోసి దాని కనుగుడ్లు, మెదడు, గుండెకాయ, దొమ్మలు, కొవ్వు ప్రత్యేకంగా వండి, దానితోపాటు మరికొన్ని తినుబండారాలు కలిపి, 3 విస్తళ్ళలో బొంద దగ్గర తలవైపొకటి, రెండు పక్కల రెండు పెట్టి దూరంగా నిల్చుంటారు. కాకులు తిన్న తర్వాత ఇంటికి వెళ్ళి బంధువులంతా స్నానాలు చేసి భుజిస్తారు. 7 వ రోజు వేటను కోసి బొందదగ్గర పిండం 3 వ రోజు పెట్టినట్లే పెట్టి తర్వాత భుజిస్తారు. 12 వ రోజు సమారాధన (పెద్దకర్మ).

విస్తరిలో నిండు కుండ అన్నం పెట్టి, వేటను కోసి, దానితలను విస్తరి వద్ద పెట్టి అంతా భక్తితో నమస్కరిస్తారు. మగవాళ్ళు దండం పెడితే మేక తలయొక్క చెవి ఎగరేస్తుంది. ఆడవాళ్ళు పెడితే ముక్కు ఎగరేస్తుంది. చనిపోయిన మనిషి, అట్లా చేస్తే తృప్తిపడినట్లుగా భావిస్తారు పెద్దకొడుకు, లేదా కర్మ చేసినవాళ్ళు పూర్తిగా తల వెంట్రుకలు తీయించుకుంటారు.

3వ రోజున పిండప్రదానం. జ్యేష్ఠ కనిష్ఠ పుత్రులలో ముందు జ్యేష్ఠ కుమారుడు, అతడు లేకపోతే కనిష్ఠకుమారుడు పిండం వేయాలి. దింపుడు కళ్ళం దగ్గర ఒక విస్తరిలో పిండం పెడతారు. ఆవుగాని, కాకిగాని, చీమలు గానీ వచ్చి ఆ పిండాన్ని ముట్టేవరకు అచ్చటనే నిలబడతారు. కుక్క వచ్చి ముట్టితే నీచంగా భావిస్తారు తర్వాత యింటికి వస్తారు. ఈరోజు బంధువులంతా వస్తారు. భోజనాలుంటాయి.

7 వ రోజు కలశం పూజ చేస్తారు. బంధువులు వస్తారు. వేటను కోస్తారు. నెలకు పెద్దదినం. ఆరోజు వేటను కోస్తారు. కలశానికి పూజచేసి విందు చేసుకుంటారు. పెద్దదినం వరకు చనిపోయిన ఇంట్లో తీపి తినరు. అలంకరణలు ఉండవు. సంతోషాన్ని తెలిపే విషయాలేవి జరుగవు. సంవత్సరాని కొక్క మారు వైకుంఠ సమారాధన చేస్తారు. బీదవాళ్ళు మూడేళ్ళకొక్కసారి చేస్తారు. శవాన్ని పాతిన చోటునే సమాధి అంటారు. ఒక బండకు పేరు, చనిపోయిన సం॥, నెల, తేదీ, వయస్సు అన్నీ సవివరంగా రాయించి సమాధివద్ద పాతుతారు. శవానికి చెందిన రక్త సంబంధీకులు క్షుర కర్మ పెద్దదినం రోజు చేయించుకుంటారు. పెద్దదినం రోజు బ్రాహ్మణుడు పుణ్యతీర్థం (పుణ్యాగం) చల్లి, ఇంటిని శుద్ధి చేస్తాడు.

## 2.2.5. శకునాలు :

చిన్నంగినక్క (కళేబరాలు తినవు, పండ్లు, కాయలు, ఎలుకలు, గువ్వలు దీని ఆహారం) ఎదురుగా వస్తే మంచిది. శవం, విడిచిన బట్టలమూట, మంగలి పొదితో ఎదురుగా వస్తే శుభం. స్వప్నంలో పాము కన్పించడం మంచిది. స్వప్నంలో మూత్రవిసర్జన జరిగినట్లు, ఇతరులు పెట్టగా అన్నం తిన్నట్లు రావడం, మాంసాహారం, కల్లుతాగడం శుభం. నలుగురు వర్తకులు, నల్గురు శూద్రులు, ఆకులగంప, గాజులు, పండ్లు, పూలు, అన్నం, సద్ది ఎదురురావడం మంచిది.

## 2.2.6. అశుభాలు :

చిన్నంగి నక్క అరవకూడదు. ఆటకుపోయే ముందు రాత్రి పిల్లులు పోట్లాడకూడదు. తడిబట్టలమూట, మంగలి పొది లేకుండా విడిగా, విధవ,

కట్టెలు, తేనె, నూనె, పాము, బ్రాహ్మడు, పిల్లి ఎదురుగా రాకూడదు. పిల్లి తన ఆహారాన్ని పట్టుకొని అడ్డంగా వెళ్ళితే మంచిది. ముందు తుమ్మితే మంచిది కాదు. స్వప్నంలో పాము వెంటబడి తరమడం, పూలు, మంగళ వాద్యాలతో వధూవరులు కన్పించడం, భోజనం ఇతరులకు పెట్టినట్లు రాకూడదు. ప్రయాణమై పోతున్నప్పుడు వధూవరులు మేళతాళాలతో ఎదురుగా రాకూడదు.

## 2.2.7. కుల పెద్దలు - కుల తప్పులు :

మొట్టమొదట మహారాష్ట్ర నుండి ప్రాణభీతితో పారివచ్చారు. ఇచ్చట స్థిరపడ్డారు. గురువు లేడు. ఉన్న ప్రాంతంలో ఉన్నవాళ్ళలో పెద్దవాళ్లే గురువులు. కుల పెద్దలు గురువుతో సమానం. ఆ పెద్దే కులతప్పు నిర్ణయించడం ఉంటుంది.

భర్తకు ఇష్టం లేదని భార్యను వదిలివేస్తే ఆమెకు భరణం తప్పకుండా ఇవ్వాలి. భరణం యిచ్చి వదిలివేసినా వానిని పచ్చని పందిరి కిందకు, పెళ్ళిళ్ళకు శుభకార్యాలకు రావడానికి వీలులేకుండా శిక్షిస్తారు. అంటే అది జరిగిన తర్వాత ఆ అన్యాయం దృష్టిలో పెట్టుకొని, 3 నెలల నుండి 3 సం॥ రాలు శుభకార్యాలకు రాకుండా కులతప్పు విధిస్తారు. మరలా ఈ అర్హత సంపాదించాలంటే, అంటే సింహాసనం మీదకు రావాలంటే తప్పుకు శిక్ష చెల్లించి, కులంలోకి రావచ్చు, అంటే కొన్నాళ్ళపాటు వెలివేయడాన్ని జరిమానా చెల్లించి కులంతో కలువవచ్చు.

దానికి తప్పు చేసినవారి ఆర్థిక స్తోమతను, చేసిన తప్పును దృష్టిలో పెట్టుకొని జరిమానా విధిస్తారు. అతడిచ్చిన జరిమానాతో వేటలు కోయించి, విందు చేయించి కులం వాళ్ళంతా అతడు వడ్డించగా విందారగిస్తారు. ఈ జరిమానా కట్టకుండా లగ్నం చేయకూడదతనికి. అంటే సింహాసనం (పెండ్లిపీటలు) ఎక్కకూడదు. ఎవ్వరూ పిల్లనివ్వరు. ఒకవేళ యిస్తే అంతా పిల్లనిచ్చిన వాళ్ళను వెలి వేస్తారు. జరిమానా కట్టి రెండో పెళ్ళికి తయారుకావచ్చు.

ఒకవేళ స్త్రీ భర్తను వదలివెళ్ళి మరొకడితో ఉంటే, ఆమెను వెలి వేస్తారు. ఒక స్త్రీకి, మరొక పురుషుడితో అక్రమ సంబంధం ఉంటే, భర్తగానీ, లేదా

మరొకరుగానీ ఫిర్యాదు చేస్తే కులపెద్దలు అక్రమ సంబంధం గల పురుషునికి 2 పాళ్ళు ఆమెకి ఒక పాలు కుల తప్పు విధిస్తారు. ఆమె తప్పుకు జరిమానా ఆమె భర్త చెల్లించాలి. జరిమానా పెద్దలు స్వీకరించి, విందు చేసుకుంటారు. అతడు 2 పాళ్ళిచ్చి నల్గురి సమక్షంలో ఆమె కాళ్ళు పట్టుకుని, ఆమె తల్లితో సమానమని, పొరబాటు జరిగిందని అంగీకరించి, కులతప్పును అంగీకరించి, జరిమానా చెల్లిస్తాడు. అక్రమ సంబంధమున్నా వారిద్దరికి చెందిన వారెవ్వరూ ఫిర్యాదు చేయనట్లయితే ఆ రెండు కుటుంబాలను వెలివేస్తారు. సింహాసనం ఎక్కడానికి, పందిరి కిందకు రావడానికి వారికి అర్హత ఉండదు. కులతప్పును విధించడం, కులపెద్దల తీర్పును అంగీకరించడం ఇప్పటికీ జరుగుతూనే ఉంది.

## 2.2.8. చిట్కా వైద్యాలు :

కొన్ని జబ్బులు, వాటి వైద్యాల విషయంలో వీరికి కొన్ని నమ్మకా లున్నాయి. పసి పిల్లలను ముట్టు మనిషి, (బహిష్ఠురాలైన స్త్రీ) ముట్టుకుంటే (ఏడాది ముదరక ముందు) పచ్చ విరోచనాలు అవుతాయి. ఆమె ముట్టు స్నానం చేసి ఆ తలనీళ్ళు తడవకుండా పిల్లవాని మాడున పదేట్లు వేస్తే తగ్గుతుంది. ముండ్ల పావరకాయ, గాచీ కాయ గాని వంట ఆము దంలో పిండి దాన్ని కలిపి మాడుకు రాయాలి. విరోచనాలు తగ్గుతాయి. గర్భిణీ స్త్రీ తాకితే వాంతులు విరేచనాలు అవుతాయి. వెనగడ్డ (పొలాలలో గెనుసు గడ్డవలె భూమిలో దొరుకుతుంది) తెచ్చి పసుపు, కుంకుమలతో మెడలో కడితే పోతుంది. ఆరునెలల తర్వాత దిష్టి తగిలితే నూనెలో చనుబాలు వేసి కాస్తే నూనె కాగకుండా, పాలు కన్పించకుండా పోతాయి. పొలంతిరిగి వచ్చిన వాళ్ళు కాళ్ళు కడుక్కోకుండా పిల్లలను ముట్టుకోకూడదు. ఒక ఊరినుండి మరొక ఊరు వెళ్ళేటప్పుడు పిల్లలు పట్టుకున్న వాళ్ళు తంగెడ మండలు విరిచి, బాటలో వేసి దాటుతారు. ఒక మండ ఇంటివరకు తెచ్చి దాన్ని నిండు కుండ నీళ్ళలో ముంచి పిల్లలకు దిగదూడుస్తారు. లేకుంటే పిల్లలు చీదర చేసుకుంటా రని నమ్మకం. 5, 7, 11, 12 నెలలకు నెలల సంధి వస్తుంది చిన్నపిల్ల చేష్టా వస్తే, సాంబ్రాణి కడ్డీ కాల్చి మగపిల్లలకు కుడినొసట, నుదుట కాల్చాలి. ఆడపిల్లలకు ఎడమ నుదుట నొసటన కాల్చాలి. దీన్ని రక్ష వేయడం అంటారు. లేకుంటే సున్నపు నీళ్ళతో సాది, ఆ నుదిటి నొసటన చుక్క పెడితే తగ్గి పోతుంది.

భార్యా భర్తలు పిల్లలకు ఒక సంవత్సరము లోపుననే కలిస్తే పిల్లలు బాగా ఎదగరు. లేకుంటే బాగాఎదుగుతారు. పిల్లలకు బాలగ్రహ శ్లేష్టలు వస్తాయి. ఏదైనా పిల్లలకు దిష్టి తగిలిందని నమ్మకం కుదిరినపుడు నిండుకుండ అన్నము, ఒక ముద్ద తీసి, ముద్దచేసి, పసుపు కుంకుమ పూసి, ఒక ఆకుతో రెండు బాటలు కలిసేచోట చెంబునీళ్ళు పోసి, ఆ ఆకును పెడతారు. దోషం పోతుందని నమ్మకం. తపసు పక్షి ఎముకల పూసలు దారానికి 3, 5, 9, కుచ్చి మగ పిల్లవానికి మొలకు, బాలికలకు మెడకు కడతారు. అందువల్ల కాళ్ళుచేతులు బలంగా తయారవుతాయని నమ్మకం.

జరిగినవారు పులిగోరు సాధించి దాన్ని బంగారం లేదా రాగితో బిళ్ళ చేయించి దాని మధ్యలో పులిగోరుని పెట్టి మెడకు కడతారు. నల్లదారంతో మెడలో వేస్తారు. పులిగోరు కుచ్చుకోకుండా రాగి బంగారు తొడుగులుగా చేస్తారు. ఇందువల్ల ఎలాంటి వ్యాదులు, ఇబ్బందులు రావు. కామెర్లయితే తెల్ల జిల్లేడు కొమ్మను చిన్న ముక్కలుగా కోసి, జిల్లేడు తాటకే దూర్చి మెడలో వేస్తారు. జబ్బుతగ్గితే మెడలోదండ సాగుతుంది. కొద్దిగా పెద్దపిల్లలైతే వజకొమ్ము రోజూ ఒకటి తినిపిస్తారు. మెడలో దండగా కట్టి, దండలోనివి అయిపోయేవరకు తినిపిస్తారు. వజకొమ్ములు పూర్తిగా అయిపోయేటప్పటికి కామెర్లు తగ్గుతాయి.

## 2.2.9. కండ్లకలక :

పసిపిల్లలకు పటిక తెచ్చి నిప్పుపై పెట్టి పొంగించి, ఆ పొంగును తీసి రాత్రిపూట కంటిలో వేస్తారు. మూడు రోజులేస్తే తగ్గుతుంది. పెద్దలకైతే వేప, చింత, నేరేడు ఆకులు తెచ్చి కలిపి నీళ్ళతో నూరి రసం పిండి దానిలో పటిక, లవంగా వేసి ఆ రసాన్ని ఇనుపగంటెలో వేడి చేసి అది గట్టి పడిన తర్వాత కొంచెం చల్లారనిచ్చి, కనురెప్పలకు, కణతలకు, నొసలుకు పట్టువేస్తారు. 3 రోజులకు తగ్గుతుంది. దూసరాకు + రాగులు కలిపి నూరి, ఆముదపు ఆకులో పెట్టి తలకు కడితే - కండ్లు వేడి చేసి ఎర్రబడితే తగ్గుతుంది. వేపాకు చింతాకు ఉడకబెట్టి రాత్రి పడుకునేముందు ఆ ఆకును కళ్ళకుమీద పెట్టి గుడ్డతో కట్టుకుంటే ఆ రోజుకు వేడి చేసినట్లైతే తగ్గుతుంది.

# 3. బొమ్మలాట వృత్తి

ఏ వృత్తి కళాకారులకైనా వారి వృత్తిలోని ప్రతి అంశమూ పరిచయమై ఉంటుంది. కళలో అనుభవం పెరిగే కొద్దీ ఆ కళా ప్రదర్శనకు అవసరమైన సామగ్రి, పరికరాలు, వాద్యాలు, తగినంతమంది సహ కళాకారులను సేకరించుకోవడం మొదలైనవన్నీ కను సన్నలలో ఉంచుకుంటారు. అదే పద్ధతిలో బొమ్మలాట ప్రదర్శకులు కూడా బొమ్మలను తయారు చేసుకోవడం, వాటిని భద్రపరుచుకోవడం, వాద్యాలను, ఇతర పరికరాలను సేకరించుకోవడం వారికి అత్యంత అనుకూలమైన విషయాలుగా ఉంచుకుంటారు. వాద్యాలు, పరికరాలను వారే స్వంతంగా తయారు చేసుకుంటారు. వారి వృత్తిలో ముఖ్య అంశాలుగా ప్రదర్శన సామగ్రి, పరికరాలు, వాద్యాలు, బొమ్మలు మొదలైనవాటిని గమనించవచ్చు.

## 3.1. ప్రదర్శన సామగ్రి-పరికరాలు-వాయిద్యాలు :

బొమ్మలాట ప్రదర్శనలో ముఖ్యంగా హార్మోనియం, తప్పెట, మద్దెల లేదా మృదంగం, తాళాలు మొదలగు వాయిద్యాలు అవసరం. వీటితోపాటు ఇంపైన ధ్వనినిచ్చే గజ్జెలు ముఖ్య ప్రదర్శకులు కాళ్ళకు కట్టుకుంటారు. తొక్కుడు బల్ల ఉంటుంది. కొందరు తొక్కుడు బల్ల బదులు ఖాళీ రేకుడబ్బాలు వాడుతారు. ఈ డబ్బాలు కొందరు తప్పెటకు బదులుగా కూడా వాడుతారు. బొమ్మల ప్రదర్శనలో ఆడించడానికి బొమ్మలకు ఈతపుల్లలు గడతారు. అవి చేతివ్రేళ్ళ వద్ద దారాలు కట్టి వాటిలో ఈ పుల్లలు దూరుస్తారు. జావా,బలి ద్వీపాల్లో వాయంగ్ లిటిక్ (కొయ్య బొమ్మలాట)కు రంగస్థలం తెరలు వాడరు. ఎక్కడ బడితే అక్కడ ఆడుతారు. వాయంగ్ గెడక్, వాయంగ్ పూర్వ (తోలు బొమ్మలాట)లో మాత్రం రంగస్థలం,తెర ఉంటాయి. బొమ్మలాట ప్రదర్శకులు,

---

1. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, నాట్యకళ, నవంబరు - డిశంబరు 1967 పు. 103.

బొమ్మలాడించటానికి మొదట ఒక గదిలాగ ఏర్పాటు చేసుకొంటారు ఇది పూర్తిగా తాత్కాలికం ఐదారు పెద్ద కర్రలు 10 లేదా 12 ఎదురుబొంగులు ఊర్లో తిరిగి ప్రజల నుండి సేకరించి, వీటిని చుట్టూ పాతి, పైన వక్కలలో ఇవి తాళ్ళతో కట్టి చతురస్రాకారంలో ఒక గదిని ఏర్పాటుచేస్తారు. ఈ తాళ్ళు ముఖ్యంగా వగ్గాలై ఉంటాయి. కొంచెం లావుండే పొడవాటి తాళ్ళు ఇవి. ఈ గదికి వెలుపల అంటే కర్రల వెలుపల చుట్టూ తడికెలు కడతారు. కర్ర లుండటం వల్ల గాలికి కదలకుండా ఉంటాయి. ఈ తడికెలు పైన కూడా తడికెతో మూతవేస్తారు. వారు ప్రదర్శనలు ఏర్పాటు చేసేది వేసవికాలంలో. దాదాపు వర్షాల భయం ఉండదు.

ఈదురు గాలులు, పెద్ద పెద్ద కొండ గాలులు ఆకస్మికంగా వచ్చినా పైన మూయబడిన తడికెలు బొమ్మలకు రక్షక కవచాల్లాగా పని చేస్తాయి. లోపలి భాగంలో పర్దా పట్ట మూడు వైపులనూ, పైనా కడతారు. ఈ పర్దా పట్ట బయటనుండి తడికె సందుల్లో నుండి వచ్చే గాలిని అడ్డుకుంటుంది. వెలుపలి గాలి లోపల ప్రవేశిస్తే దీపాలు ఆరిపోతాయి. బొమ్మలను ఆడించే తెర కదులు తుంది. తెర కదులుతూవుంటే ప్రేక్షకులకు బొమ్మలు సరిగ్గాను, నిలకడగాను కనిపించవు. తెర కదలకూడదు. ఈ పర్దా పట్ట గాలిని అడ్డుకొని తెరను నిలకడగా ఉంచుతుంది. వెలుపలి వెలుతురును లోపలకు రాకుండానూ, లోపలి వెలుతురు వెలుపలకు వెళ్ళ కుండానూ, అడ్డుకుంటాయి. వర్షం బారి నుండి బొమ్మలను రక్షిస్తాయి. కొందరు చుట్టూ తడికెలు దొరకక పట్టలను మాత్రమే వాడుతారు. దాదాపు ఈ పట్టలను బొమ్మలాటవారే వెంట తీసుకొని వెళతారు. బొమ్మలాటవారిలో బీదవారు ఈ పట్టలను, గోతం (గోనె) సంచులను చింపి, ఒకదాన్ని మరొకదానితో కలిపి కుట్టుకుని వారే స్వయంగా తయారు చేసు కుంటారు. కాస్త డబ్బున్నవారు లారీలపై వేసే పట్టల లాంటి పట్టలు కొను క్కుంటారు. డబ్బున్న వారు ఆడే ప్రదర్శనలో స్టేజీ బాగా తయారు చేసు కొంటారు. లైట్ల విషయంలోను, స్టేజీకి కట్టే తాళ్ళు, కర్రల విషయంలోనూ, తెర గుడ్డల విషయంలోనూ ఇతరులపై ఆధారపడరు. వారే అన్ని సమకూర్చు కొంటారు. బీదవారైతే అన్నీ అడుక్కునే స్థితిలోనే ఉంటారు. పర్దాలకు బదులు చుట్టూ రంగు చీరలు వాడేవాళ్ళు కూడా ఉన్నారు.

ఇవి సొంతం లేనివాళ్ళు ఏ గ్రామంలో ఆట వేస్తున్నారో ఆ గ్రామంలోని చాకలింటికి పోయి ఈ రంగు చీరలు సేకరించుకుంటారు. మరలా ఆటలు అయిపోయిన తర్వాత వారివి వారికే ఇస్తారు. కర్రలు మాత్రం ఎక్కువమంది ఇంటింటికి తిరిగి సేకరించుకునే పద్ధతినే అవలంభిస్తారు. గ్రామకక్షలు ఎక్కువగా ఉండే గ్రామాల్లో కర్రలు, ఇతర పరికరాలు సేకరించుకునే విషయంలో తగు జాగ్రత్త వహిస్తారు. ఏ బజారులో సేకరించినవి ఆ బజారుకు వెళ్ళేటప్పుడు ఆ బజారులోనే అక్కడే ఇస్తారు.

కర్రలు సుమారు 8 అడుగుల పొడవులో వుంటాయి. ఆటను గ్రామస్థులు ఏర్పాటుచేస్తే బొమ్మలాట వాళ్ళు ఈ కర్రలను వారి నుండి పోగుచేసుకుంటారు. ఏర్పాటు చేస్తున్న ముఖ్యులలో ఒకరి సహకారంతో ఇంటింటికి తిరిగి ఎవరింట్లో ఉంటే వారి నుండి ఈ కర్రలు సేకరిస్తారు. ఆటలు అయిపోయిన తర్వాత ఎవరివి వారికే యిస్తారు. ఒకవేళ బొమ్మలాట వారిని ప్రదర్శన ఏర్పాటు చెయ్యమని ఎవరూ అడగని పక్షంలో బొమ్మలాట వారే ఇల్లిల్లు తిరిగిగాని లేదా ఒక్కొక్క బజారులో బొమ్మలాటంటే ఉత్సాహం చూపే వారిని ఆశ్రయించి వారిద్వారా గానీ, కర్రలు సేకరించుకుంటారు కర్రలతో పాటే తడికలు కూడ. పల్లెటూర్లలో ఎడ్లబండ్లమీద వేసే తడికలు ఈ స్టేజీకి సమాన కొలతల్లో ఉంటాయి. అయితే గ్రామాల్లో పెత్తందార్లుగానీ, గ్రామాధికారులుగాని, సంపన్న కుటుంబాలవారుగాని వీటిని సేకరించడానికో, గ్రామస్థులను అడగడానికో తిరగరు. బొమ్మలాటవారు కూడా ఇటువంటి గ్రామంలో పెద్దవారనుకునే వాళ్ళ ఇళ్ళ ముందు ప్రదర్శనలు ఏర్పాటు చేయడానికి కుతూహలపడతారు. ఆ నిర్ణయం చేసుకున్న తర్వాత ఆ గ్రామ పెద్దల కనుసన్నలలో మెదిలే చిన్న రైతులనో, వారి యెడల భయ భక్తులను ప్రదర్శించేడివారినో, వారి అభిమానులనో ఆశ్రయించి "ఫలానా వారి ఇంటి ముందు ఆటవెయ్యాలని ఉంది, మీరు సహాయపడాల"ని అడుగుతారు. గ్రామాధికారుల అభిమానాన్ని పెంచుకోవాలనుకునే గ్రామాధికారుల అనుచరులు తప్పకుండా ఈ బొమ్మలాట వారికి సహాయ పడతారు. బొమ్మలాటవారి వెంట తిరిగి అన్నీ సమకూర్చి పెడతారు.

ఈ గ్రామాల్లోని పెత్తందార్లు కొందరు తమ ఇండ్ల ముందు ఆట వేయడానికి చాలా ఉబ్బిపోయి వారి జీతగాండ్ర ద్వారా అన్నీ వారే ఇస్తారు. ముఖ్యంగా అరకసామానులైన నగలు, ఈ దడి పాతడానికి కర్రలుగా ఇస్తారు. అరకలకువాడే పగ్గాలు దడి కట్టడానికి తాళ్ళుగా యిస్తారు. ఇళ్ళలో ఉండే పర్దా పట్టలు దడి చుట్టూ కట్టుకోవడానికి ఇస్తారు. వాళ్ళ ఇంటి చాకలిని పిలిచి వారితో తెరగుడ్డకు ఏదేని సైను గుడ్డనో, తెల్లటి చీరనో ఇప్పిస్తారు. పెద్దవారి సహాయం లభించినపుడు వీరు గ్రామాల్లో పని పాటల వారుగా చెలామణి అవుతున్న వారివద్దకు పోతారు. ముఖ్యంగా చాకలివారివద్ధకెళ్ళి వారిని అర్థించి, వారి సహకారంతో కర్రలు, పర్దాలు. తాళ్ళు సేకరించు కుంటారు. తెర గుడ్డ మాత్రం వారే ఇస్తారు. ఈ తెరగుడ్డకు తెల్ల చీర లేదా తెల్లని సైను గుడ్డను కడతారు. కొందరు దోమల తెరకు వాడే గుడ్డను వాడుతారు. కొందరు తెల్లని మల్లుగుడ్డను వాడుతారు. ఎక్కువ మంది ఈ తెరగుడ్డను వారే తెచ్చుకుంటారు. ఏ గుడ్డను వాడినా గుడ్డ సన్నగా వుండి లోపలి లైటుకాంతి వెలుపలకు ప్రసరించేటట్లు ఉండాలి. ఈ దడి కట్టే ప్రదేశములో రాళ్ళు రప్పలు లేకుండా శుభ్రం చేసుకుంటారు.

ఈ దడిని ఎక్కువగా నేలపైనే ఏర్పాటు చేసుకుంటారు. అరుగులపైన గాని, రచ్చబండలపై గాని, వంచ, లేదా వరండాలోగానీ, కచ్చేరీ, పంచాలలో గానీ కొన్ని గ్రామాలలో ఏర్పాటు చేయరు. కొన్ని గ్రామాల్లో అటువంటి కట్టుబాట్లు ఉంటాయి. గ్రామాధికారులముందు అరుగులు ఎక్కడం వారికి నిషిద్ధం. అందువల్ల వారికి వినయాన్ని ప్రకటిస్తూ వీరు నేలపైన ఏర్పాటు చేసుకొంటారు. బలిదీవుల తోలుబొమ్మలాట ప్రదర్శనకారులు ఒకే ఒక కాంతివంతమైన ప్రమిదను తెరకు మధ్యభాగంలో ఉంచుతారు. ఆ భాషలో దీనిని దయర్ అంటారు. ప్రమిద మధ్యలో ఉంటుంది. పాత్రలు ఆ ప్రక్కకూ ఈ ప్రక్కకూ ఉపక్రమించేటప్పుడు క్రమేపి వెలుతురు తగ్గిపోయి అకస్మాత్తుగా నిష్క్రమణ జరుగుతుంది.[1] దడిని ఏర్పాటు చేసిన తరువాత లోపల లైట్లను ఏర్పాటు చేసుకుంటారు. పూర్వపురోజుల్లో ప్రమిదలు వేలాడ దీసేవారు. తెర అంతటికి కలిసేటట్లు 6 ప్రమిదలు దడిలోపలి భాగంలోనూ. తెరకు దగ్గరగాను వేలాడదీస్తారు. ఈ దీవపు కాంతులు బొమ్మలపై పడడం వల్ల తెర ద్వారా వెలుపలి ప్రేక్షకులకు బొమ్మలు స్పష్టంగా కనబడతాయి. బొమ్మలు

కూడా కాంతి ప్రసరణలుగా తయారు చేస్తారు కాబట్టి తెరపై లోపలివైపునున్న ఈ బొమ్మల రంగులు దీపపు కాంతుల ద్వారా స్పష్టంగా కన్పిస్తాయి

ఈ ప్రమిదల్లో పూర్వకాలంలో ఆముదం లేదా వేపనూనెపోసి వెలిగించేవారు. రాత్రి అంతా వెలిగినా ఎటువంటి ఇబ్బంది ఉండదు ఇందువల్ల. ప్రమిదలు దాదాపు వారివే ఉంటాయి. నూనె కొనుక్కుంటారు. ఈ మధ్యన ప్రమిదలకు బదులు పెట్రోమాక్సు లైట్లు వాడుతున్నారు. పెట్రోమాక్సులైట్లు రెండు చివరల రెండు పెడతారు. ఈ పెట్రోమాక్సు లైట్లను అద్దెకు తీసుకుంటారు. అద్దెకు దొరకని మారుమూలకు వెళ్ళవలసివస్తే దగ్గరలోని చిన్న చిన్న పట్టణాల నుండి ఇవి సేకరించుకుంటారు. బాలా మంది ఇవి సొంతంగా కొనుక్కుంటారు. ఇపుడిపుడే గ్రామాలలో విద్యుత్తు సౌకర్యాలు చేకూరడం వల్ల బొమ్మలాటలకు కరెంటు లైట్లు వాడుతున్నారు. ప్రక్క ఇండ్ల నుండి వైరుద్వారా లాగుకొని బల్బుల సహాయంతో ఇవి వాడుతారు. ఇవైతే మధ్యలో ఒక బల్బువాడితే సరిపోతుంది.[1] తొక్కుడుబల్ల లేదా పాత రేకుడబ్బాలు వారి వెంటనే ఉంటాయి. ఇవి ఎక్కువ శబ్దాన్ని ప్రసరింప జేయడానికి వాడుతారు. ముఖ్యంగా కోపాన్ని తెలిపే సన్నివేశాల్లోనూ, పండ్లు కొరుకుతున్నట్లు నటించే సన్నివేశాల్లోనూ, యుద్ధ సన్నివేశాల్లోను, ఎదుటివారిని కొడుతున్నట్లు ముఖ్యంగా గదాయుద్ధం, ముష్టియుద్ధం, మల్లయుద్ధాలలో ఎక్కువ శబ్దాన్ని తెప్పించడానికి డబ్బా వాడుతారు. ఇక తబల లేదా మద్దెల లేదా మృదంగం, తప్పెట, తాళాలు, హార్మోనియం, అన్నీ సొంతవే అయిఉంటాయి. బొమ్మలు వారి నివాస ప్రాంతం నుండి, పెద్ద వెడల్పుపాటి బుట్టల్లో పెట్టుకొని తెచ్చుకుంటారు. అవన్నీ లోపలే పెట్టుకుంటారు. వెంటనే అవసరమైన బొమ్మలు విడివిడిగాతీసి దడిలో ముళ్ళ సహాయంతో లోపలి భాగంలో అందుబాటులో తగిలిస్తారు. అవసరమైన వెంటనే వాటిని తీసుకుంటారు.

ఆట మొత్తంలో కీలకమైన పాత్ర వహించేవి ముళ్ళు. ఎక్కువగా తుమ్మముళ్ళు వాడుతారు. పొడవుగానూ, సన్నగానూ ఉండడంవల్ల తెరకు గానీ, బొమ్మకుగానీ నష్టాన్ని కలుగజేయవు. జాల, బలుసు ముళ్ళు గట్టి

1. మిక్కిలినేని, నాట్యకళ, నవంబరు, డిశంబరు 1967 పు. 105.

దసంలో చాలా మన్నికే అయినప్పటికి, లావు ఎక్కువగానూ, పొడవు తక్కువగానూ ఉండటంవల్ల బొమ్మకు, తెరకు బెజ్జాలుపడే అవకాశాలున్నాయి.

తెరలకు ఆ ముళ్ళు గుచ్చడంవల్ల ఏర్పడిన బెజ్జం తెరగుడ్డ చిరగడానికి అవకాశమున్నది. ఈ బెజ్జాలు స్పష్టంగా వెలుపలకు కన్పిస్తాయి. తుమ్మముళ్ళు గుచ్చినపుడు ఏర్పడిన బెజ్జాలు గుడ్డలో కలిసిపోతాయి. కన్పించవు. అందువల్ల తుమ్మముళ్ళే ఎక్కువమంది వాడుతున్నట్లు సర్వేలో తేలింది. ముళ్ళను ఊరి వెలుపల తుమ్మచెట్ల వద్దకు వెళ్ళి కొమ్మలు వంచి తీసుకుంటారు. ఈ ముళ్ళను పచ్చి చెట్టునుండే తీస్తారు. ఎండిన ముళ్ళకంపనుండి తీయరు. ఎండిన ముళ్ళు కొమ్మనుండి తీస్తుంటే విరిగిపోతుంటాయి. పచ్చివి తీసేటపుడు విరగవు. ముళ్ళు 'V' ఆకారంలో చెట్టు కొమ్మకు ఉంటాయి. వాటిని అట్లాగే తీసుకొని రెండుగా విడగొట్టుకొని ఎండబెట్టుకుంటారు. పచ్చిముళ్ళు వాడరు. వంగిపోతుంటాయి. అందువల్ల ఎండిన తర్వాత వాడుతారు. ఈ ముళ్ళను బుట్టలోగానీ, ఖాళీ డబ్బాలోగానీ దాచుకుంటారు. ప్రదర్శన సమయంలో ఎక్కువగా బుట్టనే వాడుతారు. ఎందుకంటే తెరమీది బొమ్మను తీస్తున్నపుడు ముళ్ళను నిలబడే బుట్టలోనికి విసిరివేస్తారు. అదే డబ్బా అయితే మూతి వెడల్పు తక్కువగా ఉండటంవల్ల ముళ్ళు డబ్బాలో వేయాలన్నా, డబ్బానుండి తీయాలన్నా కష్టంగా ఉంటుంది. వెడల్పు మూతి ఉన్న డబ్బా అయితే బాగుంటుంది గానీ, బరువు ఎక్కువ. రాకపోకలలో వస్తువుల బరువు తేలికగా ఉండాలి కదా! బుట్ట తేలికగా ఉండటం వల్లనూ అనుకూలంగా ఉండడం వల్లనూ, బుట్టలనే ఎక్కువమంది వాడుతారు. ఈ బుట్టలు, దూసర తీగ, వెదురుతోను, పాలతీగ, పాముకోర తీగ, కంది, ప్రత్తి చువ్వలతోనూ, కొండ చువ్వలతోనూ, ఎవరికి అనుకూలమైన చువ్వలతో వారు అల్లుకుంటున్నారు.

ఈ బుట్ట దాదాపు వారే అల్లుకుంటారు. ఇటువంటి చిన్న చిన్న పనులు అన్ని తెలిసి ఉంటాయి. బుట్ట అల్లుకోలేని వారు బస్తీలలో గాని, పల్లెలలో బుట్టలల్లే వారివద్ద గానీ అల్లించుకొని వాడుతుంటారు. బొమ్మలాట ప్రదర్శనకు కావలసిన పరికరాలు, సామగ్రి, వాయిద్యాలు దాదాపు ప్రతి బొమ్మలాట బృందం సంపాదించుకుంటారు. ఈ సామానంతా ఒక గ్రామంనుండి మరొక గ్రామానికి వెళ్ళడానికి ప్రతి కుటుంబానికి ఒకటి లేదా రెండు బండ్లు ఉంటాయి.

వీటికి ఎద్దులు లేదా దున్నలు కడతారు. కొందరు ఆవులు, గేదెలు కడతారు. ఇవైతే యిటు పాడికి, అటు బండి లాగడానికి, ఉపయోగించుకోవచ్చు. ఎక్కువ మంది దున్నపోతులను కొంటారు. ఎద్దులను కాయడం వరాయి గ్రామాల్లో కష్టం కాబట్టి, దున్నపోతులైతే ఏ వాగువక్కనో, డొంకవెంటనో వాళ్ళ పిల్లలతో కాస్త గాలికి తిప్పించుకోవడం సులభం కాబట్టి ఎక్కువ మంది దున్నలను వాడుతారు. ఆ గ్రామాల్లోని మోతుబరి రైతులనుండి పశువులకు మేతను అడిగి తెచ్చుకుంటారు. వీరి సంసారమంతా ఆ బండిలో దున్నపోతులు లేదా ఎద్దులు ఊరూరా తిప్పుతాయి.

## 3.2. తోలుబొమ్మలు చేసే విధానం :

పూర్వకాలంలో చెక్కబొమ్మలు వాడేవారు. చెక్కబొమ్మలకు సిరి చందనం చెట్టు చెక్కతో అడుగు పొడవున బొమ్మలు చేసేవారట.

1. సిరిచందనం అనేది ఆడచెట్టు పోతుచందనం అనేది మగచెట్టు. సిరి చందనం చెక్క బొమ్మకు నునుపును, వాసనను తెస్తుంది. చెక్కకు మెరుపు (నున్నగా చేయడం) పెట్టి ఒకవైపు మాత్రమే రంగు వేసేవారు. జావాలో వాయంగ్‌లిటిక్ (కొయ్య బొమ్మలాట) లో వాడే బొమ్మలు ఒక్కొక్కటి అడుగు ఎత్తు ఉంటాయి. బొమ్మ రూపురేఖలు చక్కగా చేసి, రంగులు వేసి, పాత్రో చితమైన ఆభరణాలు, దుస్తులు తగిలిస్తారు. చెక్క బొమ్మల తర్వాత అట్ట బొమ్మలు కొన్నాళ్ళు ప్రచారం పొందాయి. వాటిని ఆడించారు. ఈ అట్టల (కాగితాల)కు ఒకవైపే రంగు వేసేవారు. రెండువైపుల రంగు వేస్తే రంగు అన్నింటికి అంటి చెడిపోతుందని ఒకవైపే వేసేవారు. 2. కాని మన్నిక పెద్దగా ఉండేదికాదు. కొందరు చైనా పేపరుతో తయారు చేసుకొనేవారు. 3. తర్వాత తోలు బొమ్మలు ప్రచారంలోనికి వచ్చాయి. వాటినివారే తయారు చేసుకుంటారు. బొమ్మలకు జింక, దుప్పి, మేక, మేకపోతు, కొండగొర్రె మొదలైన వాటి తోళ్ళు వాడుతారు. గొర్రె, గొర్రెపొట్టేలు తోళ్ళు వర్షాకాలంలో ముడుచుకు పోతాయి. కాబట్టి ముఖ్యమైన బొమ్మలకు ఈ చర్మం వాడరు. ఇతర ఏవైనా చెట్లు, బండి లాంటి బొమ్మలకు వాడుతారు. ఎక్కువమంది జింక, మేక, దుప్పి తోళ్ళనే వాడుతుంటారు

జింక, దుప్పి చర్మాలు దొరకడం కష్టం. వాటిని దేవతా విగ్రహాలైన గణేశ, సరస్వతి, శ్రీరామ, సీత, లక్ష్మణ, శ్రీకృష్ణ మొదలైన పాత్రలకు వాడుతారు. జావా బలి ద్వీపాల్లోని వాయంగ్ గెడక్, వాయంగ్‌పూర (తోలుబొమ్మలాటలు)లకు బొమ్మలు తోలుతోనే చేస్తారు. కాని వీరు బొమ్మలు ఉదాత్త పాత్రలకు సైతం వికృత ఆకారాలు పెడతారు. పొడుగు ముక్కు, పొడుగు చేతులు వికార స్వరూపంలో ఉంటాయి. దీనికి ఒక కారణం చెబుతారు. 15 వ శతాబ్దంలో జావాను మహమ్మదీయులు ఆక్రమించుకొన్నారు. అప్పటికి విస్తృతంగా హిందూ మతాన్ని ప్రచారం చేస్తున్న బొమ్మలాటలను ప్రజల మనసుల నుండి వేరు చెయలేక వాటిని మానవాకృతులకు అతీతంగానూ, వికృతంగానూ ఉండేటట్లు మహమ్మదీయ మత ప్రవర్తకుడు సునూనన్ మెరియా తయారు చేయించాడని ప్రచారంలో ఉంది. ఆవు దూడ, గాడిద చర్మాలు మందంగా ఉంటాయి. రాక్షస, సైనిక, ఇతర చిన్న చిన్న పాత్రలకు వాడుతుంటారు. గాడిద చర్మం నలుపు వస్తుంది. చైనాలో గాడిద చర్మంతోను గ్రీసు[4] టర్కీ[5] దేశాలలో ఒంటె చర్మంతోను ఈ బొమ్మలు చేస్తారని తెలుస్తుంది.

గేదె, దున్న, ఎద్దు, ఆవుల చర్మాలు దళసరి అయినప్పటికి ప్రస్తుతము యంత్రాల సహాయంతో పొరలు తీసి బొమ్మలకు వాడుతున్నారు.[7] సామా

---

1. రేకందార్ సుబ్బారావ్.
2. పైది.
3. సింధే రాజారావు.
4. యం. వి. రమణమూర్తి, తోలు బొమ్మలాటలు - ప్రథమ గ్రంథం, నాట్యకళ, 68, జులై 1969.
5. కూర్మా వేణుగోపాలస్వామి, బొమ్మలాటలు - తోలుబొమ్మలు, నాట్యకళ, ఫిబ్రవరి - మార్చి 70.
6. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, మన బొమ్మలు, నాట్యకళ, నవంబరు - డిశంబరు 1967.
7. యం. వి. రమణమూర్తి, తోలుబొమ్మలాటలు ప్రథమ గ్రంథం, నాట్యకళ. పు. 68, జులై 1969.

న్యంగా గ్రామాల్లో మేకలు ఎక్కువగా ఉన్నవారుకానీ, దానబుద్ధిగల ధనవంతులు గానీ ఇవి బొమ్మలాట వారికి ఇస్తారు. అంటే వీరు ప్రదర్శిస్తున్న కాలంలో ఒకవేళ మేకలను కోసినట్లయితే వీరు దానంగా అడిగిగానీ, లేదా ధరకు కొనిగానీ సేకరించుకుంటారు. బస్తీలలోనైతే కసాయిదుకాణాల వద్ద కొంటారు. అయితే కసాయిదుకాణం వారు తోలు చెడిపోకుండా ఉప్పు పెడతారు. కొందరు తంగెడచెక్క నీళ్ళలో వేస్తారు. అట్టి వాటికి చర్మంపైని వెంట్రుకలు ఊడిరావు. తోలు ఎర్రగా మారుతుంది. రంగు పట్టదు. తోలు లావెక్కుతుంది. అందువల్ల కసాయిదుకాణం వారికి ముందుగా చెప్పిన స్వచ్ఛమైన పచ్చి తోలును తీసుకొని ఒక పరిమితిలో కాగిన నీళ్ళలో సబ్బు కలిపి తోలును ఆ నీళ్ళలో ముంచుతారు. నీరు ఎక్కువగా కాగితే తోలు ముడుచుకొంటుంది తోలు కాలివైపు భాగాన్ని వేడినీళ్ళలో ముంచి, ఆ వేడిని గుర్తిస్తారు. సరిపడే వేడి అనుకున్నపుడు నీళ్ళలో మూడు నాలుగు సార్లు ముంచి తీస్తారు. ఆ తోలును చదునైన పెద్ద బండమీదగాని, చాపమీదగాని, బోర్లా పరచి చేతితో తోలుమీది వెంట్రుకలు తీస్తారు. సులభంగా వస్తాయి. తర్వాత బావివద్దకో లేదా నీటి తొట్టివద్దకో తీసుకెళ్ళి తోలుకు రెండువైపులా సబ్బు పెట్టి లోపలి భాగాన కత్తితో నజ్జంతా తీసివేస్తారు. ఈ నజ్జునే బక్కిపొర అంటారు. ఇది చర్మానికి కరుచుకొనివుండే పల్చని మాంసం పొర. ఈ మాంసం పొరలలో ఉండే ఎగుడు దిగుళ్ళు అన్నీ తీసివేసిన తర్వాత దాన్ని నీళ్ళతో శుభ్రంగా కడిగి తెల్లనివి ఒకటి రెండు గుడ్డలు ఒకదాని మీద ఒకటి ఎండలో పరచి వాటిమీద చర్మం పరచి ముడతలు లేకుండా తోలు కొసలకు మేకులు కొడతారు.

ఆ విధంగా లాగి తగిన విధంగా చిల్లలు లేదా మేకులు కొట్టకపోతే ఎండకు తోలు ముడుచుకుపోతుంది బొమ్మకు పనికిరాదు తోలు ఒకరోజులో అరుతుంది రెండో రోజుకూడా తోలును సబ్బుతో బాగా కడిగి మరలా తొలి రోజువలెనే ఆరవేస్తారు. ఏమైనా కొద్ది కొద్ది నలకలున్నా అవన్నీ పోతాయి. తోలు బాగా అరిన తర్వాత మేకులు ఊడదీసి, తోలుచుట్టూ మేకుల కోసం చేసిన రంధ్రాల భాగాలన్నీ కత్తెరతో కత్తిరించి వేస్తారు. ఈ తోలు తెల్లగా ఉండి ఒక వైపు వస్తువులు రెండో వైపు కన్పించేటంత నిర్మలంగా ఉంటుంది. అందువల్లనే ఈ తోలుగుండా దీపపు కాంతి ప్రసరించి బయటి ప్రేక్షకులకు

బొమ్మ అందం తెలుస్తుంది. ఈ తోలుపై పెన్సిలుతో కావలసిన బొమ్మ ఆకారంలో ముందు బొమ్మ గీస్తారు కొందరు పాత బొమ్మల తోలుపై పెట్టి వాటి ఆకారాన్ని హద్దుల వెంప కత్తిరించుకుంటారు. పెన్సిలుతో వేసిన బొమ్మ కుదిరిన తర్వాత కత్తెరతోగాని, గోరుగాలతోగాని (గోరుగిల్లుడు) పెన్సిలు గీతల మీదనే కత్తిరించి తెంచివేస్తారు. గుండ్రని ఆకారం రావలసిన చోట్ల వృత్త లేఖినిని వాడుతారు. దీనినే వీరు కైవారం అంటారు. తర్వాత నగిషీ పనులు చేస్తారు చంద్రహారం, పూలహారం, కిరీటం, వజ్ర వైడూర్యాది ఆభరణాలు, గొలుసులు మొదలగు రకరకాల ఆకారాల్లో ఆభరణాలు వచ్చే టట్లు పోగరుతో చేస్తారు అంటే మామిడి పిందె ఆకారంలో ఉండే పోగరు, గుండ్రముగా ఉండే పోగరుల ఆకారాలతో తోలును కోసివేస్తారు. తెరమీద ఈ రకరకాల ఆకారాల్లోని బెజ్జాలు దీపపు కాంతికి ఆభరణాలుగా మెరుస్తాయి. ఈ పోగరుతో తోలును కోసేటప్పుడు తోలును గేదె కొమ్ము మీద పెట్టి కోస్తారు.

కొమ్ము పోగరును మొనలు విరగ కుండాను, మొద్దుబారి పోకుండాను, చేస్తుంది. ఇట్లాగే బెజ్జాలు పెట్టే పోగర్లు గుండుపోగర, దబ్బపోగర, కత్తెర చెక్క, గోరుగాల, సూది, కత్తెర, చాకు, మణేలల సాయంతో ఒక ఆకారానికి తెచ్చిన తోలుమీద రంగులు వేస్తారు. మీసాలు, తలకు నల్లరంగు, దేహానికి ఎర్రరంగు వాడుతారు. పూర్వపు రోజుల్లో ఈ రంగులు స్వంతంగా తయారు చేసుకునేవారు. కాని ఇప్పట్లో కొట్లల్లో దొరికే అద్దకం రంగులన్ని తెచ్చుకొని వేసుకొంటున్నారు. పూర్వకాలంలో ఎరుపు రంగుకు నాగజెముడు పండ్లరసం వాడేవారు.[1] కొందరు మోదుగ పువ్వు, చవిటి బిళ్ళలతో (చవిటి భూములలోని మట్టి బిళ్ళలు) కలిపి బాగా ఉడికించి ఆ ద్రవాన్ని ఎరుపురంగుగా వాడేవారు. ఇది పోదు.[2] నల్లరంగుకు దీపపు మసిని గోడకు పట్టించి, ఆ మసిని తీసి బాగా నానిన వేప బంకలో నీళ్ళతో బాగా కలిపి ఆరబెడతారు. బాగా ఆరిన తర్వాత మరలా నీరుపోసి మెత్తగా కలిపి మరలా ఎండ బెడతారు. ఇట్లా పది రోజులు ఎండ బెడతారు చిక్కగా వచ్చిన తర్వాత చిన్నబిళ్ళలుగా చేసుకుంటారు.[3] అవసరమైనపుడు ఆ బిళ్ళమీద నీరు వేసి చాది ఆ రంగును నల్లరంగుగా వాడు కుంటారు.

---

1. రేకందార్ సుబ్బారావు 2. సిందే నారాయణప్ప, దళవాయి రామప్ప
3. రేకందార్ సుబ్బారావు, కడప, బొమ్మలాట నాయకుడు.

తెలుపురంగు వేయవలసిన చోట తోలుకు రంగు వేయకుండా వదిలి పెడతారు. లోపలి దీపపు కాంతి కిరణాలు ఈ తోలు గుండా ప్రసరించి, రంగు వేయనిభాగంలో బొమ్మలు తెల్లగా కన్పిస్తాయి. ప్రస్తుతం కిరాణాషాపులనుండి రోజా, ఎరుపు, ఊదా, పసుపు, ఆకుపచ్చ, బునుగు, మిఠాయిరంగు, నలుపు రంగులు తెచ్చి వాడుతున్నారు. నీళ్ళతో కలిపిన రంగులు వాడుతారు తోలు బొమ్మలకు వార్నీషుతో కలిపి రంగులు వేయకూడదు - ఈ రంగులు వేయడంలో చాలా పనితనం ఉంటుంది. వారిలో కొందరు బట్టలకు రంగులు వేసేవృత్తిని చేపట్టినవారుకూడా ఉన్నారు. అట్లాంటివారు సులభంగా బొమ్మలకు రంగు వేయగలరు. ఈ రంగులు వేసేవారిని 'రంగరాజులు' అంటారు.[1] ఎక్కువ అనుభవం గడించినవారి వద్ద మాత్రమే ఈ బొమ్మలు చేయిస్తారు. దర్భపుల్లలతోగానీ, జొన్న బెండు సన్నగా చీల్చి అవసరమైనంతవరకు వెడల్పు చేసి ఆ జొన్న బెండుతోగానీ, రంగునీళ్ళలో ముంచి బొమ్మలకు రంగులు వేస్తారు. కొందరు పుల్లకొనకు గుడ్డ లేదా దారం లేదా దూదిచుట్టి దాన్ని రంగులో ముంచి రంగులు వేస్తారు. రంగులు వెడల్పుగా వేయవలసినపుడు ఈ పుల్లను లేదా బెండును వెడల్పుగాకట్టి దానితో వేస్తారు.

బొమ్మలు వేసేటప్పుడు, తోలును చదునైన బండమీద పెట్టి మాత్రమే వేస్తారు. రంగు మోతాదు వారివారి అభిరుచులనుబట్టి వేస్తుంటారు. బొమ్మలు ఎక్కువగా తయారుచేసిన వారికి చత్వారం వస్తుంది. చత్వారం వచ్చిన వాళ్ళు బొమ్మలకు రంగులు వేయలేరు. రంగులు అతి జాగ్రత్తగా వేయాలి. ఈ బొమ్మలు కూడా విడివిడిగానే తయారు చేస్తారు. అంటే దేహం, కాళ్ళు, చేతులు, తల తెగవలసిన పాత్రలైతే ఆ అవయవాలను వేరువేరుగా తయారు చేసి, వేరుగానే రంగులు వేసి, తర్వాత దారాలతో ఆ బొమ్మల భాగాలను

1. సింధే నారాయణప్ప, ధర్మవరం మండలం, అనంతపురం.

కలిపి పట్టుకొని ఆడిస్తారు. అభినయంలో కదలడానికి అనువుగా ఈ కాళ్ళు చేతులు కడతారు. దేహం మధ్య భాగంలో అంటే రెండుకాళ్ళ మధ్య కొంచెం ఎక్కువగాను, పట్టుకోవడానికి అనువుగాను, ఉండే ఈ పుల్లను చీల్చి బొమ్మకు రెండు వైపులా రెండు చీలికలు వచ్చేట్లు కడతారు. కాళ్ళ మధ్య భాగంలోని పుల్లను పట్టుకొని ఆడిస్తారు.

ఈ బొమ్మలు ఏకపటం, సూత్రం బొమ్మ అని రెండు రకాలు. ఏక పటానికి రెండు తోళ్ళు (శరీరానికి ఒక తోలు, కాళ్ళు, చేతులు కలిపి ఒక తోలు) కావాలి. సూత్రం బొమ్మకు మూడు తోళ్ళు కావాలి.

పెద్ద బొమ్మలు చేసేటప్పుడు తోలునుండి కత్తిరించిన చిన్న చిన్న ముక్కలనుగాని, ఆ బొమ్మలో ఇమడని ఒక మోస్తరు పెద్ద తోలు ముక్కలనుగాని వృధాగా పోనీయరు. చిన్న చిన్న ముక్కలను బాణం, పశువులు, రథాలు, చెట్టు, కుండ, బుట్ట మొదలైన పరికరాలు తయారు చేయడానికి వాడుతారు. కొంచెం పెద్ద ముక్కలతో చిన్న ఆకారాల్లో ఉండే బొమ్మలు, హనుమంతుని చిన్న రూపం, మరికొన్ని చిన్న కోతులు, చిన్న రామలక్ష్మణులు (మైరావణ చరిత్రలో ఉపయోగించేవి) బొమ్మలు చేస్తారు. హనుమంతుని బొమ్మ నాల్గు ఐదు ఆకారాల్లో చేస్తారు. చిన్నవి $1\frac{1}{2}$ అడుగులు ఉంటాయి. మధ్య రకం బొమ్మలు 4 అడుగులు, పెద్దవి ఐదారడుగుల వరకూ ఉంటాయి. ఒక బొమ్మకు తోలు ఖరీదు కాక 15 రూపాయల రంగులు పడతాయి. తోలు బొమ్మలకు గ్రామాలలో తోలును ఎక్కువ మంది దానం చేస్తుంటారు. దాతలను ప్రదర్శకులు ప్రదర్శన కాలాల్లో రోజూ ప్రశంసిస్తుంటారు. ప్రశంసలకు లొంగిపోయే వారు ఎక్కువమంది ఇట్లాంటివి ఇచ్చి ఇంకా పొగడించుకుంటారు. ఒకమారు వేసిన రంగులు దాదాపు పోవు. ఒకవేళ నీళ్ళు తగిలి పోతే మరలా వేసుకుంటారు. ఎలుకలకు, నిప్పుకు, నీటికి, కుక్కలకు, దూరంగా దాచుకుంటారు. ఎలుకలు కొడితే ఆ బొమ్మను పారవేయవలసిందే. రంగులు పట్టవు. అతుకులు స్పష్టంగానూ, తేడాతోనూ కన్పిస్తాయి. అట్లాంటి బొమ్మలను వాడరు.

అందువల్ల వీటిని భద్రంగా వెదురుకర్రతో తయారు చేసిన బొమ్మల పొడవున్న పెద్ద బుట్టలలో దాస్తారు. ఆ బుట్టలను ప్రదర్శనల వద్దకు అట్లాగే తీసుకెళ్ళుతారు. తయారు చేయడం అందరికి చేతకాదు. చేతనైన వాళ్ళుకూడా అవసరం మేరకే తయారు చేసుకుంటారు. బొమ్మలు తయారు చేసేది దాదాపు ఆడించేవాళ్ళు ఐతే బొమ్మలు తయారు చేయడం కుటుంబములో ఎవరో ఒక్కరు నేర్చుకొని ఉంటారు. దాదాపు ఇంటి పెద్దకు అన్ని విషయాలలో ఆరితేరినట్లే బొమ్మలు చేయడం కూడా తెలిసి ఉంటుంది. ఈ బొమ్మలు చేసేటప్పుడు ఇతరుల సహాయం పెద్దగా ఉండదు. నజ్జు తీసేటప్పుడు, తోలును నీటిలో ముంచేటప్పుడు, తోలును ఆరవేసేటప్పుడు బొమ్మ ఆకారం గీసేటప్పుడు, ఒక మనిషి సహాయపడితే చాలు. ఇటువంటివి కుటుంబానికి 50 నుండి 100 బొమ్మల వరకు తయారు చేసుకొంటారు. బొమ్మలు కూడా తయారు చేసుకో గలిగిన బొమ్మలాట వాళ్ళు వారి కళలో మేటిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించడంతో పాటు ఆర్థిక సంపాదన ఎక్కువగానే ఉంటుంది.

# 4. ప్రదర్శన సందర్భాలు

సామాన్యంగా ఆంధ్రప్రదేశ్‌లో తోలు బొమ్మలాట వారు శివరాత్రి, ఉగాది పండుగల [అంటే మార్చి] నుండి ప్రదర్శనలకు బయలుదేరుతారు. అప్పటివరకు వర్షాకాలపు ఇబ్బందులవల్లనూ, వ్యవసాయపు పనుల భారంవల్లనూ గ్రామీణులు తీరిక లేకుండా ఉంటారు. పగలంతా పనుల శ్రమవల్ల రాత్రికి బాగా అలసిపోతారు. పనుల వత్తిడి ఆ కాలంలో ఎక్కువగా ఉంటుంది. అందువల్ల జూలై నుండి ఫిబ్రవరి వరకు బొమ్మలాటకు ప్రదర్శన యోగ్యమైన కాలం కాదు. బొమ్మలాటకు బయలుదేరేముందు వీరి ఇంటివద్ద పనులన్నీ ముగించుకుంటారు. కొద్దిపాటి పొలాలుండడంవల్ల వీరు వ్యవసాయపు పనిముట్లు ముగించుకొనిగాని లేదా ఒకరిద్దరిని ఇంటివద్ద నిలిపిగాని తక్కినవారు బయలుదేరుతారు. కొందరు మేకలను, గేదెలను పెంచుతారు. అందువల్ల ఇంటివద్ద ఒకరో ఇద్దరో ఉండవలసివస్తుంది. కొందరి విషయంలో బయలుదేరే ముందు వారు ప్రదర్శన ఇవ్వ దలచుకున్న ప్రాంతంలో తెలిసిన వారికి ఉత్తరం రాస్తారు. లేదా ఒకరు వెళ్ళి ఏదేని ఒక ఊళ్ళో గ్రామ పెద్దనో, గ్రామాధికారినో కలుస్తారు. వారు ఆహ్వానించేటట్లయితే, ఆ ఊర్లో మకాం వేస్తారు. లేదా ఊరు పెద్దదై ఉండి పెద్దల నుండి ఆహ్వానం లభింపకపోయినా ఆ గ్రామ ప్రజల నుండి ఎక్కువ డబ్బు వసూలు చేసుకోవచ్చుననుకుంటే బొమ్మలాటవారే, ఆ ఊరిలో మకాం వేస్తారు. దాదాపు ప్రతి బొమ్మలాట జట్టుకు ఒక బండి, రెండు దున్నపోతులు గాని, ఎడ్లుగాని ఉంటాయి. ఎద్దులైతే వాటికి పగలు మేతకు ఇబ్బంది ఉండదు. గ్రామాల్లో ఎవరినో ఒకరిని అడిగితే ఇస్తారు. దున్నపోతులైతే మేత వరకు పర్వాలేదు. మార్చి నుండి జూన్ వరకు వేసవి రోజులు కాబట్టి ఎండకు తాళలేక ఒగిరిస్తాయి. అవి తప్పనిసరిగా నీటి మడుగులో మునగడానికి తహతహలాడుతుంటాయి. పగలు ప్రత్యేకంగా ఒక మనిషి వాటిని ఊరి వెలుపల నీటి ప్రాంతానికి తోలుకుపోవలసి ఉంటుంది. ఎద్దులవల్ల ఈ యిబ్బందులుండవు. కాబట్టి కొందరు ఎద్దులను కొంటారు. ఇబ్బందులున్నా

కొందరు దున్నలకు బదులు గేదెలను ఉపయోగించుకుంటారు. పాడికి, బండి లాగడానికి ఇవి ఉపయోగిస్తాయి.

ఈ బండితో వారు ఏకంగా ప్రదర్శించదలచుకున్న గ్రామానికి దిగుతారు. ముందుగా ఆహ్వానించబడిన ఊరయితే వీరి పని సులువు. ఆ గ్రామంలోని పెద్దలెవరో ఒకరు వీరికి ఊత నిస్తారు. ఒకరినో లేదా ఇద్దరినో సహాయం వంపుతారు. వారి సహాయంతో, ఆ పెద్దల పేరు చెప్పుకుని ప్రదర్శనకు కావలసిన వరికరాలు, కర్రలు, వర్గాలు, తెరగుడ్డలు సేకరించుకొంటారు. గ్రామానికి చేరింది మొదలు ఆట మొదలు పెట్టటానికి నాలుగైదు రోజులు కాలం గడుపుతారు. అందువల్ల ఈ నాల్గు రోజులు ఇల్లిల్లు తిరగడం తమని తాము పరిచయం చేసుకోవడం జరుగుతుంది. ఈ నాలుగు రోజులలో గ్రామస్థులలో ఆట ఉత్సుకత పెరుగుతుంది. ఈ నాల్గు రోజులు భోజన సదుపాయాలు గ్రామస్థుల నుండే పొందుతారు. దీనికి గూడ పెద్ద మనుషులు సహకరిస్తారు. కొందరు ఈ ఆటలను శ్రీరామ నవమికి మొదలు పెట్టిస్తారు. మరికొందరు ఉగాదికి మొదలు పెట్టిస్తారు. కొన్ని గ్రామాల్లో ఆటకు ఏదో కొంత నిర్ణయించి గ్రామస్థులే వసూలు చేసియిస్తారు. కొందరు వర్షాలు లేనప్పుడు ఉత్తర గోగ్రహణం లాంటి కథలు ప్రదర్శింపజేస్తారు. అట్లా చెప్పిస్తే వర్షాలు బాగా కురుస్తాయని నమ్మకం.

ఎవరూ ఆహ్వానించకపోతే బొమ్మలాట వారి పని కొంచెం ఇబ్బందులతో మొదలవుతుంది. ఐతే సంపాదనకు లోటు ఉండదు. సామాన్యులు ఎక్కువగా ఆదరిస్తారు. అందువల్ల బొమ్మలాటవారు మధ్యతరగతి కుటుంబీకులమీద ఆధారపడతారు. పశువుల మేతకు కొందరిని, ఆట మొదలు పెట్టేవరకు మొదటి నాల్గు రోజులు ఒక్కో యింట్లో ఒక్కరికి చొప్పున భోజనాలు అడిగి పెట్టించుకుంటారు. కొందరు చాకలి వారిమీద ఆధారపడతారు. చాకలి వారికి బట్టలు ఉతికినందుకు అన్నం పెడతారు గ్రామస్థులు. దాన్ని బొమ్మలాటవారికి కేటాయిస్తారు. గ్రామాల్లో ఇటువంటి కళాకారులను పిలిచి భోజనం పెడతారు. పశువులకు మేతను ఇస్తారు. ప్రదర్శనకు ముఖ్యంగా బజారు కూడళ్ళను ఎన్నుకుంటారు. లేదా విశాలమైన ప్రాంతాన్ని ఎన్నుకుంటారు. ఆటకు అనువైన చోటు (ఒకవైపు తెర ఉంటుంది) ఎన్నుకుంటారు. దడిని

నేలపైననే ఏర్పాటు చేస్తారు. అరుగులు, రచ్చబండలు, వరండాలు ప్రదర్శ నకు ఉపయోగించరు. అవి ఎక్కకుండా ఉండడం ఆ గ్రామ పెద్దలయెడ గౌరవం చూపడంగా భావిస్తారు. ఒకవేళ ఎవరయినా అరుగుమీదనో, రచ్చ బండమీదనో ప్రదర్శించడానికి సాహసిస్తే గ్రామస్థులు ఆటవారినికొద్దిగా అవమా నిస్తారు. కొన్ని ప్రాంతాలలో ప్రదర్శనకు అనుమతి నిస్తారు. వారికి గ్రామాల్లో ఆ అర్హత ఉండదు. ఒక గ్రామంలోని ఒక మెట్టలో పది పన్నెండు దాక ప్రదర్శనలు ఇస్తారు. ఒక మెట్టలో ఆటలు వేస్తున్నప్పుడు, మరొక మెట్టలోని ఉత్సాహవంతులు ఆహ్వానిస్తారు వీరిని. ఆహ్వానాలు రెండు మూడు ఒకేసారి వచ్చినపుడు వీరు బెట్టుచేస్తారు. ఎక్కువడబ్బు ఎవరు ఇస్తామంటే వారిబజారుకు ముందు వెళతారు. ఒక గ్రామంలోనే అది చిన్న గ్రామమైతే రెండు మూడు మెట్టలతోనూ, పెద్దగ్రామమైతే ఏడెనిమిది మెట్టలతోనూ ఆటలు నడుపుతారు. ఒక మెట్టలో భారతం, రామాయణం, భాగవతం ప్రదర్శించినా, తర్వాతి మెట్టలో మరలా భారత, భాగవత, రామాయణాలు మొదలు పెడతారు. ఒక్కొక్క మెట్టలో దాదాపు మూడొందల పైన లభిస్తాయి. ప్రతి రోజూ ఆటగాళ్ళందరికి భోజనాలు ఆ బజారువారే చెబుతుంటారు.

పండుగ సందర్భాలలో ప్రత్యేకంగా వేయడం లాంటిది ఏ కొద్ది ప్రాంతాలలోనో ఉంటుంది. అయితే ఒకే ఒకరోజు ప్రదర్శనకు ఎవరూ వీరిని రమ్మని అడగరు. వారు కూడా రారు. కనీసం పది ప్రదర్శనలు లేనిది రారు. ఇంత అని ఖచ్చితంగా ఎవరూ ముందు తేల్చిచెప్పకపోయినా కళాకారుని ఉత్సాహాన్ని తగ్గించరు. సందర్భం కళాకారులు కల్పించుకున్నదైతే ఎంత సంపాదించేది చెప్పలేము. ఒక్కొక్కసారి ఎక్కువగా సంపాదించవచ్చును. ఒక్కొక్కసారి చాల తక్కువగా సంపాదించవచ్చు. ఏదైనా సందర్భం మాత్రం వేసవికాలంలో రాత్రుల్లో మాత్రమే ఎంచుకుంటారు. ఇప్పుడిపుడే బొమ్మలాటవారు కూడా బస్తీలకు వచ్చిగాని, గ్రామాల్లో గాని, సొంతంగా ప్రదర్శనను ఒక ఆవరణలో ఏర్పాటు చేసుకొని అందులో టికెట్టు ధర పెద్దలకు రూపాయ, పిల్లలకు అర్ధరూపాయి పెడుతున్నారు. దీనివల్ల చూడా లనుకున్నవారు డబ్బుబెట్టి చూడాలి. ఇట్లాంటి ప్రదర్శనవల్ల కళాకారులు నష్టపోవడం లేదు. సినిమాల ప్రభావంతో బొమ్మలాటలు పూర్తిగా ఆదరణ లేకుండాపోయాయి. ఇపుడిపుడే టి.వి.లు కూడా గ్రామాలకు పాకుతున్నాయి. బొమ్మలాటలకు సందర్భాలు ఇక ఉద్భవించవేమో?

1. గ్రామాలలో ప్రదర్శనలకు సందర్భాలెప్పుడూ సామాజికంగాను, సామాజిక పరిస్థితుల కనుగుణంగాను ఉంటాయి. గ్రామాలలో కుల మత భేదాలు విస్మరించి ఐకమత్యంతో ఒకరికొకరు సహకరించుకొంటూ ఉంటుంటారు. అట్లాంటివారి మధ్యన బొమ్మలాట ప్రదర్శన ఆదర్శప్రాయంగా ఉంటుంది. ఒక జాతర చేసినా, ఒక దేవతకు కొలుపు చేసినా, తిరునాళ్ళు చేసినా, ఇంకే రకమైన ఉత్సవాలు జరిపినా సామూహిక నిర్వాహణలే జరుపుతారు. ఆ కోవలోనే బొమ్మలాట కూడా. వర్షాలు పడకపోతే గ్రామ జాతరలు జరిపితే వర్షాలు పడతాయనే నమ్మకంతో ఎట్లా చేస్తారో, అట్లాగే బొమ్మలాట ఆడిస్తే వర్షాలు పడతాయనీ, పంటలు సమృద్ధిగా పండుతాయనీ, గ్రామానికి అరిష్టాలు రావనీ నమ్ముతారు. ఈ నమ్మకంలో రామాయణంలో సీతారాములు కలయిక ఘట్టాలలోను, భారతంలోనూ, భాగవతంలోనూ, ఇతర ప్రదర్శనలతోనూ, సామూహికంగా ప్రదర్శన ముందురోజు, ప్రదర్శన ముగింపునాడు పూజాది కార్యక్రమాలు చేపడతారు. కొబ్బరికాయలు కొట్టడం, గుగ్గిలం పొగలు వేయడం, సాంబ్రాణి పొగలు వేయడం, సాంబ్రాణి కడ్డీలు వెలిగించడం మొదలైనవి చేస్తారు. పూర్వపు రోజుల్లో గ్రామంలో అమ్మవారు పోసినా (మశూచిని అమ్మవారంటారు) కలరా సోకినా, గవదవాపులు సంభవించినా, బొమ్మలాటను ప్రదర్శిస్తే అరిష్టాలు తొలుగుతాయని నమ్మకంతో ప్రజలంతా కలిసి పాల్గొనేవారు.

శ్రీరామ నవమి లేదా ఉగాది లేదా ఏరువాక పౌర్ణమిలాంటి పండుగలకు అంతా కలసి వారికివారే రప్పించే ఏర్పాటు కూడా ఉంది. ఈ బొమ్మలాట ప్రదర్శనకు ఆహ్వానించినపుడు, అందరూ ఒక్కొక్క రూపంలో సహకరిస్తారు. కొందరు గొడ్లచావిడి బొమ్మలాట వారుండటానికి ఇస్తారు. మరొకరు పశువులకు మేత ఇస్తారు. ఇంకొకరు వస్త్రదానం చేస్తారు. కొందరు నీటిని ఇస్తారు. వాళ్ళు నీరు తెచ్చుకోవడానికి బిందె కడవ లాంటివి ఇస్తారు. కొందరి ఇండ్లలో శుభకార్యాలు జరిగే సందర్భాలలో కూడా ఇవి ఇస్తారు. కథ చెప్పేటప్పుడు కూడా ఆటగాళ్ళు హాస్య పాత్రలు ద్వారా వారికి సహకరించిన వారిని సామాజిక పరిస్థితుల కన్వయిస్తూ ప్రశంసిస్తారు. ప్రశంస ప్రత్యేకమైన పేర్లతోపాటు గ్రామానికి మొత్తానికి వర్తించే లాగున ఉంటుంది. గ్రామ సామాజిక కట్టుబాటు, సహకార ధర్మం, స్నేహభావం వాత్సల్యం, న్యాయా

న్యాయ విచారణం మొదలైన అంశాలను అందరికి వర్తించేలాగున ప్రశంసి స్తారు. ఎవరైనా సహకరించకపోయినా, వారిని ఆ గ్రామంలోగానీ, పరిసర గ్రామాల్లోగాని ప్రస్తావించరు. సామాన్యంగా వారి తాతలనాటి సంఘట నలను రెండింటినో మూటినో చెప్పి, ఆ రూపంలో వారిని దెప్పిపొడుస్తారు. నిందార్హులెవరో తెల్పి ఆ పేర్లను అవహేళన చేస్తూనూ, అసభ్యంగాను, హాస్య పాత్రల ద్వారానూ ప్రసంగాలు చేయిస్తారు.

2. ప్రతిఆటకు ఒకరు లేదా ఇద్దరు ముఖ్యులుంటారు. ఒకరు ఆ ఇంటి పెద్దగానే వ్యవహరిస్తారు. తక్కిన ఐదారుగురు అతనిపై ఆధారపడుతుంటారు. ముఖ్యంగా ఇంటి వ్యవహారాలు, ప్రదర్శన ఏర్పాట్లు చేసే వ్యక్తి పురుషుడే అయిఉంటాడు. తక్కిన అన్ని విషయాలు సమర్థించుకుంటూపోయేది అతని భార్య అయి ఉంటుంది. అన్నదమ్ములు లేదా బావ మరదులు లేదా తండ్రి కొడుకులు లేదా మామా అల్లుళ్ళు జంటగా కూడ ఒక్కొక్కసారి పెత్తనం చేయడం కనపడుతుంది. ఈ పెద్ద లేదా పెద్దలు (మగవారు మాత్రమే) గ్రామస్థులతో సంబంధం పెట్టుకుంటారు. గ్రామ పెద్దల నుండి వాత్సల్యాన్ని కోరుతారు. పెద్దల అంగీకారం లభిస్తే, ప్రదర్శన సమయంలో ప్రేక్షకుల ఎదుట ఆ గ్రామ పెద్దలను పదే పదే పొగుడుతారు. దీనివల్ల పెద్దల వల్ల ఎక్కువ లాభించకపోయినా. ఆ గ్రామ పెద్దల అనుసరణ గణం ఎక్కు వగా ఆర్థికంగానూ, సామాజికంగానూ, ప్రదర్శన కనుకూలంగా ప్రోత్సహి స్తారు. కొందరికి పదే పదే పొడిగించుకోవడం ఇష్టం. అందువల్ల ఎక్కువ చందాలిచ్చిగాని, లేదా అప్పుడప్పుడు భోజనం ఇచ్చిగానీ పొగిడించుకుంటారు. ఇటువంటి వారిని పసిగట్టి మరి కొంచెం ఎక్కువపాలు పొగడ్తలు జోడిస్తారు. తదుపరి ఇండ్లవద్ద ఎక్కువగా వసూలు చేసుకుంటారు. గ్రామాల్లో ఊరబావి ఒక్కటే ఉంటుంది. త్రాగేనీటికి గ్రామమంతా దీనిపైనే ఆధారపడి ఉంటారు. అట్లాంటి మంచినీటిని వారికిస్తారు. భోజన సదుపాయాలకు కొందరు పప్పు, బియ్యం, మిర్చి ఇస్తుంటారు.

కొందరు వారు గ్రామానికి వచ్చేటపుడు మరొక గ్రామం దాకా ఎదురు వెళ్ళి అహ్వానిస్తారు. గ్రామం వదలి వెళ్ళేటప్పుడు మరొక గ్రామం వరకు సాగనంపి వీడ్కోలిచ్చి వస్తారు. ఎంతో ఆత్మీయతా భావాన్ని చవి చూచిన

ఈ బొమ్మలాటవారు ఏటేటా తమ స్వంత ఇండ్లకు లేదా స్వంత ఊరికి చేరినంత సంతోషంగా గ్రామాల్లో ప్రవేశిస్తారు. వారి కష్టసుఖాలు గ్రామస్థులతో చెప్పుకుంటారు. ఇంటివద్ద ముసలివారు ఎన్నో సంవత్సరాల తరబడి సంప్రదాయంగా వస్తున్న వారిపేర్లతోసహా గుర్తుపెట్టుకొని' బాగున్నారా!' అని కుశల ప్రశ్నలు అడుగుతారు.

3. ప్రదర్శన ఏర్పాట్లలో ముఖ్యంగా గమనించవలసింది సందర్భం. గ్రామస్థుల ఆహ్వానమైతే, అది కూడా ఏదో పెద్ద పండుగ సందర్భం లేదా వరపు కాలంలో పుణ్యకార్యంగా భావించి ఆహ్వానిస్తే ప్రదర్శన ఏర్పాట్లు చాలా బాగా చేస్తారు. ప్రేక్షకుల అభిరుచిమేరకు, ప్రేక్షకులు మెచ్చే విధంగా బొమ్మలాట వారితో చెప్పి స్టేజీ తయారు చేయించుకుంటారు. ముఖ్యమైన సందర్భాలలో స్టేజీ పూజాది కార్యక్రమాలు సాగించి శుభప్రదమైన పద్ధతిలో మామిడి ఆకులను కడతారు. తోరణాలు కడతారు. ప్రేక్షకులు కూర్చోవడానికి అనుకూలంగా పట్టలు వేస్తారు. అదే మామూలు రోజు బొమ్మలాటవారు వచ్చి అడిగితే ఏర్పాటు చేసిన స్టేజీ వారికి చేతనైన పద్ధతిలో కట్టుకుంటారు. ప్రేక్షకుల అభిరుచికి తావులేదు. ఒకవేళ ప్రేక్షకులు అభిలషిస్తే స్టేజి సెట్టింగులు మార్చుతారు.

ప్రదర్శకులు వారికివారే ఏర్పాటు చేసుకుంటే అంతా తాత్కాలికంగా ఉంటుంది. అంతా చౌకగా తయారు చేసుకొంటారు. అలంకరణలు ఏమీ ఉండవు. అలంకరణ స్టేజికి చేసినపుడు ప్రేక్షకులు ఇనుమడించిన ఉత్సాహంతో చూస్తారు.

4. బొమ్మలాటవారు ఒక ఊరినుండి మరొక ఊరికి బయలుదేరేటప్పుడుగాని, వారి మకాంనుండి ప్రదర్శన స్థలానికి బయలుదేరేటప్పుడుగాని శుభశకునాలకోసం నిరీక్షిస్తారు. ఒకవేళ అపశకునాలు కలిగితే ఆరోజు ఆపివేస్తారు. వారు ప్రదర్శనకు బయలుదేరే ముందుగాని, వెళుతుంటే గాని విధవ, పిల్లి, కట్టెల మోపు, పొదిలేకుండా మంగలి, గరుడస్తంభము లేకుండా దాసరి, కుక్క చెవులుకొట్టి నిలబడటం, ఉతికిన బట్టలు ఎదురైతే తాత్కాలికంగా వెనుకకు వెళ్ళి మకాంలో కొంత సమయం ఉండిన తర్వాత ప్రదర్శనకు బయలుదేరు

తారు. అదే ఊరి ప్రయాణానికి పాము ఎదురై పడగవిప్పి నిలబడితే, ఆనాటి ప్రయాణాన్ని వాయిదా వేసుకుంటారు. బయలుదేరిన వెంటనే ఎవరైనా తుమ్మితే కొంచెం వ్యవధినిచ్చి బయలుదేరుతారు. అదే రెండు తుమ్ములు తుమ్మితే శుభశకునంగా నమ్మి ముందుకు సాగుతారు. ప్రయాణంలో శవం, నక్క, గాడిద, పొదితో మంగలి, గరుడ స్తంభముతో దాసరి, పాము ఎదురుగా వచ్చి పడమరకు పోవడం, పొడిబట్టలు, నిండుకుండలు, గాజులశెట్టి, పంది, కుక్క, జింక, నలుగు రైదుగురు మనుషులు ఎదురుగా వస్తే శుభసూచకంగా పరిగణిస్తారు. అందువల్ల వారి ప్రదర్శన బాగా జరుగుతుందని భావించి సంతోషంగా ముందుకు పోతారు.

ఆట మధ్యలో అపశకునాలు సంభవిస్తే ఆ రోజుకు మధ్యలోనే ఆటను నిలుపుతారు. గ్రామంలో బొమ్మలాట ప్రదర్శన మొదలుపెట్టిన తరువాత అరిష్టాలు సంభవిస్తే వారు ఆ ఊరు వదలి వెళతారు. ఆటను మొదలు, మధ్య, ముగింపు, అనే నియమాలు కూడా చూడకుండా అపశకునాలను చూసి ఆట నిలుపుతారు. గ్రామస్థులు కూడా అపశకునాలను పరిగణలోకి తీసుకొంటారు. అంతకుముందు అరిష్టాలు జరిగితే బొమ్మలాట వారిని రప్పించి ప్రదర్శనలు ఏర్పాటు చేస్తారు. అందువల్ల నష్టం వాటిల్లదని నమ్మకం. వారు వచ్చిన తరువాత అరిష్టాలు జరిగితే వారిని ఊరినుండి మర్యాదగా సాగనంపుతారు. నమ్మకాల ప్రభావం గ్రామాలలో ఎక్కువగా ఉంటుంది. ప్రదర్శనకుగాని, ఆర్థిక సహాయం చేయడానికిగాని, గ్రామస్థులు ఎవరూ సహకరించకపోతే సామూహికంగా ఎవరు ముందుకు రాకపోతే, ఎన్నో సంవత్సరాలుగా వస్తున్న గ్రామాన్ని వదలలేక బొమ్మలాట వారు మరికొన్ని చిట్కాలు చేస్తారు. రామాయణం మొదలుపెట్టి సీతమ్మను అశోకవనంలో చెరపెట్టి, తెరనూ బొమ్మనూ వదిలి వారు మరొక ఊరు తరలిపోతారు. సీతమ్మను చెర విడిపించకపోతే గ్రామానికి అరిష్టమని గ్రామస్థులంతా ఏకమై చందాలు వేసుకొని ఆ బొమ్మలాట కళాకారులను వెదకి, వారిని తగిన విధంగా సత్కరించి గ్రామానికి పిలిపించి, సీతమ్మను చెర విడిపించి, వారికి చందాలిచ్చి పంపుతారు. అంటే సీతమ్మ చెరలో పడింది మొదలు రాముడు రావణుని చంపి సీతమ్మను చెర వదలించే పర్యంతం కథ చెప్పిస్తారు. ఇది గ్రామస్తుల నమ్మకాలలో ముఖ్యంగా పరిగణలోనికి తీసుకోదగినది. మొత్తంమీద పరిశీలిస్తే ఆట ఫలితంకంటే

శకునాల ఫలితం మీదనే గ్రామాల్లో నమ్మకం ఎక్కువగా ఉంటుంది. అందు వల్ల నమ్మకాల ఆధారంగా ఆట ఉంటుంది.

5. ప్రదర్శన సందర్భం గ్రామానికి గ్రామానికీ, కులానికి కులానికీ, మతానికి మతానికి విభేదంగా ఉంటుంది. ఒక కులం లేదా మతం లేదా గ్రామాలలో కూడా ప్రదర్శనా సందర్భాలు ఒకే రకంగా ఉండాలని లేదు. ఉండవు కూడా. ఎన్నో భేదాలతోను, ఎన్నో ఉద్దేశాలతోను కూడుకొని ఉంటుంది. ఈ సందర్భాలు ఒక రకంగా చెప్పాలంటే వ్యక్తికీ, వ్యక్తికీ కూడా తేడాలతో ఉంటాయి. అందువల్ల వీటి అధ్యయనానికి ఒక గట్టులేదు అంతులేని అధ్యయనంగా మిగిలి పోతుంది.

6. అయితే ఎవరి సందర్భం వారికి గొప్పగా కన్పిస్తుంది. ఒక పండుగకు ప్రదర్శన ఏర్పాటు చేస్తే అది పవిత్ర కార్యంగా భావిస్తారు. ప్రేక్షకులు వరపు సమయాల్లో ఆదుకోవడానికి చేస్తున్న ఒక యజ్ఞంలా భావిస్తారు. విజ్ఞాన వినోద బోధనలు చేస్తే విజ్ఞాన నిధివలె కన్పిస్తుంది. శుభకార్యాల్లో ప్రదర్శన ఏర్పాటు చేస్తే అది ఒక వేడుకగా భావిస్తారు ప్రతి ఒక్కరూ దాన్ని గొప్పదిగాను, మంచిదిగాను ఊహిస్తారు.

7. ప్రేక్షకులుగా గ్రామాలలో అన్ని కులాలవారు పాల్గొంటారు. ఇచ్చట నిషిద్ధాలు లేవు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, రెడ్డి, కమ్మ, వెలమ, తెలగ, బలిజె, సాలె, కంసాలి, చాకలి, మంగలి, ఒడ్డెర, మాల, మాదిగ, కుమ్మరి, కమ్మరి మొ॥ అన్ని కులాలవారు పాల్గొంటారు.

అయితే గ్రామాల్లో పెద్దకులాలనుకునే వారు, గ్రామాధికారులు, ప్రదర్శన సమయాల్లో అరుగులపై కూర్చుంటారు. తక్కినవారు ప్రదర్శనకు ఎదురుగా నేలపై కూర్చుంటారు.

8. ప్రదర్శనలో మాత్రం భార్యాభర్తలు ముఖ్యంగా ఉంటారు. ఆడ పాత్రకు ఆడమనిషి సంభాషణలుగాని, పద్యంగాని, రాగంగాని పలుకుతుంది. మగ పాత్రలకు మగమనిషి ముఖ్య నాటక సూత్రధారి సంభాషిస్తాడు. తక్కిన నలుగురిలో ఒకరిద్దరు మగ లేదా ఆడవాళ్ళుండవచ్చు. ఒకరిద్దరు పిల్లలు కూడా

ఉండవచ్చు. అయితే వాళ్ళంతా బంధువులయి ఉంటారు ముఖ్యంగా ఆట నడిపేవారి సంతానమో, లేదా సోదర వర్గానికి చెందినవారో అయి ఉంటారు. అంతేగాని ఇతర కులాలుగానీ, ఇతర వ్యక్తులుగానీ అందులో ప్రవేశించడం జరగదు. కొందరు ఆటగాళ్ళు ఆట ప్రదర్శనలో సహకరించే నిమిత్తం ముగ్గురు లేదా నల్గురుస్త్రీలను పెండ్లిచేసుకుంటారు. ముఖ్యంగా మరాఠీబొమ్మలాట వారిలో ఈ ఆచారం ఉంది. మరికొందరు ఒకరినే వివాహమాడినా, ఇతరత్రా ఇద్దరు ముగ్గురు స్త్రీలను పెండ్లి చేసుకోకుండానే ఉప భార్యలుగా స్వీకరిస్తారు. దాదాపు వీరు ఉంపుడుగత్తెలుగా పరిగణింపబడతారు. అయినప్పటికీ సొంత భార్య వీరితో ఒద్దికగా ప్రవర్తిస్తుంది. వీరిలో పోట్లాటలు రావు. అందరినీ పోషిస్తుంటాడు జట్టు నాయకుడు.

ముఖ్యంగా ప్రదర్శనలో ముఖ్యగాయకులు అంటే ఒక ఆడ - ఒక మగ పెద్లవాళ్ళు అంటే 35 - 60 మధ్యలో వారుంటారు. అంటే ఆ జట్టులో ఎవరు పెద్దవారైతే వారే ప్రదర్శన బాధ్యత స్వీకరిస్తారు. వంతలకు ఇద్దరుంటారు. వారు వయసు కల్గినవారు కావచ్చు లేదా వారికంటె చిన్నవారు కావచ్చు. బొమ్మలందించడానికి పిల్లల్ని ఉపయోగించుకుంటారు. వంతలవాళ్ళే వాయిద్యాలు కూడా వాయిస్తారు.

9. ప్రదర్శనను తిలకించడానికి మాత్రం ఒక వయస్సంటూ లేదు. ఊహతెలవని పిల్లల నుండి చావబోయే ముసలివారివరకు అంతా ప్రేక్షకులుగా వస్తారు. ఆడా - మగా, చిన్నా - పెద్దా, కులమత భేదాలు లేకుండా అంతా పాల్గొంటారు.

ప్రదర్శనలో ప్రధానపాత్ర పురుషుడు పోషించినా, నాయిక పాత్రకు స్త్రీలే పాడుతుంటారు. వంతలుగా కూడా స్త్రీలకే ఎక్కువ ప్రాధాన్యత. చిన్న పిల్లల్ని కూడా ముఖ్యంగా బొమ్మలాట ప్రదర్శనానికి, పిల్లలను ఏదో ఒక వాయిద్యం వద్ద కూర్చోబెట్టి వంత పాడిస్తారు. బొమ్మలాట వారు ఒక గ్రామానికి చేరింది మొదలు ప్రేక్షకులను ప్రోగుచేసే దృష్టితోటే ఉంటారు. గ్రామస్థులు గనుక ఆహ్వానిస్తే ప్రేక్షకులకు కొదువలేదు. గ్రామాధికారుల తరపున దండోరా వేయించి, అందరికి ఎరుకపరుస్తారు. ఏదేని ప్రత్యేక సందర్భంతో ఆహ్వానించబడితే ప్రేక్షకులను గురించిన ఆలోచన ప్రదర్శకులకు ఉండదు.

డబ్బు యిచ్చేవారు వేరే ఉంటారు. కాబట్టి ప్రదర్శనలు ప్రేక్షకులను ఆకట్టుకోవాలనే ఆలోచన ఏమాత్రం ఉండదు. తమంతటతామే ప్రదర్శన మొదలు పెడితే, ఆ గ్రామానికి చేరింది మొదలు అందరితో ఆట ఎప్పుడు మొదలు పెట్టేది చెబుతారు. ఆట రోజున దండోరా వేయిస్తారు. ఆట మొదటిరోజున ఇల్లిల్లు తిరిగి వారే చెబుతారు. దాదాపు వేసవి కాలాల్లో ఆటలుంటాయి. రాత్రి 9 గం॥ల ప్రాంతంలో అంతా భోజనాలు చేసిన తర్వాత ఆట మొదలు పెడతారు. ఆట మొదలుపెట్టేముందు ఒక అరగంట లేదా గంటసేపు ఊరిని, ఊరి పెద్దలను పెద్దగా ప్రశంసిస్తూ ప్రసంగం చేస్తాడు జట్టు నాయకుడు. గ్రామం చేరిన మొదటి రెండు మూడు దినాల్లో, ఊర్లో ఆట మొదలు పెట్టేముందు దండోరా వేస్తారు. దాదాపు ప్రశంసలు మొదలుకాగానే జనం గుమిగూడుతారు. జనం కేతిగాని హాస్యం వినడానికి తొందరగా వస్తారు. కేతిగాని హాస్యం కథారంభానికి ముందు పెట్టడంలో అదే ఉద్దేశ్యం. కాబట్టి ప్రేక్షకులలో కేతిగాని స్థానం పదిలం. దానం ఇచ్చినవారిని పొగడడం, భోజనం ఇచ్చినవారిని పొగడటం, మొదలైన ప్రశంసలవల్ల పొగడ్తలకు లొంగే ప్రతివారు చాలా ఆసక్తితో ప్రేక్షకులవుతారు. వస్త్రాలు దానం చేసినవారిని, కర్రలు ఇచ్చినవారిని, పట్టలు ఇచ్చినవారిని, దీపాలకు ఏర్పాటు చేసినవారిని ప్రశంసిస్తారు ఆటకు వచ్చిన ప్రేక్షకులకు ప్రదర్శన చూడకుండా వెళ్ళడం జరుగదు. అంతేకాదు, బొమ్మలాటకు వచ్చిన ప్రేక్షకులు మధ్యలో వెళ్ళడంకూడా కన్పించదు. కేతిగాని ప్రశంసలు, ప్రేక్షకులను రప్పించడమేకాదు. బొమ్మలాటవారికి ప్రేక్షకులు ఆర్థికంగా సహాయపడేలా కూడా చేస్తాయి. ప్రేక్షకులను పోగుచేసే విషయంలో జట్టు నాయకుడే అన్ని పాట్లు పడతాడు. శక్తియుక్తు లుపయోగిస్తాడు. ఆ ఆలోచన ఇతర సభ్యులకు అంతగా పట్టదు. వారు వారికి కేటాయించిన పనులు మాత్రమే చేస్తారు. మర్యాద పూర్వకంగా గ్రామ పెద్దలను కలవడం, వీధి వీధిలో పదిమందిని కూడగట్ట గల ఆకర్షణ గలవారిని కలవడం వారి ద్వారా, కలసిన వారిలో బొమ్మలాట ఉత్సుకతను ప్రేరేపించడం జట్టు నాయకుడు చేసే పనులు. ఒకేచోట అంటే ఒక గ్రామంలోని ఒక కూడలిలో లేదా బజారులో గ్రామం మొత్తానికి ఒకే కేంద్ర స్థానమైతే అట్టిచోట ఎక్కువ ప్రదర్శనలిస్తారు. అచట అంతకుముందే ఒకరు ఒక కథను ప్రదర్శించిపోతే తర్వాత ప్రదర్శనకు వచ్చిన జట్టును ఆ ప్రజలు వేరే కథను ప్రదర్శించమని కోరుతారు. కోరిన ప్రేక్ష

కులు ఆర్థికంగా దాతలు కాబట్టి జట్టు నాయకుడు వెంటనే కథను మార్చుతాడు. ఒకే గ్రామంలో నాల్గైదు కేంద్రాలలో ప్రదర్శన లిస్తున్నప్పుడు ఒక కేంద్రంలోని ప్రదర్శనను దాదాపు గ్రామస్థులంతా చూస్తారు. ప్రదర్శన కేంద్రాన్ని మార్చి అదే గ్రామంలోని మరొక కేంద్రానికి వెళ్ళినపుడు దాదాపుగా కథనుగూడ మార్చు తారు. ఒకవేళ కథ మార్చక మొదటి కేంద్రంలో అంతకుముందు ప్రదర్శించిన కథనే కొత్త కేంద్రంలో ప్రదర్శిస్తే ప్రజలు కథను మార్చమని కోరుతారు. కారణమేమంటే ఎక్కువ మంది ప్రజలు అంతకుముందు వేరే కేంద్రంలో ప్రదర్శించిన ఆ కథను చూసిఉంటారు. అందువల్ల మరొక కథను ప్రదర్శించ మని అడుగుతారు. అయితే ఈ కోర్కె అచటి ప్రజలలో ఎక్కువగా పెత్తనం చేస్తున్న వారినుండి వస్తే వెంటనే గౌరవిస్తారు. కొంచ వారినుండి, వారి అను చరులనుండి ఎక్కువ ఆర్థిక లాభం లభిస్తుంది కనుక వెంటనే ఆచరిస్తారు. అదే ఆర్థికంగా ఏ ప్రోత్సాహం ఇవ్వలేనివారు కథను మార్చమన్నా జట్టు నాయకుడు పెద్దగా స్పందించడు. ప్రోత్సాహకుల నుండి ఎటువంటి సూచన రాకుండా ఇతరులనుండి సూచనలు వచ్చినపుడు జట్టు నాయకుడు ఆర్థిక ప్రోత్సాహకులను ప్రత్యేకంగా కలసి, కథమీద వారి అభిప్రాయాన్ని తెలుసు కొని, వారి అభీష్టాని కనుగుణంగా మలచుకుంటారు. అంటే ప్రోత్సాహకులు మార్చమంటే మార్చుతారు. నిజంగా చూసే ప్రేక్షకులు కథను మార్చమని అడిగినపుడు దాతలనుకున్నవారు కథనం మార్పునకు సుముఖంగా లేనపుడు కథ మార్చరు. ఈ దాతలు అంతకుముందు అదే ఆటను చూసినా రెండోసారి ప్రదర్శిస్తున్నపుడు ఒకవేళ అభిరుచితో చూడకపోతున్నప్పటికీ, వీరు జట్టును ఆర్థికంగా ప్రోత్సహిస్తారు కాబట్టి వీరి అభిప్రాయానికి విలువ యిచ్చి వేరే కేంద్రంలో ప్రదర్శించిన కథనే ప్రదర్శిస్తారు. ఇటువంటి సమ యాల్లో నిజంగా అనుభూతి పొందేవారు, బొమ్మలాట ప్రదర్శనకు పూర్తిగా ఆకర్షితులైనవారు అయిన ప్రేక్షకులు ఆర్థిక ప్రోత్సాహం ఇవ్వలేని కారణంగా కోరుకున్న ప్రదర్శనను తిలకించలేక నష్టపోతారు.

కళమీద అంచనా వేయగలిగిన హోదా గల్గినప్పటికీ ఈ ప్రేక్షకులు చూసిన కథనే చూడవలసి వస్తుంది. అంటే ప్రదర్శన కథ మార్పు ఆర్థిక ప్రోత్సాకుల అభిప్రాయంమీద ఆధారపడి ఉంటుంది. ఒక్కొక్క గ్రామంలో గ్రామ కక్షలుండి ఒక వీథిలో ప్రదర్శించిన కథతే ప్రక్కవీధిలో కూడా

కూడా ప్రదర్శిస్తారు. ఒక్కొక్క గ్రామంలో నాల్గు కూడళ్ళున్నా అంతా కలసి నాల్గు కూడళ్ళలోని ప్రదర్శనలకు హాజరవుతూ కథలు మార్చి ప్రదర్శింప జేసుకుంటారు. ప్రదర్శించిన కథ మరలా ప్రదర్శించడం లేదా మార్చడం అనే విషయం గ్రామ ఐకమత్యం మీద కూడా ఆధారపడి ఉంటుంది. ఈ కళను జీవనాధారంగా ఎన్నుకున్న ప్రదర్శకులకు, ధన దాతల అభిప్రాయానికి అనుగుణంగా ప్రదర్శించడం తప్ప గత్యంతరం కూడా లేదు. కళను బాగా ఆకళింపు చేసుకుని, బాగా ఆనందించగలిగి, కళారూపపు ఔన్నత్యాన్ని గుర్తించగలిగిన ప్రేక్షకులు ధనదాతలైతే ప్రదర్శనకు హుందాతనం ఏర్పడుతుంది. కళా ప్రదర్శనంలో లోపాలను చెప్పగలిగిన ప్రేక్షకులైనందువల్ల కళా ప్రదర్శనంలో అధునాతన పరిణామాలను ప్రవేశపెట్టడానికి ప్రదర్శకులు సృజనాత్మకమైన ఆలోచనల్లోపడి, కథకు కావలసిన మసాలాలు ఎప్పటికప్పుడు చేర్చుతుంటారు. అట్లాకాక ఇటువంటి ప్రేక్షకులు ధన దాతలు కానప్పుడు ప్రదర్శకులకు సృజనాత్మక ఆలోచనల అవసరానికిపోరు.

ఇక ప్రేక్షకుల అభీష్టాన్ననుసరించి చోటు మార్చడం ముఖ్యమైన విశేషం. ప్రదర్శిస్తున్న ప్రదేశం నుండి వెళ్ళిపొమ్మని ఎవ్వరూ చెప్పరు. ప్రదర్శకులలో నాయకుడే ఆ కూడలిలోని ప్రజల స్థితిగతులు అంచనా వేసుకుంటాడు. ధనదాతలు ఎంతమంది ఉన్నదీ, ఆ కూడలికి అందుబాటులో ఎంతమంది ప్రజలున్నదీ, వారిలో ఎందరు ప్రేక్షకులుగా హాజరవుతున్నదీ, ఆ కూడలి నుండి తానెంత ఆదాయం ఆశిస్తున్నదీ అంచనా వేసుకుంటాడు. ఆ అంచనా మేరకు చందాల ప్రస్తావన తెస్తాడు. ముందుగా చేసుకున్న ప్రదర్శనైతే చిక్కేలేదు. ప్రదర్శకుడు తనకు తాను ముందుగా ప్రదర్శనలు ఏర్పాటుచేస్తే ఆ కూడలిలో రోజుకు నూరునుండి నూటఏబది రూపాయల చొప్పున అక్కడ లభించగల మొత్తాన్ని ముందుగా అంచనా వేసుకుని ప్రదర్శన స్థలం మార్చడానికి ప్రయత్నాలు జరుపుతారు. ఉదాహరణకు ఒక కూడలిలో రూ. 600/- అంచనా వేసుకొని ప్రదర్శన ప్రారంభించాదనుకుందాం. నాల్గు రోజులు గడచిన తర్వాత కేతిగాని ద్వారా చందా ప్రశంసలు మొదలుపెడతారు. గంట ఆట గడిచిన తర్వాత ప్రదర్శన నిలిపి, తెర ముందుకు అంటే తెర లోపలి నుండి వెలుపలికి వచ్చి తెర ముందు నిల్చుండి తాను బీద కళాకారుడననీ తనకున్న సంతానం, ఇంతమంది అనీ, పొట్ట చేతబట్టుకొని వచ్చాననీ, దాతలు ముందు

కొచ్చి చందాలివ్వాలనీ అభ్యర్థన నిఘంటువును వల్లిస్తాడు. అంటే ఆ కూడలిలో ప్రదర్శనల అంచనా ఆరురోజులకు మించనీయడు. రోజుకు రెండు వందల రూపాయలు ఆశించి, కనీసం నూరు రూపాయలన్నా పొందాలనేది అతని ఆశ. అతని అంచనాలకు తక్కువ వచ్చినా, ఆతని అసంతృప్తిని ఎక్కడా వ్యక్తం కానీయడు. అంచనాలకు మించిన ధన దానం లభిస్తే ప్రక్క వీధిలో పదేపదే ప్రశంసలు కుప్పిస్తాడు.

ఐదో ప్రదర్శననాడు మొదలుపెట్టిన చందా ప్రస్తావన ఏడో ప్రదర్శనంతో ముగించేట్లు చూసుకుంటాడు. ఐదో ప్రదర్శనం నాటినుండే ప్రక్క వీధుల్లో తనకు అనుకూలమైనదీ, ఎక్కువ ప్రోత్సాహకారులున్నదీ అయిన ఒక వీధిని ఎంచుకొని అచటివారితో కలుస్తూ అనుకూల వాతావరణాన్ని తయారుచేసుకుంటాడు. ఆ ప్రక్క వీధి వారిలో ఏ ఒక్క ధనదాత సుముఖత వ్యక్తం చేసినా వెంటనే ప్రదర్శన స్థలాన్ని ఆ వీధిలోనికి మార్చుతాడు ప్రదర్శకుడు. ఒక్కొక్కమారు ఒక కూడలిలో ప్రదర్శన జరుగుతుండగానే అదే గ్రామంలోని మరొక వీధి ప్రేక్షకులు వచ్చిన వారి వీధిలో ప్రదర్శించమని కోరితే తను ప్రదర్శిస్తున్న వీధిలో చందాలు తొందరగా తెచ్చుకుని ప్రక్క వీధికి వెళతారు. ఒకే కూడలిలో చూడడానికి అనుకూలంగా లేని పక్షంలో ప్రేక్షకుల సూచనమేరకు, అందరికీ ఆమోదయోగ్యమైన స్థలాన్ని ఎన్నుకుంటారు. ఇట్లా ప్రదర్శకులు ప్రేక్షకులలో ప్రదర్శనపట్ల అభిలాష బీజాలను నాటి స్థలాన్ని మార్చడం, ప్రదర్శనలను చూసి ఆకర్షితునైన ప్రేక్షకుల కోరిక మేరకు ప్రదర్శన స్థలాన్ని మార్చడం జరుగుతుంది. ప్రదర్శనలలో ఒక్కొక్కసారి ప్రేక్షకులు బోరుకు ఫీలయ్యే అవకాశం ఉంది. అటువంటప్పుడు ప్రేక్షకుల నుండి సన్నివేశం మార్చమని కేకలు వస్తాయి. ప్రదర్శకులు దాన్ని తప్పనిసరిగా పాటిస్తారు. సన్నివేశాల మార్పును కోరడం ప్రేక్షకుల ఉత్సుకతకు నిదర్శనం. ప్రదర్శన మొదలు పెట్టగానే కేతిగాని పాత్ర ప్రవేశపెట్టి, ఆ పాత్రద్వారా గ్రామంలోని పెద్దలను, తనకు సహాయపడిన వారిని, సహాయపడగలరనుకున్న వారిని, ఆ గ్రామంలో చేరింది మొదలు అప్పటివరకు భోజనాలు పెట్టిన వారందరినీ ప్రశంసిస్తాడు. అంతవరకు ప్రేక్షకులు మౌనంగానే చూస్తూనే ఉంటారు. ప్రేక్షకుల మౌనం ప్రదర్శకుడిలో ఉత్సాహాన్ని రేకెత్తించి ఇంకా ప్రశంసిస్తే తనకు ఎక్కువ అనుకూలంగా

ఉంటుందని మరొకసారి పేర్లన్నీ ప్రశంసలతో మొదలు పెడతారు. అదిగో! అదే సమయంలో ప్రేక్షకులు కథ మొదలు పెట్టమని కూర్చున్న చోటనుండే పెద్దగా అరుస్తారు. ప్రదర్శకుల నాయకుడు వెంటనే కథలోనికి మారుస్తాడు. కథలో కరుణరస ఘట్టాల అనంతరం కేతిగాని హాస్యాన్ని ప్రవేశపెట్టమని ప్రేక్షకుల నుండి కేకలు విన్పిస్తాయి. అపుడు హాస్య ప్రసంగాన్ని ప్రవేశ పెడతాడు. హాస్యం హద్దుమీరినపుడూ, బూతులో నడుపుతున్నపుడూ, కేతిగాడు బంగారక్క ల శృంగార ఘట్టాలు విశృంఖలంగా ప్రదర్శిస్తున్నపుడూ ప్రేక్ష కులు "కథ కానీయ్" అంటూ కేకలు పెడతారు. వెంటనే సన్నివేశాన్ని మారుస్తారు. రౌద్ర ఘట్టాలు బాగానే నడుస్తాయి. సాధారణ సంభాషణలు, భక్తిఘట్టాలు ప్రేక్షకులకు బోరు కొడతాయి. అపుడు ప్రేక్షకుల నుండి "ఆశికం (హాస్యం) చెప్పు" అంటూ కేకలు వస్తాయి. ప్రదర్శకుడు కేతిగాణ్ని ప్రవేశ పెడతాడు. కొన్ని సందర్భాలలో కథ ముగింపుకు, జరుగుతున్న కథకు చాలా అంతరం ఉంటే ప్రదర్శన జావ్యపు నడకను సహించలేని ప్రేక్షకులు కథను త్వరగా ముగించమనీ, చివరి సన్నివేశాలు ప్రవేశపెట్టమనీ కేకలు పెడతారు. ప్రదర్శకులు దానిని గమనించి వెంటనే సన్నివేశాలను మార్చుతారు. కొన్ని ఉత్సుకతను రేకెత్తించే సన్నివేశాలను తదుపరి ప్రదర్శనకు వాయిదా వేసి మరుసటి రోజు ప్రేక్షకులను ఆకర్షిస్తారు. ఆ ప్రదర్శన సందర్భం ముందరి ప్రదర్శనతో సంబంధం కల్గి ఉంటుంది. ఇట్లా ప్రేక్షకుల కోర్కెననుసరించి కథలు మారుస్తూ సన్నివేశాలను మారుస్తూ ప్రదర్శన సందర్భాలను సృష్టించు కుంటూ ప్రదర్శనలను విజయవంతం చేసుకుంటారు ప్రదర్శకులు.

ప్రతి సంవత్సరం ప్రదర్శిస్తున్నప్పటికీ కొన్ని గ్రామాలలో బొమ్మలాట ప్రదర్శకులు వచ్చిన వెంటనే వారికి సాదర పూర్వకమైన ఆహ్వానాలు లభించవు. గ్రామం చేరి ప్రదర్శకులు వారికై వారే ప్రదర్శనలను ప్రారంభించినా ఆ గ్రామ ప్రజల నుండి ప్రోత్సాహం లభించకపోతే తెలివైన వారు, విశేషంగా అనుభవం ఉన్న వారు అయిన జట్టు నాయకులు కొందరు ఆ గ్రామ ప్రజల నమ్మకాల మీద దెబ్బకొడతారు. కొన్నాళ్ళు ప్రదర్శన సాఫీగా నడుపుతూ ప్రేక్ష కులనుండి కనీస భోజన సదుపాయం గూడా లభించకపోతే సొంతంగా వంట చేసుకుని కథ నడుపుతారు ఇటువంటి సందర్భాలను జట్టు నాయకులు ఆయా

గ్రామ ప్రజలను బట్టి ఊహిస్తారు. అటువంటి గ్రామాలలో కథ రామాయణం మొదటి నుండి మొదలు పెడతారు. రావణుడు సీతను చెరపట్టే పర్యంతం కథ నడుపుతారు. సీతమ్మను చెర బట్టి అశోక వనంలో బంధించిన దృశ్యం తెరమీదకు వచ్చిన వెంటనే కథను నిలుపు చేస్తారు. సీతమ్మ బొమ్మను, అశోకవనాన్ని తెలిపే చెట్టు మొదలైన బొమ్మలను, కావలా ఉన్న రాక్షస స్త్రీ బొమ్మలను తెరపైననే ఉంచి, తెరను విప్పకుండా, స్టేజీ ఊడదీయకుండా ఆ స్థలంలోనే విడిచిపెట్టి ప్రొద్దునే ఎవరికీ చెప్పకుండా తన సామానులతో బండి తోలుకుని వేరొక గ్రామానికి వెళ్ళిపోతాడు. అక్కడ ప్రదర్శనలను ప్రారంభిస్తాడు. గ్రామంలో సీతమ్మను చెరలో పెట్టి బొమ్మలాట తెరను సహితం వదలిపోయిన వార్త ఊరంతా తెలుస్తుంది. చిన్నా పెద్దా అంతా ఏక మవుతారు. సీతమ్మను గనుక చెర విడిపించకపోతే ఆ గ్రామానికి అరిష్టమనీ, దానివల్ల ప్రజలంతా నష్టపడవలసివస్తుందనీ నమ్మకమున్నవారిలో అలజడి బయలుదేరుతుంది. అంతా కలసి గ్రామ పెద్దలతో సంప్రదించి ఎట్లైనా గ్రామానికి అరిష్టం జరగకుండా గ్రామాన్ని రక్షించుకోవాలని నిర్ణయించు కుంటారు. గ్రామ పెద్దలు సమస్య పరిష్కారానికి ముందుకు వస్తారు. వారు ఎక్కువ బహుమానం ఇవ్వబోతున్నట్లూ, వచ్చి సీతమ్మను చెర విడిపించి వెళ్ళ మనీ బొమ్మలాట నాయకునికి కబురు చేస్తారు. ఇది తగిన అదునుగా భావించి వాళ్ళు బెట్టుచేస్తారు. వారు పెట్టిన షరతులను అంగీకరించి వారిని సగౌరవంగా తీసుకొనివస్తారు. సీతమ్మను చెర విడిపించడమంటే రావణుని వధ, రాముడు సీతతో తిరిగి అయోధ్యకు చేరే పర్యంతం కథ నడవడమన్న మాట. వచ్చి మరలా సీతమ్మ చెర దగ్గరనుండి రావణ సంహారం వరకు కథ నడిపించి ప్రదర్శనలను ముగిస్తారు. ఈ ప్రదర్శన సందర్భం మాత్రం ప్రదర్శకులు ప్రేక్షకుల నమ్మకాలపై దెబ్బకొట్టి బలవంతంగా పొందిందనే చెప్పాలి. సెంటి మెంట్ ఆధారంగా ఏర్పడినప్పటికీ బొమ్మలాట ప్రదర్శనలో ఈ సందర్భం ముఖ్యమైనదిగా భావిస్తారు ప్రేక్షకులు. ఆ తర్వాత నడిచే కథలో అత్యంత అభిలాషతో పాల్గొంటారు ప్రేక్షకులు. ప్రదర్శన సందర్భాలను తమకు తామే సృష్టించుకోవడంలో మరొక ఎతుగడను అనుసరిస్తారు ప్రేక్షకులు.

అయితే ఈ సృష్టించుకున్న సందర్భంలో ప్రదర్శనలను జరుపుతున్న సమయంలో అదనపు ప్రదర్శనలను పెంచుకుంటారు. ప్రదర్శన మొదలు

పెట్టిన దినం నుండి చివరి ప్రదర్శనం వరకు చందాలు ఎగగొట్టేవారిని కేతిగాని పాత్రద్వారా అపహాస్యం చేస్తూ తిట్టిస్తారు. ముందు దాతలను, గ్రామపెద్దలను, సహాయపడే వారిని ప్రశంసిస్తారు. ప్రశంసలు అయిపోయిన తర్వాత అసభ్య ప్రసంగాలతోనూ, బూతు మాటలతోనూ కేతిగానితో, పూరేటి శేషయ్యను తిట్టిస్తారు. ప్రశంసలు, దూషణలు సంభాషణ ద్వారా జరుగుతాయి. కేతిగానికి ఎదురుగా పాత్రలేమి లేకుండానే లోపల ఒకరు ప్రశ్నిస్తుంటారు. పూరేటి శేషయ్యను కేతిగాడు తిట్టగానే "అయ్యో పాపం! ఆయనను ఎందుకు తిడుతున్నావు? అసలాయన ఎవరు? ఆయనకు నీకు ఏమిటి సంబంధం?" అని ప్రశ్నిస్తాడు. అపుడు కేతిగాడు వివరంగా చెబుతాడు. పూరేటి శేషయ్య ఒక పెద్ద రైతు అనీ, తన ఇంటి ముందు బొమ్మలాట ప్రదర్శనలు ఇప్పించుకున్నాడనీ, అందుకు ప్రతిఫలంగా చందా ఇస్తానన్నాడనీ, అది ఇవ్వడానికి రేపురా! మాపురా! అంటూ తిప్పాడనీ, చివరకు విసిగిన బొమ్మలాట వారు, ఆతని ఇంటివద్దకు వెళ్ళి బైటాయించారనీ, ఇదిగో ఇపుడే వస్తానని చెప్పి ఆతను కంది చేలో దాక్కున్నాడనీ, బొమ్మలాటవారు ఆతనిని పొలంలో చూసి "ఛీ! పిరికిపంద! పిసినారి!" అని తిట్టి తర్వాత ఆ గ్రామం వదలి వెళ్ళారనీ, అది మొదలు ఆ బొమ్మలాట నాయకుడు, ఆ తర్వాత అతని సంతతివారు పూరేటి శేషయ్య పిసినారి తనాన్ని గ్రామ గ్రామాల్లో తిడుతూ నిందిస్తున్నారనీ కేతిగాడు చెబుతాడు. అంతా చెప్పి చివరలో 'పూరేటి శేషయ్యవలె, చందాలు ఇస్తామని ఎగగొట్టిన వారి నోట్లో నా....' అని కేతిగాడు పురుషాంగాన్ని చూపిస్తాడు. గ్రామ ప్రజలు వీరికి చందాలు ప్రకటించేటప్పుడు పూరేటి శేషయ్యను జ్ఞప్తికి తెచ్చుకుని జాగ్రత్తగా ఆలోచించి ప్రకటిస్తారు. ప్రేక్షకులుగా ప్రదర్శనకు హాజరైన ప్రజలందరినుండి చందాలు వసూలు చేయడానికి, చందాలు అడగడం మొదలుపెట్టిన తర్వాత పూరేటి శేషయ్య ఉదంతాన్ని ఎక్కువసార్లు ప్రస్తావిస్తారు. ఈ చందాల మిషతో ప్రదర్శనలను కూడా పెంచుకుంటారు ప్రదర్శకులు. ప్రజల అభిమానం మీద దెబ్బకొడుతూ, పిరికితనాన్ని ఎత్తి చూపుతూ, పిసినారి, పిరికిపంద అనే మాటలను ఉపయోగించి, ప్రేక్షకులు పూర్తిగా చందాలు ప్రకటించేవరకూ, ప్రకటించిన చందాలు ఇచ్చేవరకు ప్రదర్శన సందర్భాలను సృష్టించుకుంటారు ప్రదర్శకులు. ఈ సందర్భాలు మాత్రం ప్రజల అలసత్వాన్ని ఆసరాగా తీసుకొని ప్రదర్శకులు ఏర్పాటు చేసుకున్నవే.

# 5. ప్రదర్శించిన విధానం

ప్రతి కళారూపం ప్రదర్శన ఒక ప్రత్యేకతను సంతరించుకుంటుంది. అంతేకాదు. ఒకే కళారూపాన్ని పలు బృందాలు ప్రదర్శించినపుడు ఏ బృందాని కాబృందమే ప్రదర్శనా ప్రత్యేకతను నిలుపుకుంటుంది. అది ఆయా బృందాల నైపుణ్యాన్నిబట్టి వాటి ఖ్యాతిని పెంచుకుంటాయి. ఆ ఖ్యాతి కళా ప్రదర్శనలో వారికి రాణింపుతోపాటు కళా బృందాలలో ఒక స్థాయిని చేకూర్చి పెడతాయి. ఆ ప్రదర్శకులకది ప్రత్యేక బాణీగా మిగిలిపోతుంది. అటువంటివారిలో ఈ గ్రంథ రచయిత సేకరించిన బృందం ప్రదర్శించిన విధానాన్ని ఇచ్చట వివరించడం జరిగింది.

## 5.1. ప్రదర్శకులు ప్రదర్శనలో ప్రవర్తించిన తీరు

అనంతపురం జిల్లా ధర్మవరం మండలం నిమ్మలకుంట గ్రామంలోని బొమ్మలాట వారంతా కలసి సహకార పరపతి సంఘంగా ఏర్పడి ప్రభుత్వం వారి సహాయంతో నివాసయోగ్యమైన కాలనీ కట్టించుకున్నారు. పరిశోధకుని కోరిక మేరకు బొమ్మలాటవారు వారి కాలనీలోనే ప్రదర్శనకు ఏర్పాటు చేశారు. సాయంత్రం 7 గంటలకు 8 అడుగుల వెడల్పులో 8 అడుగుల ఎత్తుగల వెదురు బొంగులను రెంటిని ముందుపాతారు. వాటి వెనకవైపు వాటికి 5 అడుగుల దూరంలో సమాంతరంగా అట్లాంటివి మరిరెండు వెదురు బొంగులు పాతారు. వీటిని నాల్గింటిని పైన కలుపుతూ నాల్గువైపుల నాల్గు కర్రలతో కట్టారు. పైన ముందుభాగాన్నీ, వెనుక భాగాన్నీ కలుపుతూ స్టేజీ ఆకారం కోసం మధ్యలో మరి మూడు కర్రలు అడ్డంగా కట్టారు. ముందు కర్రలు తూర్పు వైపుకు ముఖం పెట్టి ఉన్నాయి. ఆట తెరను పడమర వైపుకు తప్ప తక్కిన అన్ని వైపులకు వేసే ఆచారం వీరిలో కన్పిస్తుంది. పడమరవైపు తెర కడితే వారికి నష్టం వాటిల్లుతుందని వారి నమ్మకం. స్వయంగా రామప్ప తెలిపాడు. అందువల్ల తెర తూర్పు వైపుకు కట్టారు. ముందు కర్రల భాగం నుండి పరదా పట్టను పైన కప్పుగా కట్టిన నాల్గు కర్రల మీదుగా వెనుకకు జార విడిచారు. గాలి ఎక్కువగా వీస్తుందని రసాయనిక ఎరువుల గోతాలతో కట్టిన పెద్దపట్టతో పక్కలకు కట్టారు.

9 సంవత్సరాల పిల్లవాడు తప్పెటను చంకకు తగిలించుకొని నిమ్మల కుంట గ్రామంలో చాటింపువేసి వస్తున్నాడు. అంటే బొమ్మలాట ప్రదర్శనం గురించి అందరికీ తెలియజెప్పి వస్తున్నాడు. వానివెంట అదే వయస్సున్న మరి నల్గురు పిల్లలు వానికంటే హుషారుగానూ, తలపై వెంట్రుకలు ఎగిరేటట్లు గానూ నడుస్తూ అనుసరిస్తున్నారు. తెర చూడడానికి ఈ పరిశోధకుడు స్టేజీ వద్దకు వెళ్ళాడు. రామప్ప అప్పటికే బాగా సారాతాగి తూలుతూ ఎవరినో ఏదో తిడుతూ స్టేజీదగ్గర అటూ ఇటూ తిరుగుతున్నాడు. నేను స్టేజీ దగ్గరకు చేరగానే గాలి ఎక్కువగా వస్తుందని తాను చెప్పాననీ, ఉత్తరముఖంగా పెట్టి రెండు ఇండ్ల మధ్యన స్టేజీ ఉండేటట్టు కడితే గాలి తెరమీదకు తోలదని తాను చెప్పాననీ, తనమాట ఎవరూ వినలేదనీ "పెద్దవాడిమాట విందామని ఉందా! నా మొడ్డా" అని నాతో చెబుతూ వారిని విమర్శించడం మొదలుపెట్టాడు. అందువల్ల తెరతీసి మరలా కట్టమంటున్నానని చెప్పాడు. తెర పూర్తిగా కట్టారు కాబట్టి అప్పుడు తీసి మరలా వేయడం బాగుండదు. ఈ పూటకు సర్దుకు పొమ్మని చెప్పాను. రెండోకర్రకు రెండువైపుల భూమినుండి 6 అడుగుల ఎత్తుతో ఉండేటట్లు పైనుండి రెండు కరెంటు లైట్లు వేలాడదీశారు. రెండోలైటు హోల్డర్‌వద్ద మల్టీప్లగ్ పెట్టి వైరుతో టేపురికార్డర్‌కు పెట్టాను. తెరలోపల దక్షిణవైపున నేను కూర్చోడానికీ, టేపురికార్డర్‌కూ అనుగుణంగా మంచం వేయించాను. బొమ్మలాట ఉందా! అంటూ ఊర్లోనుండి 10 మంది ఆడవారు వచ్చారు. "ఉంది! రండి" అంటూ ఆహ్వానించారు ప్రదర్శకులు.

సా॥ 8-30 గంటలకు లైట్లు వెలిగించారు. సొసైటీ ఆఫీసు నుండి బొమ్మలాట ప్రదర్శకులు బొమ్మల బుట్టను తెచ్చి తెర లోపల దించారు. లోపలి భాగంలో దక్షిణ భాగం వైపున ఉన్న మంచం సగభాగం స్టేజిలోపలకు మిగిలిన సగ భాగం స్టేజీ వెలుపలకు ఉంది. మంచం మధ్యలో స్టేజీపైభాగాన స్టేజీకి కట్టిన పట్ట వేలాడుతూ మంచానికి మధ్యలో వేలాడుతుంది. ఈ మంచం పక్కన బొమ్మల బుట్టపెట్టారు. ఈ బుట్ట దక్షిణం పక్కకు ఉంది తూర్పు పడమరల వైశాల్యంలో సరిగ్గా మధ్య భాగంలో ఉంది. ఈ బుట్ట నాల్గు అడుగుల పొడవు, 2½ అడుగుల వెడల్పు ఉంది. ఇందులో బొమ్మల కాళ్ళు, చేతులు జాయింట్ చేయబడినవి కాబట్టి మడతపెట్టి ఉంచారు. పొడవైన బొమ్మల

కాళ్ళు చేతులు కుట్టినచోట్ల నుండి వెనుకకు మడచి పొట్టి ఆకారంగా తయారుచేసి పెట్టి ఉంచారు. మూతను తీసి స్టేజీ వెనుక భాగంలో, వాయవ్య దిశగా తెరలో ఒక మూలకు ఉంచారు. వెంటనే తెరమీదకు రావలసిన బొమ్మలను మూటిని అందులో వేశారు. బుట్ట తెరవకముందే రెండు కొబ్బరికాయలు పగుల గొట్టారు దళవాయి గోవిందు, రామప్పలు తెరకు దగ్గరలో కూర్చొని తెర అడుగు భాగంలో గుడ్డకు పసుపుకుంకుమ రాశారు ఈ తెరగుడ్డను వారు బొమ్మలు తయారుచేస్తున్న షెడ్డు నుండే తెచ్చారు. ఇది వారి సొసైటీ సొత్తు. స్టేజి లోపలి భాగంలో చివరి పక్కన అంటే పడమర వైపు దడికి ఆనుకొని మధ్యలో ఒక రేకు కుర్చీలో ఒక 14 సంవత్సరాల అమ్మాయి కూర్చొని ఉంది. హార్మోనియం శృతిపెట్టడం మొదలు పెట్టింది. రామప్ప బొమ్మల్ని క్రమంలో పెట్టాడు. వెంటనే తెరమీదకు రావలసినవి తీసి బుట్టలో వేశాడు.

కూర్చున్న విధానం: తూర్పు వైపుకు తెర ఉంటుంది. తెరకు దగ్గరలో తొక్కుడు బల్లమీద కాలుబెట్టి ఒకరు రెడిగా ఉన్నారు. వారు ముఖ్య గాయకులుగా పని చేశారు. ఒక గుడ్డ బొంతమధ్యలో పరచిదానిపై మద్దెల వాద్యగాడు కూర్చున్నాడు. తాళాలు కొడుతూ ఒక స్త్రీ కూడా దానిపైననే నిల్చొంది. స్టేజిపై భాగంలో తప్పెట వేళ్ళాద దీశారు. రెండు చేతుల్లోని పుల్లలతో ఒకేసారి "దబ్ దబ్ దబ్ దబ్" మంటూ ప్రయోగించారు. ఆట మొదలు పెట్టడానికి అది చిహ్నం. బొమ్మలు బుట్ట పక్కన సరిగ్గా స్టేజీలో మధ్యన గుడ్డ బొంత పరిచారు. 35 సం॥ యువకుడు కుళ్ళాయప్ప మద్దెల తీశాను రామప్ప, శారదమ్మ కాళ్ళకు గజ్జెలు కట్టుకున్నారు. అయితే ఒకే కాలికి, అదీ కూడా కుడి కాళ్ళకు మాత్రమే కట్టుకున్నారు. వీరు కుడికాలితో తొక్కుడు బల్ల తొక్కుతారు. మరొక ఆడ మనిషి నోట్లో ఆకు వేసుకుని సున్నం రాసుకున్నది. మద్దెల శ్రుతిపెడుతున్న కుళ్ళాయప్ప తాను కూర్చున్న బొంత కొంచెం ఎత్తి నోట్లోనితమ్మ ఉమ్మివేసి బొంత మామూలుగా చేశాడు. అంటే నోట్లో అంతా తమలపాకు తమ్మ వేసుకునే అలవాటు ఉంది. నోట్లోని తమ్మని ఉమ్మడానికి బయటకు పోనక్కరలేదు. అక్కడ వారికి కాళ్ళకు తగలని చోటు చూసుకుని అక్కడే ఊస్తున్నారు. రామప్ప కాలికి గజ్జెలు కట్టుకున్న తర్వాత నోట్లో తాను కూడ పొగాకు ముక్కలు, తమ్మ వేసు కున్నాడు. తబల శ్రుతి సరిపడవచ్చింది. నేను హడావిడిగా బేపురికాద్దరు

గ్గర కూర్చున్నాను. ప్రదర్శనలో ఆరితేరిన నాయకులు ఆరు జట్ల పెద్దలు
ర లోపలకు చేరారు. వారి పిల్లలు, ఆడవారు అంతా వారివెంట లోపలకు
వారు. అందరికంటే వయస్సులో పెద్దవాడు, ముసలివాడు అయిన రామప్ప
ణేశుని బొమ్మను ముళ్ళతో తెరపై చెక్కాడు. వాద్యాల వాళ్ళు ఒక్కసారే
గాగించారు. "నమోనమో" అని ఒక్క సారిగా అరిచారు. తర్వాత తప్పెట
గాగించారు. తెరమీది వినాయకుణ్ణి ముళ్ళు ఊడదీసి ఆడించాడు రామప్ప.
క్కినవాళ్ళు పాటను పాడారు.

వారి పాటకు అనుగుణంగా రామప్ప వినాయకుణ్ణి ఆడించాడు. కుడికాలి
ంద చెక్క ఉంది. చెక్కను ఒకపక్క ఎడమ కాలితో తొక్కిపట్టి కుడికాలితో
క్క రెండో పక్కను తొక్కగానే శబ్దం అయింది. వినాయకుని నృత్యాని
నుగుణంగా చెక్క తొక్కాడు. రెండు చేతుల పుల్లలను ఎడమచేతితో పట్టు
'ని కుడిచేతితో రెండు కాళ్ళమధ్య ఉండేచోట పట్టుకొని ఆడించాడు. వినాయక
ాజలో అందరూ వంతలాగా పాడారు. వినాయకుడి తర్వాత సరస్వతి
ొమ్మను తెరపైకి తెచ్చారు. శారద సరస్వతి బొమ్మను పట్టుకొని కాళ్ళ
జ్జెలతో ముఖ్యమైన చెక్కపై కాలిని ఉంచి, పాటపాడుతూ నృత్యం చేయిం
ంది. తక్కిన వాళ్ళంతా వంతలుగా పాడారు. కుడిచేతితో పొడవు పుల్లను
ధ్యలో పట్టుకొని ఎడమ చేతితో రెండు చేతులపుల్ల కలిపి పట్టుకొని సరస్వతి
ప్రార్థన చేసిన తర్వాత ఆబొమ్మను తీసివేశారు. తర్వాత శారద
ంగారక్క బొమ్మను ప్రవేశ పెట్టింది. "తగదిది మదనా....ఆ...." అంటూ
ాగం తీస్తూ బొమ్మతో నృత్యం చేయిస్తూ ప్రవేశ పెట్టింది. శారద ప్రక్కనే
ంగమ్మ ప్రదర్శనలో పాల్గొన్న (మరొక స్త్రీ) నిలబడి "ఓయమ్మ ఓయమ్మ
. యమ్మా....అ....అ...." అంటూ వంత పాడింది. బంగారక్కను పక్కన
వరో ఎగతాళి చేస్తున్నట్లు ఉంది ఈ ఉచ్చారణ. శారద కుడికాలును చెక్కపై
పెట్టింది.

చెక్కను ఆక్రమించి ఒక చేతితో బంగారక్క బొమ్మ పుల్లను మధ్యలో
పట్టుకొని పాట పాడుతూ ఆడించింది. వంతలలో ఆడ మగ వంత లున్నారు.
బొమ్మతో కూడిన కుడిచేతిని కొంచెం ఎడమ పక్కకూ, కొంచెం కుడి పక్కకూ
మెల్ల మెల్లగా జరుపుతూ ఉండడమే ఆట ఆడించడం. అయితే తెర వెలుపలి

ప్రేక్షకులకు బొమ్మ నడచినట్లు, నృత్యం చేసినట్లు సన్నివేశానికి తగిన అభినయంతో కన్పిస్తుంది. బొమ్మ ఆడించాలన్నా, నృత్యం చేయించాలన్నా లయ తాళ పరిజ్ఞానం ఉండాలి. ఎంతో శిక్షణ అవసరం. బంగారక్క సరసకు గంధోళిగాణ్ణి ప్రవేశ పెట్టారు. ఈ గంధోళిగాడి బొమ్మలు మూడింని పలు ఆకారాల్లో వెంకటమ్మ, మంగమ్మ, రంగమ్మలతో ప్రవేశ పెట్టారు. మరొక ఇద్దరు పిల్లలు కూడా సహాయంగా వచ్చారు. బొమ్మలను పట్టుకోవడానికి, బొమ్మల్ని నెమ్మదిగా ఆడించడానికి వీరు ఉపయోగ పడ్డారు. ఒక్క పోలుగాని బొమ్మను శారద భర్త రామకృష్ణ పట్టుకొని ఆడించాడు. రామకృష్ణ కాళ్ళకు గజ్జెలు కట్టుకోలేదు. అయితే కేతిగాని నృత్యానికి కూడా శారదయే తొక్కుడుబల్ల తొక్కింది. పోలుగాడు, బంగారక్కల సంభాషణ ముఖ్యంగా ప్రశంసల పరంపర విపరీతంగా పెంచారు. ఈ ప్రశంసల పరంపర చాలా పొడవుంది. ఆ తర్వాత వీరి శృంగారపరమైన సంభాషణం ప్రేక్షకుల నాకర్షించింది.

సంభాషణలతోపాటు బంగారక్క, కేతిగాళ్ళ కదలికలు, హావభావ ప్రకటనలు సజీవ రూపాలుగా కన్పించాయి. అంతేకాదు. అది ప్రదర్శకులైన రామకృష్ణ, శారదల సరస సల్లాపాల్లాగా ఉన్నాయి. నిజానికి ఆ బొమ్మల నాడించేటప్పుడు వారి ప్రవర్తనకూడా తెరలోపల అంతేఉంది. శారదమ్మ చూపులు, అభినయం బంగారక్క సంభాషణకు అనుగుణంగానూ, రామకృష్ణను ఆకర్షించే విధంగానూ ఉన్నాయి. రామకృష్ణ కూడా కేతిగానికివలె చిలిపిగానూ, బంగారక్క మాటలకు సమాధానంగానూ ప్రవర్తించాడు. తెర మీద కేతిగాడు బంగారక్కల ప్రవర్తన తెరలోపల రామకృష్ణ, శారదమ్మల ప్రవర్తనను గుర్తుచేసింది. ప్రేక్షకులనుండి ఆటమొదలు పెట్టమన్న కేకలు రావడంతో ఆ ఘట్టం తీసివేశారు. ఒక పిల్ల ఒక బొమ్మను, ఇద్దరు ఆడవారు రెండు బొమ్మలను, ఒక మగపిల్లవాడు రాముని బొమ్మనుపట్టుకొని ఆట మొదలు పెట్టారు. రామప్ప, రామకృష్ణులు రామలక్ష్మణుల బొమ్మలనూ, శారదమ్మ సీత బొమ్మను పట్టుకొని ఆడించారు మొదట ఈ బొమ్మలను పట్టుకున్న వారంతా పక్కకు తప్పుకున్నారు. బంగారులేడిని ప్రవేశపెట్టినపుడు ఆ బొమ్మను నడిపించింది రంగమ్మ. సీతపాత్ర సంభాషణ అంతా శారద పాడింది. తర్వాత రామలక్ష్మణులు మాయాలేడివెంట వెళ్ళడంతో రామకృష్ణ, రామప్పలు పక్కకు వెళ్ళారు. జంగమయ్య వేషంలో రావణుణ్ణి రామకృష్ణ

నడిపించాడు. దీని తర్వాత పదితలల రావణుని బొమ్మను ప్రవేశ పెట్టాడు. పది తలల రావణుని బొమ్మ వెదకి ఒకవైపు అంతకుముందే తగిలించి ఉంచారు. "నన్ను కోరను ఎన్నితలలురా నీకు" అంటుంది సీత స్వచ్ఛమైన వ్యవహారికంలో. "నా జోలికి రాను ఎన్ని గుండెలు నీకు" అనే భావం బోధ పడుతుంది.

సరిగ్గా ఇదే బాణీలో ఉందీ మాట. వెంటనే పది తలల రావణుని ప్రవేశం. ఈ బొమ్మ ప్రవేశం సమయం రాగానే తెరలోని ప్రదర్శకులంతా మద్దెల వాయిస్తున్న దళవాయి గోవిందువంక చూశారు. ఆ పాత్రకు అతనే ప్రత్యేకత అన్నట్లు, ఆ పాత్రను ఎప్పుడు అతనే పోషిస్తున్నట్లు, త్వరగా అతను ఆ బొమ్మను పట్టుకొని తెరపైకి ప్రవేశ పెట్టాలన్నట్లు ఉన్నాయి ఆ చూపులు. గోవిందు కూడా ఆ బొమ్మను తెరపైకి ప్రవేశ పెట్టేటప్పుడు అందరివలెకాక ఆ పాత్రతో తన్మయత్వం పొంది ప్రవర్తించాడు. "ఇదిగో చూడవే ఎన్ని తలలున్నాయో! హ హ్హ హ్హ హ్హ ....హ్హ ! చూడు పది తలలు హ హ్హ హ్హహ్హ హ్హ....హ్హ...." అంటూ చేసిన వికృతం, భయంకరమైన నవ్వును - మనిషంతా నవ్వినట్టు ప్రదర్శించాడు. ఆ బొమ్మ హావభావాలు ఆ బృందంలో అతనికి మాత్రమే చేతనవుతుందేమో నన్నంత గంభీరంగా నవ్వాడు తర్వాత బొమ్మను చూడగానే ప్రేక్షకుల నుండి ఈలలు, చప్పట్లు, "అబ్బ అబ్బ" అన్న మాటలు, మొదలైనవి విన్పించాయి. ఈ బొమ్మకు ప్రత్యేక నటుడువలె ఉన్నాడు. ఇతని గంభీరమైన ఉచ్చారణకు తోడు గంభీరమైన పాత్రలు తెరపైకి ప్రవేశ పెట్టేటప్పుడు తెరలోని వాద్యాలన్నీ ఒక్కసారిగా ప్రమోగించారు. డప్పుతో నగారావలె అతి పెద్ద చప్పుడుచేశారు. "హోయ్‌హోయ్.... హాంలో........హాంలో...." అంటూ తొక్కుడు బిల్ల తొక్కాడు గోవిందు. మద్దెల ఉచ్ఛైశ్వరంతో ప్రమోగించారు. తాళాలు, హార్మోనియం సరేసరి.

సీతను తీసుకుపోవడంతో రావణ పాత్రను గోవిందు వదిలాడు. జటాయువు ఎదుర్కొన్నాడు. జటాయువును ప్రవేశ పెట్టడంతో గోవిందు చేతిలోని బొమ్మను రామకృష్ణ తీసుకున్నాడు రావణ జటాయువుల యుద్ధాన్ని రామప్ప రామకృష్ణులు చేయించారు. రామప్ప అతిగా ప్రవర్తించాడు రామకృష్ణ చేయి పట్టుకొని ముందుకు లాగి, అతని చేతిలోని రావణ బొమ్మపై రామప్పతన చేతి

లోని జటాయువు బొమ్మతో కొట్టాడు. రామకృష్ణ అట్లే రామప్పను ఎడమచేత గట్టిగా పట్టుకొని తనచేతిలోని బొమ్మతో రామప్ప చేతిలోని బొమ్మను కొట్టాడు. ఇది గమనిస్తున్నంతసేపు రామప్ప రామకృష్ణలు పోట్లాడుకున్నట్లే కన్పించింది తెరలోని నాకు. ప్రేక్షకులకు మాత్రం తెరపై రావణ జటాయువు యుద్ధం అత్యంత భయంకరంగా ఉంది. జటాయువు పడిపోవడంతో రావణుని బొమ్మను తెరనుండి తొలగించారు. జటాయువు బొమ్మను మాత్రం ఓ మూలకు తెరపై ముళ్ళతో చెక్కారు తర్వాత సీతను వెదకుతూ రామలక్ష్మణులు వస్తారు. రామప్ప రామకృష్ణలు రామలక్ష్మణుల బొమ్మలను నడిపించారు. వట్టి సంభాషణలే కాబట్టి సంవాద రూపంలో ఉంది. బొమ్మలు కదలకుండా స్థిరంగా ఉంచి సంభాషణలు సాగించారు. రాముని బొమ్మను ఆడిస్తున్న రామకృష్ణ -

"తమ్ముడా! ఏది దారి
నా ప్రాణ సఖియగు
సీత ఎక్కడ! హా సీతా!
అయ్యో నా ప్రాణ సఖీ" అంటూ పాడుతాడు.

రామకృష్ణ పాడుతున్న పాటను తెరలోని వారంతా దాన్ని వంతలాగా పాడారు. తాళాలు కొడుతున్న రంగమ్మ, ప్రక్కనే శారదా, రామప్ప నిలబడి ఉండే పాడారు. హార్మోనియం, మద్దెల వాళ్ళు కూర్చొనే ఉన్నారు. గోవిందు కూడా కూర్చొనే పాడాడు. అయితే ఈ పాట పాడేటప్పుడు రాముడి బొమ్మతో నృత్యం చేయించాడు. "హా! సీతా!" అంటూ విలాపరాగం ఎక్కువ ఆకర్ష ణీయంగానూ, కరుణ రస ప్రధానంగాను కన్పించింది. అతని అభినయం, గొంతుక, వంతలు వీరు అంతా కలసి కరుణ రసాన్ని బాగా పోషించినట్లు కన్పించింది. రామకృష్ణ ''హా! సీతా! అః ..." అంటూ విలాపరాగం పాడగానే చివరగా ఒక స్త్రీ "అః"-అంటూ రాగం తీసింది. ముఖ్య వంత లక్ష్మణపాత్రను స్వీకరించిన రామప్ప "ఊ'' గొట్టాడు. తర్వాత రామలక్ష్మణులు జటాయువును దర్శించడం జరిగింది. జటాయువు సీత జాడ తెల్పి మరణిస్తుంది. జటాయువు సంభాషణ మొదలవగానే రామప్ప ఆ బాధ్యత స్వీకరించాడు. వెంటనే శారద లక్ష్మణుని బొమ్మను పట్టుకుంది. అప్పటి నుండి లక్ష్మణుని మాటలు కూడా శారదయే మాట్లాడింది. కిష్కింధ వైపుకు ప్రయాణం సాగిస్తారు. రెండు

బొమ్మల్ని తెరపై చెక్కుతారు. తర్వాత సుగ్రీవుని సభను తీర్చారు. రామకృష్ణ, రామప్ప, శారదలు - జాంబవంత, సుగ్రీవ, హనుమల పాత్రలను స్వీకరించారు.

ఇక్కడ హనుమంతుని బొమ్మ పెద్దది సుగ్రీవునితో సమానంగాను, సుగ్రీవుని అధిగమించేదిగాను ఉంది. ఈ సమావేశంలో హనుమంతునికి ప్రాముఖ్యం ఉంది. ప్రాముఖ్యం ఎక్కువగా ఉండి, ఎక్కువ పద్యాలు, మాటలు చెప్పవలసిన పాత్రలన్నీ ఇప్పటి వరకు రామకృష్ణ స్వీకరించాడు. హనుమంతుని పాత్ర రాముని వద్దకు వస్తుంది. ఇక్కడ కూడా హనుమ బొమ్మకు అభినయం చేయించింది రామకృష్ణే. బొమ్మ మామూలుగా పెద్ద బొమ్మ కాబట్టి హుందాతనంతో ఆడించాడు. తర్వాత ముఖ్య ఘట్టం వాలి సుగ్రీవుల యుద్ధం. ఈ యుద్ధాన్ని రామప్ప ఒక్కడే చేయించాడు. కుడి చేతిలో వాలి బొమ్మను ఎడమ చేతిలో సుగ్రీవుని బొమ్మను పట్టుకొని ఒకసారి ఎడమ చేతిలోని బొమ్మను కుడి చేతిలోని బొమ్మతోను, మరొక సారి కుడి చేతిలోని బొమ్మను ఎడమ చేతిలోని బొమ్మతోను కొడుతూ, ఆ కొట్టేటప్పుడు తొక్కుడు బల్ల గట్టిగా తొక్కుతూ చేయించాడు. ఇది ద్వంద్వ యుద్ధం కావడం వల్ల ఒక్కరు చేయించినా తేడా కన్పించలేదు. పైగా ప్రతి యుద్ధ ఘట్టంలోనూ రామప్ప తప్పని సరిగా కన్పించాడు. అతని అనుభవాన్ని వారు వాడుకున్నారనైనా చెప్పవచ్చు. అతనిలో కన్పించే అత్యుత్సాహం కూడా అతను యుద్ధం చేయించే ఘట్టాలలో పాల్గొనడానికి కారణమని ఊహించవచ్చు. వాలి సుగ్రీవుల యుద్ధం జరుగుతున్నంత సేపు "హుఁ.... హుఁ...." అంటూ శబ్దాలు, పీటికనుగుణంగా తొక్కుడుబల్ల శబ్దం, డప్పు, తాళాలు, హార్మోనియం ధ్వని పెద్ద సద్దుతో ప్రమోగాయి. తర్వాత తార విలాపంతో ప్రవేశం. దీనికి వెంకటమ్మ (పది సం॥) హాజరయింది. ముద్దుముద్దుగా పాడుతున్నా పెద్దవారి గొంతును అనుకరిస్తూ, రాగాలు తీయడంలోను పద్యాన్ని చదవడంలోను ఉచ్చారణలోను పెద్దల బాటలో పాడింది.

"నా ప్రాణ నాయకా
నా జీవితేశా....ఆఁ....
మాటాడు నాతో నీవు"

అన్న తర్వాత దుఃఖాభినయం అద్వితీయంగా ఉంది. వచనంలాగున్న పద్యం ఈ పాపతో చెప్పించారు.

బొమ్మలను నెమ్మదిగా ఆడిస్తున్నప్పుడు పెద్దలు పాడుతూ పిల్లలచేత బొమ్మలను ఆడించే శిక్షణకు ఒక్కొక్కరు ముందుకు వచ్చారు. మంగమ్మ, వెంకటమ్మ, మరొక 10 సం॥ బాలుడు ఆటలో పాల్గొన్నా బాలుడు మాత్రం బొమ్మను పట్టుకొని మాత్రమే నిలబడ్డాడు. ఆడించడం నేర్పే ముందు ఇట్లా పట్టుకొని నిలబెడతారట కొన్నాళ్ళు. వెంకటమ్మ మాత్రం ఆడించింది. తార దుఃఖాభినయానికి అనుగుణంగా తాళం, మద్దెల, హార్మోనియాల సంగీతం ఉంది. పాట వీటిలో కలసిపోయింది. ఈ పాట కాగానే వాలితో మాట్లాడే సంభాషణ మాత్రం తార పాత్ర తరపున రంగమ్మ మాట్లాడింది. వెంకటమ్మ శిక్షణ అంతవరకు వచ్చినట్లు లేదు. బొమ్మను వెంకటమ్మ ఆడిస్తే సంభాషణ మాత్రం రంగమ్మ నడిపింది. వాలి పాత్రను రామప్ప మాట్లాడాడు. వచనం చెపుతున్న రంగమ్మ నిలబడి అంతకు ముందునుండే తాళాలు వాయిస్తుంది. వెంకటమ్మ పాటకు రాగం తీసేటప్పుడు రంగమ్మ ఎడమ చెవివద్ద చెయ్యి పెట్టుకొని "ఆ.…." అంటూ రాగం తీసింది. తెరవేసే ఆడవారంతా ఒకేచోట చేరారు. తెరనిండా మనుష్యులున్నట్లుంది వీరి గుంపు. తర్వాత అశోకవనంలో సీత విలపించడం, మండోదరి ఘట్టాలలో మంగమ్మ పాడింది. రామకృష్ణ హార్మోనియంపై కూర్చొని మంగమ్మను తెరముందుకు పంపాడు. మంగమ్మ మండోదరి ఘట్టంలోనూ, అశోకవనంలో సీత దుఃఖ సన్నివేశంలోనూ పాడింది. వచనం కూడ చెప్పింది. ఆట ఆ భావానికనుగుణంగా ఆడించింది.

హనుమంతుడు లంకకు వెళ్ళే ఘట్టంలో హనుమంతుని చిన్న రూపాన్ని ప్రవేశపెట్టారు. ఆకారంలో తేడా లేకపోయినా చిన్నబొమ్మ పూర్తిగా కోతి ఆకారాన్ని పోలి ఉండడంతో ప్రేక్షకుల నుండి నవ్వులు, ఈలలు, చప్పట్లు కన్పించాయి. ఈ గోలకు తగినట్లు రామప్ప హనుమంతుని చిన్న బొమ్మను కుప్పిగంతులు వేయించాడు. దీనితో ప్రేక్షకులలోని పిల్లలలో ఎక్కువ గొడవ కన్పించింది వారు ఆనందంతో కేరింతలు కొట్టటం కన్పించింది వారి ఉల్లాసాన్ని రెట్టింపు చేశాడు రామప్ప. ఆ సమయంలో వెంకటమ్మ తాళం సరిగ్గా నేయలేకపోయింది. అపుడు రంగమ్మ ఆ పిల్ల రెండు చేతులు పట్టుకొని లయ

బద్ధంగా కొట్టించి నేర్పింది. అదే సమయంలో గాలి ఎక్కువగా వీచింది. అప్పుడు రామప్ప సైగచేసి మూలలో నిలబడ్డ ఇద్దరు మగపిల్లలను పిలిచాడు. వారు వచ్చి తెరనుముందుకు నెట్టి పట్టుకున్నారు.

లంకిణిబొమ్మను ప్రవేశపెట్టి లంకిణితో కేతిగాడి హాస్యప్రసంగాన్ని కల్పించారు. కేతిగాడి బొమ్మను రామప్ప తీసుకున్నాడు. "హాస్యం పెట్టు రామప్ప" అని ప్రేక్షకుల నుండి కేకలు వచ్చాయనుకోండి. ఈ కేకలనుబట్టే తెలుస్తుంది - రామప్ప హాస్యానికి ఆ గ్రామంలో ఎంత విలువ ఉందో. లంకిణి బొమ్మను రామకృష్ణ పట్టుకున్నాడు. రామప్ప కేతిగాడి పాత్రద్వారా అడిగిన ప్రశ్నలు గానీ, హాస్య ప్రసంగం గానీ సగానికిపైగా సారాతాగినవారు మాట్లాడిన పద్ధతిలో పట్టిపట్టి ఉన్నాయి. అప్పటికి బా.గా కైపు ఎక్కి ఉంటుంది. వచ్చి శృంగారాన్ని తెలిపే పదాలను కోకొల్లలుగా వాడాడు, రామకృష్ణ ఎక్కడి కక్కడకు ఆ సంభాషణ ముగిద్దామా అన్నట్లు ప్రయోగించాడు. బహుశా నన్నుచూసి నేను అసహ్యంగా భావిస్తాననుకున్నాడేమో? "ఓరేయ్!" నాయాల!" అనే మాటలు గూడా అపుడపుడు తగ్గించ ప్రయత్నించాడు. "నాయాల అనేది "నా ఆలు" అనే పదంనుండి ఏర్పడిందిగదా! అది లంకిణి (స్త్రీ) పాత్రతో పల్కించడం అంత సబబుగా కన్పించనప్పటికీ ఆ మాట అనిపించాడు. కేతిగాని బొమ్మతో మీదకు మీదకు వస్తుంటే కూడా ఎడమచేతితో రెండుసార్లు రామప్పను దూరంగా నెట్టాడు. తెరలో తక్కినవారంతా కూర్చున్నారు. లంకిణి బొమ్మకు తల వేరుగా ఉంది. బొమ్మలో కలిపిలేదు. రామకృష్ణ తల, రొమ్ము, చేతులు కలిపి పట్టుకున్నాడు. యుద్ధంలో తల తెగవలసిన పాత్రలు కొన్ని ఉంటాయి. అటువంటి పాత్రలు ఎక్కువగా ఉన్నపుడు శరీరానికి ఒకే బొమ్మను చేసి, తల భాగం మాత్రం వేరువేరు తలలు చేసి సందర్భోచితంగా ఉపయోగించుకుంటారు.

బంగారక్క ప్రవేశించి కేతిగాణ్ణి తీసుకెళ్ళడంతో ఆఘట్టం ముగిసింది. తర్వాత హనుమంతుణ్ణి ప్రవేశ పెట్టారు. హనుమంతుడి విశ్వరూపం, తర్వాత యుద్ధంఆతర్వాత చిన్న మారుతితో ఆ సన్నివేశాన్ని తీసివేశారు. ఈ ఘట్టంలో రామకృష్ణ రామప్పలు మాత్రమే ఆడించారు. తర్వాత హనుమంతుని పట్టుకుని "శ్రీరామ శ్రీరామ సీతజన రామ" అంటూ పాడింది వెంకటమ్మ. ఆ పిల్లను

నిలబెట్టే కాళ్ళకు రామప్ప గజ్జెలు కట్టాడు వెంకటమ్మ మరొక బొమ్మను ఆడిస్తూ పద్యం ఏదో తప్పుగా మొదలు పెట్టింది. రామప్ప తలమీద ఒక్క-టేశాడు. దానితో మరలా సరిగ్గా పాడింది. సీతా రావణ సంవాద ఘట్టంలో వెంకటమ్మ పాడింది. గోవిందు తాళాలు వేస్తూ వేస్తూ వంగి పెద్దగా "తయ్యకు-తయ్యకు-తన్నన్న" అనే శబ్దం వచ్చేటట్లు తబల వాయించాడు.

చివరకు తెరలోని వారంతా ఒక్కొ-క్క-రే వెళ్ళారు. రామప్ప తప్పతాగి తెరమొత్తంలో అందరినీ డామినేట్ చేయడం వల్ల వెళ్ళిపోయారు. అదీకాక గోవిందు, వెంకటయ్య, రామకృష్ణ, రామప్ప, కుళ్ళాయప్ప అంతా జట్టునాయకులు. ఎవరికివారు వారి విద్య సంతతినీ నాకు చూపించాలన్నట్లు పోటీ పడ్డారు. లంకిణి యుద్ధం తర్వాత ఆటను చిన్నపిల్లలే నడిపారు. మరలా హనుమంతుని తోకకు నిప్పంటించే ఘట్టంలో రామకృష్ణ, శారదలు ప్రవేశించారు. అప్పటి వరకు పిల్లలే స్వాధీనపరచుకున్నారు. కొన్ని కొన్ని సందర్భాలలో పిల్లలు బొమ్మలను నాట్యం చేయిస్తుంటే రామప్ప తొక్కు-డు బల్ల తొక్కా-డు.

మొత్తంమీద ప్రదర్శకుల అనుభవం పరిగణనలోనికి తీసుకుంటే అనుభవం ఉన్నవారి చేతిలోని బొమ్మగానీ, కాలికింద తొక్కు-డు చెక్క-గానీ, నోటిమాట, పాట, పద్యం మొదలయినవి కానీ సరిగ్గా సందర్భానుసారంగా సరిపోతాయి. ఐతే వీటన్నిటి మూలంగా ప్రదర్శన విజయవంతం అయ్యే అవకాశం ఉంటుంది. ఈ ప్రదర్శనలో పాల్గొన్న రామప్ప, రంగమ్మ, వెంకటయ్య, గోవిందు వయస్సులో చాలా పెద్దవారు వారు దాదాపు వృత్తిలో పదవీ విరమణ చేసి ఉండవచ్చు. ఉల్లాసంగా పాల్గొన్నా వారి అనుభవం దృష్ట్యా ఉత్సాహంగా నటించారు. రామకృష్ణ, శారద భార్యభర్తలు. వీరు ఇప్పటికీ బృందంతో ఊరూరు తిరిగి ప్రదర్శనలిస్తున్నారు. కుళ్ళాయప్ప అటువంటివాడే ఈ ప్రదర్శనలో పాల్గొన్నవారి వివరాలివి:

| | |
|---|---|
| దళవాయి రంగమ్మ, W/O వెంకటప్ప, వయస్సు | 55 సం॥ |
| వనారస శారదమ్మ, W/O రామకృష్ణ (ముఖ్యనాయిక) | 40 సం॥ |
| వనారస రామకృష్ణ (ముఖ్య నాయకుడు) | 52 సం॥ |
| సింధే కుళ్ళాయప్ప (మద్దెల) | 40 సం॥ |

| | |
|---|---|
| దళవాయి వెంకటమ్మ D/O చలపతి | 10 సం॥ |
| దళవాయి మంగమ్మ D/O పెదనారాయణ | 14 సం॥ |
| దళవాయి వెంకటప్ప S/O ఖదేరావు | 60 సం॥ |
| దళవాయి చలపతిరావు S/O ఖదేరావు | 55 సం॥ |
| దళవాయి రామప్ప S/O ఖదేరావు | 65 సం॥ |
| దళవాయి చిన్న నారాయణ S/O ఖదేరావు | 40 సం॥ |
| దళవాయి గోవిందు S/O ఖదేరావు | 63 సం॥ |

వీరంతా నాటకంలో అనుభవం ఉన్నట్లు వీరి ప్రదర్శన వల్ల తెలిసింది. అయితే ఐదారు జట్లుగా బ్రతుకుతున్నారు.

## 5.2. కథ అల్లిక విధానం :

తోలుబొమ్మలాటల్లో ఇప్పటివరకు దాదాపు పౌరాణిక కథా ప్రదర్శనలనే సాగిస్తున్నారు. పౌరాణిక కథలు ఎన్నో ప్రక్రియలద్వారా వ్యక్తమవుతూనే ఉన్నాయి. మరి ఈ ప్రదర్శనలను చూసే ప్రేక్షకులు కథలు తెలియక వచ్చి చూస్తున్నారా! కానేకాదు. ఆయా ప్రక్రియలద్వారా ప్రదర్శనల్లో వలు లౌకిక విషయాలను చొప్పించి విజయవంతం చేస్తారు. ప్రదర్శనలను దిగ్విజయం చేయడంలో ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గాన్ని అనుసరిస్తారు. అందులో తోలుబొమ్మలాటవారు ప్రదర్శనకు ఎన్నుకున్న మార్గం చాలా లౌకికమైనది. వారు సాహిత్యంతోబాటు బొమ్మలూ, వాద్యాలు ప్రవేశపెడతారు. వీటన్నిటిని మిళితంచేసి ప్రదర్శించి, అతిసామాన్యులైన ప్రేక్షకులను ఆకర్షింపజేసుకుంటారు. నిమ్మలకుంటలోని తోలుబొమ్మలాటవారు అల్లిన కథా విధానం ఆకర్షణీయంగా ఉంది. తెరపై విఘ్నేశ్వరుని బొమ్మను ప్రవేశపెట్టారు. మొదట "గోవిందా! నారాయణా!" అని విష్ణుస్తోత్రం చేసారు. చివరి చరణం అయిన తర్వాత వాద్యాలను రెండోకాలంలో ప్రయోగించి ప్రేక్షకులలో ఉత్కంఠను కల్గించారు. "తరిగిడకథిం- తరిగిడకథిం", తరిగిడకతో అని ముక్తాయింపుతో ఆ స్తోత్రాన్ని ముగించారు.

తొండమునేక దంతమును
తోరపుబొజ్జయు వామహస్తమును

మెండుగ గజ్జలు మ్రోయగను

మెల్లని చూపులు మందహాసమున్ .... అనే పద్యాన్ని ముఖ్య కథా ప్రదర్శకుడు పాడాడు. పద్యాలు, వచనం ఏవి ఎక్కడ నుండి స్వీకరించినా వాటిని తమకు అనుకూలమైన పద్ధతిలో మార్చుకుంటారు. పై పద్యంలో 'మెండుగ మ్రోయు గజ్జెలు' అనే పదాన్ని 'మెండుగ గజ్జెలు మ్రోయగ' అని మార్పు చేసారు. మ్రోయగ గజ్జెలు అనే దానికంటె గజ్జెలు మ్రోయగను అనేదే వినడానికి ఇంపుగాను, బొమ్మలాట ప్రదర్శనలో అర్థవంతంగాను కన్పిస్తుంది. పైగా పద్యం పూర్తిగా పాడలేదు ఈ ప్రార్థనా పద్యం అందరకు తెలిసిందే. ఆ పద్యానికి తగిన విధంగా ఆ బొమ్మ ఉంది. పద్యంలోని ప్రతి పదాన్ని బొమ్మలో చూపిస్తూ, వివరిస్తూ ప్రదర్శించడంవల్ల విఘ్నేశ్వరుని ఆకారం అతి సామాన్యులకు చక్కగా బోధపడుతుంది. ఈ పద్యం కాగానే స్త్రీ కంఠం 'ఆఁ ఆఁ....' అంటూ రాగం తీసింది. తర్వాత "తత్తద్దై తత్తద్దై త తద్దై" అని ముక్తాయించారు. తర్వాత-

"గణనాథా బ్రోవవయ్యా

గణనాథా నీవు" అంటూ ప్రార్థన పాట పాడారు.

ముందుగా ప్రధాన గాయకుడు పాడగా తక్కినవారంతా దాన్ని పునరుచ్ఛరించారు. తక్కిన వారందర్నీ కలిపి వంతలు అంటారు. రెండో కాలంలో తాళాలు మ్రోగాయి. తర్వాత రాగం. ఆ తర్వాత "ధిమిత, ధిమిత, ధిమిత" అని ముక్తాయించారు. తర్వాత వినాయకుడు ఎవరో, ఎందువల్ల అతణ్ణిస్తోత్రం చేస్తున్నారో వివరించాడు. ఈ వంతలంతా తలా ఒకపనిలో ఉన్నవారే. హార్మోనియం, తాళాలు, మద్దెల మొదలగు వాద్యాలను, ఒక్కొక్క రొక్కదానిని స్వీకరించారు. ఒకరు బొమ్మలను ఆడించడానికి, ప్రధాన ప్రదర్శకుని ప్రక్కనే ఉన్నాడు. ఈమెయే ప్రధాన వంత. ముఖ్యంగా ప్రధాన వంత, అన్ని తోలు బొమ్మ లాట జట్లలోను స్త్రీయే స్వీకరిస్తుంది. ఆట అంతటిలోను పాట లేదా పద్యం పూర్తిగా చదవడం తర్వాత స్త్రీ గొంతుక లేదా గొంతుకలు రాగం తీయడం, తర్వాత ముక్తాయింపు, ఆ తర్వాత సంభాషణ ధోరణిలో వివరణ ప్రధానంగా కన్పిస్తుంది. వినాయకుణ్ణి, అతన్ని స్తోత్రం చేయవలసిన అవసరాన్ని ప్రస్తావించారు. ఆ ప్రస్తావనలో అయన కైలాసంలో ఉండే త్రినేత్రధారి

యగు చంద్రశేఖరుని కుమారుడుగా పరిచయం చేశారు. వెంటనే చంద్రశేఖరుని (శివుని) స్తోత్రం మొదలు పెట్టారు. గమనించవలసిన విషయం ఏమంటే, తెరపై విఘ్నేశ్వరుని బొమ్మను అట్లే పట్టుకొని శివుని స్తోత్రం చేశారు. శివుని బొమ్మ ప్రవేశపెట్టలేదు. ఆట మొత్తంలో బొమ్మ లేకుండా స్తోత్రం చేయడం లేదా ప్రస్తావించడం శివకేశవుల స్తోత్రాల సందర్భమే.

మరెచ్చటా ప్రదర్శన మొత్తంలో కన్పించలేదు.
మహేశ్వరా! మహేశ్వరా
రారా మమ్ముల బ్రోవవా" అంటూ ప్రధాన గాయకుడు స్తోత్రం వినిపించాడు. వంతలు పునరుచ్చరించారు. "ధిమిత, దిమిత, దిమిత" అనే ముక్తాయింపుతో దాన్ని నిలుపు చేశారు. తర్వాత 'విఘ్నేశ్వరుని ప్రార్థన కావించినాము. తర్వాత చదువుల తల్లి సరస్వతి ప్రార్థన కావించండి" అని చంద్రశేఖరుని మాట వివరణలో రాకుండా దాటవేశారు. సరస్వతి ప్రార్థన కావించండి" అని చెప్పడంతో సరస్వతి రాకకోసం ఎదురు చూడడం ప్రేక్షకుల పనిగా కథా విధానంలో కనబడింది. తర్వాత "తత్తై తర్ఘుణ తఝ్ఝుణ తతా" అని ప్రధాన గాయకుడంటూ ఉండగానే వంతలంతా సరస్వతికి "సోగతం సోగతం, సోగతం" అంటూ సరస్వతికి ఆహ్వానం పలికారు. ఇది ప్రేక్షకులలో ఉత్కంఠతను రేకెత్తించే సన్నివేశం. కథకు సంబంధం లేని పాత్రలైనా ప్రేక్షకులను ఎప్పుడూ ఆకర్షింప జేసుకోవడం మీదే దృష్టి ఉంటుంది. అనే ఇచ్చట ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

''రాదాయనే బామా రాదాయనే
రాదాయనే బామా రాదాయనే
సరస్వతీ బామా వేడుకా జూడా
రాదాయనే బామా రాదాయనే"

ఇదీ సరస్వతిని ప్రవేశపెట్టిన తీరు. సరస్వతి లాంటి పాత్రను, ఎవరమ్మా నీవు? ఎందుకు ఇచ్చటికి వచ్చావు? అని ఒకరు ప్రశ్నిస్తే రెండో వారు, తాను బ్రహ్మదేవుని భార్య సరస్వతిననీ బ్రహ్మలోకం పోతూ పోతూ

మార్గ మధ్యలో ఈ ప్రదర్శనను చూసిన వారికి ముక్తిని ప్రసాదించడానికి ప్రార్థనలు జరుపగా తాను దీవించిపోవాలని వచ్చినట్లు తెలుపుతుంది. తెర మీద ఒక్క సరస్వతి బొమ్మ మాత్రమే ఉంటుంది. విఘ్నేశ్వరుణ్ణిగాని, సరస్వతిని గాని, తెర లోపల ప్రదర్శకులే ప్రశ్నించారు. ఇతర కథా ఘట్టాల్లో ఒక పాత్రను మరొక బొమ్మ తెరపై ఉండి మాత్రమే ప్రశ్నించింది. సరస్వతి నిష్క్రమణలో మాత్రం వెళ్ళి రావమ్మా అంటూ—

మాంపాహి

మా జయ జననీ

మా జయ జననీ

వరవీణా పుస్తక పాణీ" అంటూ పాడి రెండో కాలంలో వాద్యాలను ప్రయోగించి "తకిటతా, తకిటతా, తకిటతా" అంటూ ముక్తాయించారు. విఘ్నేశ్వర ప్రార్థన ప్రతి నాటక ప్రయోగంలోను ప్రవేశ పెడతారు. ఇక్కడ సరస్వతి ప్రార్థన పెట్టినప్పటికీ, కథకూ ఈ పాత్రకూ సంబంధం ఉందీ అనే భావన ప్రేక్షకులలో కల్గించారు కథ అసలు ఇంతేనేమో అనేంత భ్రమను ప్రేక్షకులలో కల్గించారు. నాటకంలో నాంది ప్రస్తావనలూ సూత్రదారుడు చేస్తాడు. ఇచ్చట సూచనాప్రాయంగా, ప్రదర్శన కథ పేరు, అతి పవిత్రమైన పాత్ర సరస్వతీదేవి ద్వారా చెప్పించారు. అది కూడా యిక్కడ జరిగే "సుందరాకాండము, లంకాదహనమును చూసి ముక్తి పొందుటకు" వచ్చానని సరస్వతి ద్వారా సూచనప్రాయంగా చెప్పడం ద్వారా ఆ పాత్ర కథతో ప్రత్యేక సంబంధాన్ని కల్పించారు. తర్వాత ప్రార్థనలు అయిపోయాయి. ప్రారంభదారుడైన జుట్టుపోలుగాడు, వాని భార్య బంగారక్కను ప్రవేశ పెట్టబోతున్నట్లు చెబుతారు. ప్రక్కవంత ఆతృతగా "ఈలాగున పిలవండి" అనగానే ముందుగా "బంగారక్క ఎలాగు వస్తున్నదంటే" అని ఆమె వయ్యారానికి ఒక ఉత్కంఠ బాణాన్ని వదిలాడు.

"తగదిది మదనా.... ఆఁ....

ఓయమ్మ ఓయమ్మ ఓయమ్మా....

ఆఁ....... ఆఁ......."

అంటూ బంగారక్క తెరపైకి వస్తున్న విధానానికి తీవ్రత గలిగించే విధంగా ఉన్నాయి పైన చెప్పిన మాటలు. వాద్యాలను రెండో కాలంలో వాడారు.

"తరిగిట తాక్కతక దిరికిటతక దిరికిటతక
తదిగిణత తదిగిణత తదిగిణత"

బంగారక్కను ప్రవేశపెట్టడానికి ఒక వాతావరణాన్ని కల్పించి, పాత్రను ప్రవేశపెట్టి ఆ తీవ్రతను పైపదంద్వారా ముక్తాయించారు. తర్వాత

"తాళలేనమ్మా విరహము
నే తాళలేనమ్మా విరహము
వద్దాకే రాడాయే
పొద్దాదే బలమాయే"

అనే దరువును ప్రధానగాయని, తర్వాత వంతలు పాడారు. బొమ్మలాటలో స్త్రీల పాత్రలను స్త్రీలే పాడుతారు. దాన్ని ముక్తాయించారు. తర్వాత హాస్యప్రసంగం తెపింది బంగారక్క. హాస్యంలో ఆ గ్రామానికి సంబంధించిన అంశం ప్రవేశపెట్టి గ్రామ ప్రజలలో ఒక రకమైన సంబంధ భావాన్ని ప్రేరేపించారు.

"నా దేహమంత జిల ఎక్కుతూందన్న"
ఏలమ్మా! ఏలమ్మా!

"ఏమోనన్న ఈ గ్రామం నీళ్ళు తాగగానే నా తల మొల దేహమంతా ఎగబెట్టి గీకినా జిలపోలేదన్నా" అంటుంది బంగారక్క. పక్కన వంత - అట్లాకాదు నిమ్మకుంట బోరింగు నీళ్ళు అట్లాంటివి కావు. గ్రామస్తుల సహాయంతో గవర్నమెంటు వాళ్ళు శ్రద్ధతో వేసినవి అని, ఆ ప్రస్తావనను ప్రశంస కిందకు మార్చారు ప్రజలలో వారి ఆటపై అపేక్ష పెరగడానికి దోహదం చేస్తాయి ఇటువంటి సంభాషణలు. ఈ మాటలు జరుగబోయే ఆటకు, ప్రేక్షకులకు సన్నిహిత సంబంధాన్ని చేకూర్చుతాయి. హాస్యాన్ని పొడిగిస్తూ-

నీ వక్కతెవే ఉన్నావు-నీ మగదేమయ్యాడు అని అడుగుతాడు 'వంత'. అపుడు బంగారక్క "నాకు ఈడుకాడు, జోడుకాడు, వెంటకాడు మొత్తం ముగ్గురున్నారబ్బా నాకు" అని ఒక చమత్కార ప్రయోగం వదులుతుంది. ప్రేక్షకులలో నవ్వులు, విషయంపై శ్రద్ధ పెరిగాయి.

"ఎవరువారు! వారి పేరేమమ్మా" అని అడిగితే "కస్తూరి మిళితమైన గంధోళిగాడు" అంటుంది. అతనే జుట్టు పోలిగాడు అని చెబుతుంది. వంత కోర్కెపై వాణ్ణి పిలుస్తుంది.

"రారా సామీ గంధోళీ" అంటూ దరవు మొదలవుతుంది. స్త్రీ ప్రధానంగా పాడగా తక్కిన వారంతా వంతపాడారు. "రారా నాసరసనకింకా, రావు ఏలరా" అని పాడి, "తధిమి, తధిమి, తధిమితా" అని ముక్తాయించారు. వేరు వేరు ఆకారాల్లో ఉన్న పోలిగాడి బొమ్మల్ని మూటిని ప్రవేశ పెట్టారు. వీళ్ళంతా నా భర్తలేనని బంగారక్క చెప్పింది. ఇన్ని కేతిగాని బొమ్మలు ప్రవేశ పెట్టడం కేవలం హాస్య చతురులను ఆకర్షించడం కోసమే. ఇంతలో ప్రేక్షకుల్లో కొండారెడ్డి అనే వ్యక్తి 'నేను రూపాయిస్తా, నా పేరు చదువు రామప్ప' అని కేక వేశాడు. రూపాయి పంపించాడు. వెంటనే కొండారెడ్డి పేరుతో కలిపి, దేవతల పేర్లన్నీ కలిపిన ఒక కొండవీటి చేంతాడంత పెద్ద వాక్యాన్ని పొగడ్తగా వదిలాడు రామప్ప. పొగడ్తల పరంపర మొదలై ''దానమిచ్చినవారికి నూరేళ్ళు గలిగి నూటపదేళ్ళు మాకు గలిగి వర్ధిల్లాలని'' అందులో గూడ హాస్య ఛలోక్తిని విసిరాడు రామప్ప. ప్రేక్షకుల నుండి ''ఈ ముసలాడికి ఇంకా నూట పదేళ్ళెందుకో" అని ఒక కామెంటు వినపడింది. తర్వాత గ్రామాన్ని గ్రామ పెద్దలను, గ్రామ రైతులను పొగడినాడు రామప్ప. శ్రీకృష్ణదేవరాయలు కాలం నుండి తోలుబొమ్మలాటలు ఎక్కువగా పోషింపబడినవని ఒక చారిత్ర కాంశాన్ని పొగడ్తలలోనే వదిలాడు రామప్ప. దీనితోపాటు పాలను కాస్తే పెరుగవుతుందని, పెరుగును చిలికితే వెన్న వస్తుందనీ, ఇదే విధంగా ఈ కళా రూపం నుండి సినిమాలు రూపొందించినట్లు దానికి సామ్యమైన చక్కని ఉదాహరణను జోడించి వివరించాడు. పూర్వపు రోజుల్లో తొంభై ఆమడబోయి తోలుబొమ్మలాట, అరవై ఆమడబోయి అవుల పబ్బం చూడాలనే సామెతను జోడించి, ఒకరు ప్రశ్నించడం, మరొకరు సమాధానం చెప్పడం వంటి సంభాషణ ద్వారా తెలిపారివన్నీ. ఇక్కడ కథ మొదలుపెట్టడానికి ముందు పొగడ్తలు, వాటినుండి చారిత్రకాంశాల్లోకి, వాటినుండి సామాజిక పరిస్థితుల్లోకి కళారూపం గొప్పతనానికి, తద్వారా కథా ప్రారంభానికి సంబంధాన్ని కూర్చారు. కథ సుందరకాండము అని చెప్పినా అరణ్యకాండ నుండి మొదలు పెట్టారు. సీతారామలక్ష్మణుల వనవాసం, మాయలేడి, సీతాపహరణం, వాలి సుగ్రీవుల యుద్ధం. సుగ్రీవ పట్టాభిషేకం, ఆంజనేయుని సముద్రలంఘనం, అశోకవనంలో సీతను హనుమంతుడు చూడడం- తిరిగి రామునికి సీత జాడ తెలపడం మొదలైన అంశాలు ప్రదర్శింపబడతాయని ఆట పూర్తి స్వరూపాన్ని సూక్ష్మంగా సూచన రూపంగా తెలిపాడు రామప్ప. ఈ రామప్ప బాగా మంద

బిగించి ఉన్నాడు. అందువల్ల మాటలు కాస్త అటు ఇటు తారుమారయ్యాయి. "ఈ కథ తెరపైన జరుగుతుంది కాని అ(() ఎందరో మహానుభావులు; అందరికు మా అభివందనములు స్వీకరించి, కథ బిగిన్ చెయ్" అన్నాడు. ఇతను చదువకపోయినప్పటికీ, అధునాతనంగా భాషలో చేరే మార్పులు, చేర్పులు, ఈతని మాటల్లోకూడ చేరాయి. "కథ మొదలుపెట్టు" అనడానికి బదులు "బిగిన్ చెయ్" అనే మాటను వాడాడు. 'బిగిన్' అనే ఇంగ్లీషుమాట వ్యవహారికుల భాషలో సైతం ఎంతగా ప్రవేశించి ప్రచారం పొందుతుందో కన్పిస్తుంది. పొగడ్తల హోరులో ప్రేక్షకులు అలసినట్లున్నారు. "కథ కానియ్యండయ్యోయ్' పొగడ్తలు చాల్లే" అని సరాసరి హెచ్చరిక కేక వినిపించింది ప్రేక్షకులనుండి. రెండు నిముషాల విరామం జరిగింది. వాద్యాల శ్రుతి మొదలైంది. మాయన్నా!

శ్రీరామలక్ష్మణులు వచ్చేనపుడు
రామలక్ష్మణులూ వచ్చే సీతా భామతోడా" ॥శ్రీరామ॥

అంటూ మూడు బొమ్మల్ని ప్రవేశపెట్టారు. ఈ దరువులో ప్రత్యేక భావం ఏమీ లేదు. తెరమీదకు వచ్చినట్లు తెల్పడం, అన్ని బొమ్మల్ని నృత్యంతో ప్రవేశపెట్టారు. ఆ తర్వాత వాద్యాలను రెండో కాలంలో ప్రయోగించి తర్వాత తిత్తై తిత్తై తిత్తై తత్తా అని ముక్తాయించారు. తర్వాత సంభాషణ రూపంలో కథను మలిచారు. రామలక్ష్మణులు పంచవటీ తీరాన్ని గురించి అచ్చటి ఆహ్లాద పరిస్థితుల గురించి సంతృప్తి చెందినట్లు మాట్లాడుతూ ఉన్న ఘట్టంతో కథ ప్రారంభం అయింది. బంగారు లేడి ప్రవేశం, సీత దాన్ని కోరడం వరకు సంభాషణంలో ప్రవేశపెట్టారు. అది "ఏ మృగం" అని రాముడు అడుగుతాడు. సీత దాన్ని వర్ణిస్తుంది.

దేహ మెల్లను వింతచే తేజరిల్లు
కొమ్ములందును మాణిక్యకోవలనగా....అ....

అ( ..." అంటూ బంగారు లేడి వర్ణన రెండు పాదాలు చెప్పి తక్కిన భాగం వదలివేసి, ఆ సీత కోర్కెను వచనంలో చెప్పించారు సీత చేత. తర్వాత రాముడు దాన్ని పట్టితేవడానికి ఉద్యమించడం, లక్ష్మణుడు అది బంగారు లేడి కాదని అనుమానం వ్యక్తం చేయడం, లక్ష్మణునికి నచ్చచెప్పి, రాముడు దాని వెంట పడటం, లక్ష్మణుడు సీత కుటీరానికి వెళ్ళడం, అంతా సంభాషణద్వారా

నడచింది. బంగారు లేడిని రాముడు వెంబడించడం చక్కని కథా ఆకళింపుకు మార్గం తెరపైన ఈ మృగం పరుగెత్తే సమయంలో డప్పు వాద్యం ప్రయోగించారు. దానికి చర్రీ వాద్యం ప్రయోగించారు. రాముడు లేడిని బాణంతో కొట్టడం, లేడి మారీచుడుగా మారడం "హా, లక్ష్మణా, హా, సీతా!" అని అరవడం అన్నీ తెరపై చూపించారు.

ఇచ్చట ఎటువంటి సంభాషణగానీ, కథా వివరణగానీ లేకున్నా కథా క్రమానికి ఇబ్బంది కలుగలేదు. తెరపైన లేడిని వెంబడించడమే చక్కని ప్రదర్శన. అది తుణ్ణంగా తర్వాతి కథా మట్టాన్ని తెల్పింది. మీ అన్నగారికి ఏదో అపద కల్గినట్లుందని సీత పలికితే లక్ష్మణుడు మా అన్నకు అపద కలిగితే ముల్లోకాలు తల్లడిల్లుతాయనీ, నక్షత్రాలు ఝల్లున రాలుతాయనీ, సూర్యచంద్రాదులు 'తేజోహీనులవుతారనీ, కాబట్టి అనుమానం వలదనీ పలుకుతాడు. దుష్ట రాక్షసులేమీ చేయలేరని చెబుతాడు. అపుడు సీత "ఛీ లక్ష్మణా! భరతుడు తమ్ముడని నమ్మితే రాజ్యం కాజేశాడు! "నీవు మిత్రునివలె వచ్చి శత్రుత్వం వహించావు, ఛీ నీముఖం చూపించకు, పొమ్మావలకూ" అంటుంది. రామాయణంలో సీత లక్ష్మణుని నిందిస్తూ భరతుడు రాజ్యం కాజేశాడు, నీవు నన్ను కాజేయాలని కుట్ర పన్నుతున్నావంటుంది. కానీ లక్ష్మణపాత్ర ఔచిత్యాన్ని ఇక్కడ తోలుబొమ్మలాటలో కాపాడారు. "మిత్రునిలా వచ్చి శత్రుత్వం సాధించాలనుకుంటున్నావనే" అంటుంది. లక్ష్మణుని వంటి రామభక్తునికి, సున్నిత మనస్కునికి, ఈ మాటలు పాత్రౌచిత్య పరిపోషణమే అవుతుంది అంతేకాక, సీత పాత్ర ద్వారా "నన్ను కాజేయాలనుకుంటున్నావు" అనే మాటలు అనిపించకపోవడం సీత పాత్రౌచిత్యాన్ని కాపాడడమే. తర్వాత బాధపడుతూ లక్ష్మణుడు రాముని వెదకుతూ వెళ్ళతాడు.

ఈ సన్నివేశాలన్నీ సంభాషణల ద్వారా ఒక పాత్ర మరొక పాత్రను అడగడం, సమాధానం చెప్పడం, దీనికి రెండో పాత్ర "ఊ" "ఊహూ" అంటూ "ఊ" కొట్టడం చూస్తే ఇరువురు వ్యక్తుల సాధారణ సంభాషణను గుర్తు చేస్తున్నది. భాష అతి సాధారణంగానూ, అందరకూ సులభంగా అర్థమయ్యే రీతిలోనూ ఉంది. కథ ప్రేక్షకులకు తెలిసిందే అయినా ఈ బొమ్మల అభినయాల ద్వారా, సంభాషణల్లోని భావాల ద్వారా కథమీది ప్రేక్షకులకు అపేక్ష

పెరగడానికి వీలుంది. తర్వాత రావణ ప్రవేశం. "హర హర మహాదేవ శంభో శంకర" అని జంగం యతి వేషానికి తగినట్టి మాటలతో ప్రవేశ పెట్టారు. సీతను సంబోధించేటప్పుడు -

"సత్కుల కటాక్షణా, భవతీ భిక్షాందేహి!

మాతా అన్నపూర్ణేశ్వరీ'' అన్న మాటల్లో 'భవతీ భిక్షాందేహి, మాతా అన్నపూర్ణేశ్వరీ' అనేవి గ్రాంథిక భాషా పదాలైనప్పటికీ నిత్య వ్యవహారంలో ఎక్కువ ప్రచారాన్ని పొందినవే. సీతాదేవి ఆహ్వానించిన తీరు ఆ సమయంలో బొమ్మ ప్రవర్తన భావాని కనుగుణంగా ఉన్నాయి. రావణుని ప్రశ్నలు అతి సాధారణంగా ఉన్నాయి ఒక్కమాట మాత్రం భావ గర్భితంగా ఉంది. "పురుషులు లేని సమయమున అతిథులు పరపురుషులు గృహమున నుండరాదు. ఇదే మర్యాదలు కాదు గాని త్వరగా భిక్షం వేసిన నేను పోయెదను. అయినా నువ్వెవ్వరవు? ఏకాంతంబున నీవు ఒంటరిగా నుండుటకు కారణంబేమి? నీ పేరేమి? అని సాధారణ కుశల ప్రశ్నలు అడిగినట్లు ప్రవేశపెట్టినారు. తర్వాత నిన్నరవతము సుఖించే పురుషు "డెవరు?" అని ప్రశ్నించడం—

తర్వాతి కథకు, సున్నితంగా సూచనప్రాయంగా బీజాలు వడినట్లూహించవచ్చును బొమ్మలాట వారు అంతగా ఆలోచించి చేసినారని చెప్పలేము. లేదా జీవితాంతము ఆ కథల్నే ప్రదర్శించడం వల్ల అనుభవంతో ఔచిత్యానౌచిత్యాలు గమనించి చేర్పులు చేసినా చేసి వుండవచ్చు. ఏదైనా నీ భర్త ఎవరు అనే బదులు "నిన్ననవరతము సుఖించే పురుషుడు" అనే ప్రయోగం రావణుడు సీతపై గల కామపు కోర్కెను సూచిస్తున్నదనవచ్చు. రావణుని ప్రశ్నలకు సీత తన వృత్తాంత మంతా తెలుపుతుంది. వెంటనే రావణుడు తన వృత్తాంత మంతా తెలుపుతాడు. తాను సీతను కోరుతున్నట్లునూ "ఎన్నియో దినముల నుండి నిన్ను పట్టరాని మోహముచేత పట్టవలయునని తలచినవాడను. నిన్ను ఇప్పుడే చెరపట్టెదను" అంటూ చెబుతాడు. ఈ విషయ వివరణ సూటిగా ఉంది. ప్రేక్షకునికి కావలసిన సన్నివేశాలలో పరాకాష్ఠకు చెందిన మలుపుల్లో సూటిగా సమాధానం చెప్పడం, అదీ అతి ముఖ్యమైన సన్నివేశాల్లో జరిగింది. తర్వాత సీతచేత అనిపించిన మాటలు సరిగ్గా రాజ వంశపు స్త్రీల మాటలే పడినాయి. "ఛీ....ఓరీ! నీచుడా! సకల శస్త్రాస్త్ర

విద్యల విశారదుండగు ప్రభు రాముని భార్యను కోర నీకు ఎన్ని తలలు కలవురా"! అనే ఎదురు ప్రశ్న - తన బలాన్ని తెలిపే ధైర్య భాషణం రాజసపు హెచ్చరిక. అతి సామాన్య సంభాషణలలో, నిత్య వ్యవహారంలో ఎదుటివారు చులకనగా ప్రవర్తించినపుడు వారిని హెచ్చరించేటప్పుడు "ఎన్ని గుండెలు నీకు నన్నిట్లా ఎదిరించడానికి" అంటుంటారు.

ఈ మాట మాత్రం సామాన్యుల సమస్యలోని హెచ్చరికను నూటికి నూరుపాళ్ళు గుర్తుచేసి ఇది విన్న ప్రతి ఒక్కరూ ఆ కథను తనకు అన్వయించు కొని చూసుకునే విధంగా ఉంది. దానికి సమాధానం కూడా అతి సామాన్య లోక వ్యవహారంలాగానే ఉంది. "అహః హః హః - అయినా నాకెన్నియో చూడు! నా తలలు ఆకలించి చూడవే సుందరీ" అంటాడు రావణుడు. మూల కథలో తన బలాన్ని, తన దర్పాన్ని తెలిపే విధంగా ఉన్నప్పటికీ ఇక్కడ మాత్రం సామాన్యుల సంవాదంలో ఎదుటివాళ్ళను భయపెట్టడానికి తన బలాన్ని తెలిపే విధంగా ఉంది, రావణుని సమాధానం. "ఎన్ని తలలున్నాయి నీకు" అని సీత చేత అనిపించడం కూడా రావణుని పదితలల సమాధానానికి ప్రశ్నవలెనే కన్పి స్తుంది. మరొక ముఖ్య విషయమేమంటే, యతి వేషం బొమ్మను మార్చి దశ కంఠుని ప్రవేశ పెడుతున్న పుడు తెరలోపల ఉన్న వాయిద్యాలన్నీ ఒక్కసారిగా తారా స్థాయిలో ప్రయోగించడం. అప్పటివరకు కథను అందరూ గమనిస్తు న్నప్పటికీ ఈ వాయిద్యాల మ్రోతవల్ల ప్రేక్షకులలో ఒక్కసారిగా ఉత్కంఠ బయలుదేరడానికి ప్రేరకంగా ఉంది. దశకంఠుని చూసి సీతాదేవి ఒక్కతె కాదు మూర్ఛపోయేది - ప్రేక్షకులలో మూర్ఛ పోయినంత పనై, సున్నిత మనస్కులైన స్త్రీలు కొందరికి ఆ వాద్యాల మ్రోతకు భయంకరత్వాన్ని వెలి బుచ్చే ఆ బొమ్మ దృశ్యానికి గుండెదడ పట్టుకొంటుందికూడా. సీత మూర్ఛిల్లిన తరువాత ఆమెను భూమిని పెకలించినట్లు నడించి తీసుకొనిపోయే సందర్భ ములో కూడా వాద్యాలను రెండోకాలంలో ప్రయోగించారు. రావణుని బొమ్మను తెరమీద ఒక వైపునుండి వెళ్ళి మరలా అదేవైపు నుండి ప్రవేశపెట్టారు.

చాలా దూరం ప్రయాణం చేస్తున్నాడు రావణుడు అనే భావన ప్రేక్ష కులలో కలగడమే తెరమీద ఆ బొమ్మను నాలు గైదుసార్లు పోతున్నట్లు చూపడానికి కారణం. ఇందులో కూడా తెరమీద ఒకవైపుకు వెళ్ళిన తర్వాత

రెండు నిమిషాల విరామం. ఆ తర్వాత మరలా అంతకు ముందు ప్రదర్శించిన మార్గంలోనే రావణ బొమ్మ ప్రవేశం మరలా విరామం. ఇంతలో జటాయువు ప్రవేశం "రావణాసురుడు వైదేహిని అనగా ఆ యొక్క సీతాదేవిని తీసుకు వెళుతున్నాడు" అని స్వగతం పలికించారు. "వైదేహి అనగా ఆ యొక్క సీతాదేవిని" అనేటువంటి వివరణాత్మక ప్రయోగాలు తోలుబొమ్మలాటకు మూల స్థంబాలు. శ్లోకం చదివి అందులోని పదాలు విరచి వాటి అర్థాలను, అట్లాగే పద్యాలు చదివి, వాటి పదాలను విరచి, ఆ పదాల అర్థాలను వివరణాత్మక పద్ధతిలో చెబుతారు బొమ్మలాట కథా కథన విధానంలో ఇది పెద్ద మార్క్. మరొక్కటి. శత్రువులను ప్రశ్నించే విధం సామాన్యుల లోకవ్యవహారం వలె ఉంటుంది. జటాయువు రావణుని "ఎవడవురా నీవు" అని ప్రశ్నిస్తుంది. ఈ "రా" ప్రయోగం అతి తక్కువగా భావించడాన్ని తెలుపుతుంది. అదే స్నేహం పొందబోయే పాత్రలైతే ఈ ప్రయోగ పక్కి మరో రకంగా "ఎవరయ్యా నీవు!" లేదా "మహాత్మా, ఎవరు నీవు?" అని ఉంటుంది రావణ జటాయువు సంవాదంలో "అరేయ్! ఒరేయ్!" అతి సామాన్యంగా కన్పించాయి. రావణుడు జటాయువుతో "అరేయ్, పొగరెక్కి నీ సరి ఎవ్వరూ లేరని నిక్కెదవా ఏమి? ఈమెను ఊరక నీకు విడిచిపెట్టి పోవలెనా?" "అరేయ్ ఇదే ఖడ్గముతో నిన్ను నరికి పెట్టి పోయెద" అంటాడు "నిక్కెదవా, నరికి పెట్టి పోయెద" మొదలయిన ప్రయోగాలు భాషా సారళ్యాన్ని తెలిపే వ్యవహారిక పదాలు.

రావణ జటాయువు యుద్ధ ఘట్టంలో ఇద్దరూ సమానులవలె యుద్ధం చేసారు. అంటే జటాయువు పక్షి అయినప్పటికీ పదితలల రావణుడు అతి బలవంతుడైనప్పటికీ వారిద్దరి యుద్ధం సమానుల మధ్య పోరుగానే చిత్రించారు. ఈ రెండు బొమ్మలు తెరంతటా పొర్లిపొర్లి యుద్ధం చేసినట్లు చూపించారు. ప్రేక్షకులనుండి ఈ చిత్రం చూస్తునంతసేపూ ఈలలు విన్పించాయి. ఈ యుద్ధ ఘట్టంలో తప్పెట, తొక్కుబిల్ల, మద్దెల మొదలైన వాద్యాల సవ్వడి యుద్ధ ఉధృతిని తెలిపాయి. జటాయువు "రామా, శ్రీరామా" అంటూ కింద పడిపోగానే ప్రేక్షకుల నుండి "అయ్యో! అయ్యో" అనే సానుభూతి మాటలు విన్పించాయి. ఇదంతా కథకు ప్రేక్షకుల అనుభూతికి సంబంధాన్ని తెలుపుతుంది. తర్వాత రామలక్ష్మణుల ప్రవేశం, వారి సంభాషణ ఎందుకు వచ్చినా

వని రాముడడుగగా "నన్ను అనరానిమాటలు అని, వినరాని పలుకులు పలికి నది, అది విని నేను వినజాలక వచ్చినాను" అని లక్ష్మణుని సమాధానం. తర్వాత ఇద్దరూ పర్ణశాలకు రావడం, సీతను వెదకడం ఆమె కన్పించక పోగానే "అయ్యో తమ్ముడా ఏది దారి హా....సీతా...." అంటాడు. తర్వాత దరువు.

"నా ప్రాణ సఖియగు సీతా
అయ్యో నా ప్రాణసఖి కానరావా
నా ప్రాణములెట్లా నిలచూ
నేనెట్లా ఇకా తాళూదూ
నా ప్రాణాసఖియగు సీతా

ఆ....ఆ...." అంటూ విలపిస్తూ నృత్యం చేస్తాడు. విలపిస్తూ నృత్యం చేయించడం జానపద లక్షణం. అతి సామాన్యులు తమ దుఃఖ సమయంలో నిలకడలేక, బాధకు తట్టుకోలేక అటూ యిటూ తిరుగుతూ, శోకాలు తీస్తూ కన్పించడం ఉంది. ఇక్కడ బొమ్మలాటలో ముఖ్యంగా నిలబడి విలపిస్తూ పాట పాడినా ప్రేక్షకులలో చలనం ఉండదేమో? పాట భావమంతా తొందరగా అర్థం కావడం, దానికీ వారి స్పందన వెంటనే అందరిలో ఉండక పోవచ్చు. కానీ విలపిస్తూ నృత్యం చేయడం వల్ల విలపించేటప్పుడు, తల పట్టుకోవడం, చేతుల అభినయం, నడకలోని మాంద్యం ఇవన్నీ దుఃఖాన్ని సూచించడం వల్ల పాత్ర తత్కాలావస్థ స్పష్టంగా తెలియడానికి అవకాశం ఉంది. తర్వాత విల పిస్తూ పయనం సాగించడం జటాయువు కన్పించడం సీత వృత్తాంతం చెప్పడం చూపారు. "ఆ దుష్టాత్ముడను" "రావణ బ్రహ్మ నావైదేహి ఆ సీతా దేవిని కొనిపోవుచుండగా వానితో నేను యుద్ధము చేయగా నా పక్షములనే రెక్కలను నరికి ఇక్కడ పారవైచెను" అని వాపోతూ జటాయువు తన నిజ వృత్తాంతము తెలుపుతాడు 'నా వైదేహి ఆ సీతా దేవి' 'పక్షములనే రెక్కలు' అనే వివరణాత్మక పర్యాయ పదాలు తోలుబొమ్మలాటలోని వివర ణాత్మక కథా కథనంలోని భాగాలు. తర్వాత జటాయువును వదలి కిష్కిందవైపు రామలక్ష్మణులు పయనం, ప్రస్తావనతో ఈ దృశ్యాన్ని తొల గించారు. వాద్యాలు రెండో కాలంలో ప్రయోగాలు. తర్వాత సుగ్రీవుడి కొలువు. సుగ్రీవుడి ముఖ్య అనుచర గణం వానరులున్నారు. డెబ్బై రెండు వేలమంది

సుగ్రీవుడి వానర సైన్యమని తన సైన్యాన్ని సంబోధిస్తాడు. సుగ్రీవుడు వస్తున్న రామలక్ష్మణులను చూసి తన అన్న వాలి పంపగా వస్తున్న తన శత్రువులను కొని మరలా హనుమంతుని వృత్తాంతంగైకొని రమ్మని పంపుతాడు.

హనుమంతుడు ''ఏమయ్యా! వాలి పంపున వస్తున్నారా?" అని అడుగుతాడు. సంబోధన ''ఏమయ్యా'' అని చేయడం ముందు జరగబోయే స్నేహాన్ని దృష్టిలో పెట్టుకొని పల్కిన పలుకులవలె కన్పిస్తున్నాయి. శత్రువులైనచోట 'ఓరేయ్, అరేయ్, ఓరి, ఎవఁడ్రా' మొదలగు ప్రయోగాలున్నాయి. హనుమంతునికి సుగ్రీవుడు చెప్పిన విషయం ''ఏమయ్యా వాలి పంపున వస్తున్నారా!'' అని అడగమనడం, హనుమంతుడు అడగడంలో మరికొంత సౌమ్యం. "వందనములు, వందనములు" అంటూ "మీరెవరు! మీ పాదారవిందములకు నా నమస్కారములు" అనడం రామునికి ముందు ముందు భక్తుడుగా హనుమంతుడు మారడాన్ని సూచిస్తుందనుకోవచ్చు. హనుమంతుడికి రామలక్ష్మణులు విషయం చెబుతారు. హనుమంతుడు తాను సుగ్రీవుని మంత్రి నని వాలివల్ల భయపడి అచ్చట ఉంటున్నామనీ చెప్పి వారిని కిష్కింధకు ఆహ్వానించాడు కథ వచనంలో సాగింది. చక్కని సరళ వాక్యాలతో సాగింది. రాముని విషయం విని సుగ్రీవుడు తనకు లభించిన తర్వాత గిరికందరంలో దాచిన సీత నగల మూటను తెప్పిస్తాడు. రామునికి సాదరంగా నమస్కరిస్తాడు వాలిని సంహరిస్తానని రాముడు చెబుతాడు. వాలిని సంహరిస్తే సీతను వెతికించ గలనని హామీ ఇస్తాడు. వాలిని యుద్ధానికి ఆహ్వానిస్తాడు సుగ్రీవుడు. వాలి సుగ్రీవుల యుద్ధం తెర అంతటా భీకరంగా పోరాడుతున్నట్లు చూపెట్టారు. యుద్ధ ఘట్టంలో వాద్యాలన్నీ వేగంగా మ్రోగాయి. వాలి సుగ్రీవులకు ఒకే రకమైన బొమ్మలు, యుద్ధం ఆకర్షణీయంగా వుంది. ఇద్దరిలో వాలి ఎవరన్నది, రాముని సందేహం. లక్ష్మణుడు అతడే వాలి అని ఒకమారు, కాదు ఇతడే వాలి అని మరొకమారు అనుమానాన్ని వ్యక్తం చేశాడు

"వాడే వాలి! కాదు కాదు! వీడే వాలి" అని ప్రేక్షకులనుండి కూడా కేకలు. ఈ సందర్భంలో ప్రేక్షకులు ఎంతగా కథలో తన్మయత్వం పొందారో వివరిస్తుంది ఘట్టం. రాముడు వాలిని బాణంతో కొడతాడు. అపుడు వాలి "అయ్యా రామచంద్రా! ఎంత ద్రోహం కావించితివయ్యా! అయినా బల

మైన మృగములను ఎక్కడైనా రాజులు ప్రపంచములో వధించుతున్నారుగానీ కోతిని చంపే రాజును ఇక్కడే చూస్తున్నాను శ్రీరామచంద్రా" అని ఎద్దేవా చేస్తూ మాట్లాడాడు. మూలకథలోగాని, తదనంతరం వచ్చిన అనువాదాల్లోగానీ రాముడు బాణంతో కొట్టినపుడు వాలి మాటలు వేరుగా ఉన్నాయి. "ఎదురుగా వచ్చి చంపకూడదా' అనీ శత్రుత్వం లేకుండానే చంపబూనావనీ, నావంటి బల శాలిని ఆశ్రయిస్తే నీకు కావలసినది తెచ్చి పెట్టేవాణ్ణిగాదా అనీ వాలి అడిగి నట్లు కన్పిస్తుంది. ఇక్కడ ఈ ప్రయోగం ఎట్లా ప్రవేశించినప్పటికీ రాముడు వాలి మధ్యలో బలాబలాల ప్రసక్తి కన్పించదు. "మృగాలను చంపడం రాజ ధర్మం. కోతిని చంపడం కాదు", అనడంలో కోతి అల్పప్రాణిగాను, రాముని శౌర్య పరాక్రమాలు ఎదురులేనివిగాను భావించడానికి వీలు కలుగుతుంది. రాముని ముందు వాలి బలాన్ని ప్రస్తావించకపోవడమే కన్పిస్తుంది. ఈ వాలి ప్రశ్న నిరక్షరాస్యులైన అతి సామాన్య ప్రేక్షకులకు చాలా సులభంగా అర్థం కావడానికి తోడ్పడుతుంది. రాముని సమాధానం సంతృప్తికరంగా ఉంది."రాజు దుర్మార్గులను అణచాలి. నీవు దుర్మార్గుడవు గాబట్టి నిన్ను అణచాను."

ఈ సంవాదాన్ని కూడా తెరపై వాలి పడిపోయి ఉండడం, రాముడు వాలిని సమీపించడం, ఆ తర్వాత సంవాదం - ఇదంతా కథ వివరణకు తోడ్ప డింది. వాలి శరీరంలో గుచ్చుకున్న శరాలను తీస్తాడు రాముడు. వాలి మరణి స్తాడు. తర్వాత దుఃఖంతో వాలి భార్య తార ప్రవేశం. విలపిస్తూ నృత్యం చేస్తుంది. తార స్త్రీ పాత్ర కావడంతో విలపించేటప్పుడు అతి బేలతనాన్ని అభినయంలో చూపించారు. ముక్కు చీదడం, తల పట్టుకోవడం, చేతితో తల-గుండె బాదుకోవడం, కూర్చోవడం, లేవడం మొదలయిన దుఃఖాభినయాలు ఎక్కువ మోతాదులో ప్రవేశపెట్టారు.

"నా ప్రాణ నాయకా
నా జీవితేశా....ఆ....
మాటాడు....నాతో నీవు
ఆజిలో చెదరి
అయ్యో! మనోహరా!
జీవితేశ్వరా
నాకింత మాటాడు నాథా!" అంటూ పాటను ప్రవేశపెట్టారు. కుమారుడు

అంగదుని కలచి దుఃఖిస్తూ తారను—

"కంచే నిజముగ చేను మేసినా
కలదే కావన్నట్లు" అని వాలి ఓదార్చాడు.

వాలి ఆధిక్యతను కాకుండా రాముని ఆధిక్యతను వివరించే విధంగా ఉన్నాయి వాలి మాటలు. పైగా అందరిని రక్షించవలసినవాడు రాముడని, రాముని ఔన్నత్యాన్ని సూచించాడు. జరిగిన సంఘటనపట్ల జాలికలిగే విధంగా మలిచారీ ఘట్టాన్ని. తర్వాత సుగ్రీవుడు "స్వామీ ఈ వాన్ల కాలము నా చేతగా నేరదు వేసవి కాలము వచ్చిన వెంటనే మీ వదిన సీతామహాదేవి క్షేమము గై కొని వచ్చేవాడను నేను'' అని అంటాడు. ''వాన్లకాలము'' అనే వ్యవహారిక ప్రయోగం ప్రేక్షకులలో ప్రదర్శన యెడల అనుబంధాన్ని సాధించిందనే చెప్పాలి. ఇంతవరకు జరిగిన కథసంతటిని ఒకసారి మరలా గుర్తు చేశారు ప్రదర్శకులు. "ఈ విధమున శ్రీరామచంద్రుడు ఆ సీతామహాదేవిని దురదృష్ట ముగ వనవాసమున పోనార్చుకొని'' (వంత ..ఆఁ....)

''అలహాకముగా వాలినివధ గావించి, ఆ తర్వాత సుగ్రీవునికి పట్టాభి షిక్తుని గావించిన వాడాయెను'' అంటూ జరిగిన కథ నంతటిని మూడు మాటల్లో వివరించాడు. తర్వాత కేతిగాని హాస్య ప్రసంగాన్ని ప్రవేశపెట్టారు. తోలు బొమ్మలాటల్లో కథ సంతటినీ, అతివేగంగాను ఎడతెరిపి లేకుండానే ప్రదర్శించారు. ప్రేక్షకుల్లో ఆసక్తి అంతకంతకు పెరిగే విధంగాను, కథ ఎంతటి రసవత్తరంగా లేనిదైననూ ప్రేక్షకులలో ఆసక్తి తగ్గకుండా ఉండేటట్లుగానూ మధ్య మధ్య హాస్య ప్రసంగాలు చొప్పిస్తారు. ఈ హాస్య ప్రసంగాలలో జరిగిన కథలోని మెరుపు ఘట్టాలను చురకల రూపంలో వాడుకుంటూ జరగబోయే కథలో ముఖ్య ఘట్టాలను సూచనాప్రాయంగా తడుముతూ హాస్య ప్రసంగాన్ని గావిస్తారు. కథ ఏకబిగిన నడిపితే ఖచ్చితంగా ప్రేక్షకులకు బోరు కొడుతుంది. దాన్ని పరిహరించడం, ప్రేక్షకులకు కొంత రిలీఫు కల్గించడం హాస్య ప్రసంగో ద్దేశ్యం. అయితే ఇదంతా జరిగిన కథను క్లుప్తంగా వివరించడంలో, ఒకమారు ప్రదర్శన తిలకించిన ప్రతి ఒక్కరికీ తర్వాత హాస్య ప్రసంగం రాబోతుందని సూక్ష్మంగా బోధపడుతుంది. ఈ మధ్యలో వీలైతే ఒక ఐదు నిమిషాలు విరామం కూడా ఉంది. జుట్టుపోలుగాడు బంగారక్కలను ప్రవేశపెట్టారు. పోలిగాని ప్రసంగం ఏదో పోలికను దృష్టిలో పెట్టుకొని మాట్లాడినట్లుంది.

"వీర బలిదేవుని గన్నట్లు
బంగారక్క (వంత) : ఆహఁ....
గంగ బాగీరథుని కాల్చినట్లు
గుమత (?) పోయిన వేళ
వడదెబ్బ తిన్నట్లు
సుగ్రీవ విభీషణులు
శ్రీరాముని కన్నట్లు
తప్పిపోయిన బిడ్డ
తల్లిని గన్నట్లు
కాంచిన తమ్ముగా
నన్ను రక్షించమంటి"

అని ఎడతెరిపి లేకుండా సామ్యతలను జోడించి చివరలో తమకు నిలువ నీడ కల్గించిన వారిని ప్రశంసించాడు. ఈ ప్రసంగం కథకు అనుసంధానం చేస్తూ కథా ఘట్టాలను పేర్కొన్నాడు. ప్రేక్షకులలో కూర్చున్న ప్రదర్శకుల బంధువులెవరో "ఓర్నియక్క! ఎవుళ్ళిచ్చింది చెప్పవేరా.... అఁ" అని కేక వేశాడు. ప్రదర్శనలో పోలిగాని ప్రసంగం ప్రతిసారి రామప్ప ప్రదర్శించాడు. రామప్ప తప్పతాగి ఉన్నాడు. వివరణలో అతిగా పోతున్నాడు తప్ప ఏది వదిలిపెట్టలేదు కొంచెం మాట తడబడుతుంది కానీ కథా ప్రదర్శనంలో గాని, హాస్య ప్రసంగంలోగానీ క్రమ బద్ధంగానే తీసుకువచ్చాడు. ఆ కేక వినపడ గానే చందా యిచ్చిన వారి పేరు చదివాడు. తర్వాత "కథ కానియ్యండోయ్" అంటూ ప్రేక్షకుల నుండి కేక విన్పించింది. హాస్య ప్రసంగాన్ని తొలగించారు. ఐదు నిమషాలు విరామం తీసుకున్నారు. వాద్యాలను శ్రుతి పెట్టి, తర్వాత హనుమంతుని ప్రవేశ పెట్టారు.

"జయ జయ శ్రీరామా
రఘువరా
శుభకర శ్రీరామా" అనే పాటను పాడారు. హనుమంతుడు రాముని స్మరించే ఈ పాట బాగా ప్రసిద్ధి పొందిందే. పాట పాడుతూ భక్తి పరవ శత్వంలో నృత్యం చేసినట్లు హనుమంతుని బొమ్మను చూపెట్టారు. ఆ బొమ్మ

వాలకమే హనుమంతుడు రాముని వద్దకు పోతున్నట్లు తెలుస్తుంది. వాద్యాలు రెండో కాలంలో ప్రవేశపెట్టి, తర్వాత మరొక పద్యాన్ని సగం వల్లించారు.

"శ్రీ రఘు రామచంద్రా
మమ్ముల బిడ్డల జేయు మహా ప్రభో
నీ తారకనామ మంత్రము
తాపస వృద్ధులకే నలభ్యము రామా''

అంటూ రాముని గొప్పతనాన్ని తెలిపే పద్యం పాడుతూ రాముని సమీపిస్తాడు. హనుమంతుడు ఈ పద్యం భక్తి పారవశ్యంతో తెరపై ఒకవైపు నుండి పాడుతూ పోతూ ఉంటాడు. పద్యం ముగియగానే శ్రీరాముని బొమ్మను తెరమీదకు తెస్తారు. హనుమంతుడు రాముణ్ణి సంబోధించేటప్పుడు కూడా సంస్కృత సమాసాలతో మిశితమైన భాషనే వాడాడు. 'ప్రచండ రాజ్య మండలీ ఘటితోద్దండ మండిత విజయ అఖిల దయారామా! త్వన్నామమ్మునకు బోలె వీణా మంగళితకరుండై నీ చరణదాసుండనై నమస్కరించుచున్నాను" అన్న మాటలలో "నమస్కరించడం" సులభంగా బోధపడడానికి ఆస్కారం వుంది. అంతేకాదు. "నమస్కరిస్తున్నాను" అనే మాటతోపాటు భావయుక్తంగా బొమ్మ అభినయం చేయడం జరిగింది. కాబట్టి సామాన్యులకు అర్థం కానట్టి సంస్కృత సమాసాలైనా, హనుమంతుని బొమ్మ చూపించే భావాభినయం, ఆయన భక్తిని వెల్లడి చేసింది. ఇక ప్రదర్శకులను పరిశీలిస్తే వారికి సాహిత్య ప్రవేశం లేకపోయినా వంశ పారంపర్యంగా ఆ వృత్తిలో జీవిస్తూ ఉండడంవల్ల వారి పెద్దలవల్లనూ, నిత్య మననంవల్లనూ వారికి ఈ సాహిత్యంలో స్పష్టమైన ఉచ్చారణ సులభమైందని ఊహించవచ్చు.

"వాయు సుతా రమ్మా ....... .
ఈ అంగుళీయకము గొమ్ము
లంకకు వేగ పొమ్ము
సీతకు నా యొక్క
సేమముల్ సెప్పి
ఆమె క్షేమము సెప్పి
నా చేత ముదయనిమ్ము" అంటూ హనుమంతుని రాముడు పిలిచిన

కార్యం చెబుతాడు సుగ్రీవుడు హనుమంతుని లంకకు పంపే విషయం, చర్చా గోష్ఠులు, జాంబవంతుడు హనుమంతుడు చాలా బలవంతుడనీ, అతని బలం అతనికి తెలియదనీ, అతనే సాగర లంఘనం చేయగల సమర్థుడనీ తెలిపే విధానం మొదలయిన మూలకథలోని భాగాలన్నీ ఇచ్చట ప్రవేశ పెట్టలేదు. ఈ వ్యాసకర్త గతంలో రెండుసార్లు గుంటూరు జిల్లాలోను, అనంతపురంలో ఒకమారు తోలు బొమ్మలాటను, దర్శించినపుడు సుగ్రీవుడి కొలువులో సాగర లంఘనం గురించిన గోష్ఠులు కూడా ప్రదర్శించారు. సమయం ఎక్కువగా జరిగినందువల్ల వీరు దాట వేశారేమో ననిపించింది. సరాసరి హనుమంతుని పిలిచి, సాగరం లంఘించి, లంకకు చనుమని చెప్పడమే కనిపిస్తుందిచట. అంతేకాదు. అంగుళీయంగానిపోతూ "సీతాదేవి శిరోరత్నం గొని రావలయునా స్వామీ" అని ప్రశ్నించడం, భావికథకు సంధానం చేకూర్చడమే. సముద్రలంఘనానికి, స్థూలకాయంతో ఎట్లాపోవాలని రాముని అడుగుతాడు హనుమంతుడు. రాముడు అందుకు తగిన విధంగా హనుమంతునికి సూక్ష్మావతార విధానాన్ని ప్రసాదిస్తాడు.

హనుమంతుడు సాగర లంఘనం చేస్తాడు. ఆ సమయంలో హనుమంతుడు బోర్లగిలపడి ఆకాశ మార్గాన పయనించే విధం చాలా ఆకర్షణీయంగా ఉంది. లంకకు చేరిన తర్వాత సూక్ష్మరూపం ధరిస్తాడు. ముఖద్వారం వద్ద లంకిణిని దాటవేసి లోపలకు వెళ్ళాలి హనుమంతుడు.

కథను నిలుపు చేసి లంకిణితో హాస్యాన్ని ప్రవేశ పెట్టారు. లంకిణి రూపం అందవికారంగాను, వికృతంగాను, చాలా ఎత్తు, లావుగాను ఉన్న విగ్రహం. దాదాపు ఆరు అడుగుల వికృతంగాఉన్న లంకిణి బొమ్మతో కేతిగాని హాస్య ప్రసంగాన్ని జోడించారు.

రావడం రావడమే వెనుకగావచ్చి లంకిణి తలపై కేతిగాడు కొట్టాడు. అంటే లంకిణి తలమీద కేతిగాని బొమ్మతో కొట్టాడు ప్రదర్శకుడు. భయంకరమైన వికృతరూపం గల లంకిణి రాక్షసి, ఆ రాక్షసియెడల చులకనభావం ప్రేక్షకులలో కలగడానికీ, తద్వారా ప్రేక్షకులలో ఆ పాత్రపై చిన్నచూపు ఏర్పడడానికీ, ఇది తోడ్పడుతుంది. వెంటనే లంకిణి ప్రసంగం "అరేయ్ ఎడ్రడానువ్వు?" ఈ మాటలువిన్న పోలుగాడు ముందుకువచ్చి వ్యంగ్యంగానూ,

శ్లేషార్థంతోనూ ప్రశ్నలు వేస్తాడు. అసభ్య శృంగార సంభాషణను లంకిణిపై ప్రయోగించాడు. ప్రేక్షకులలో నవ్వులు. తర్వాత లంకిణి ధ్యేయం ఏమిటో, దాని విదులేమిటో తెల్పింది. తర్వాత ప్రేక్షకులలో సాధారణ హాస్యాన్ని రేకెత్తించే విధంగా ఆటపాటలు ప్రవేశపెట్టి, చివరగా శృంగార పరమైన అసభ్యాన్ని ప్రవర్తింపజేశారు. ప్రేక్షకులలో గొల్లున పెద్ద నవ్వులు, ముసి ముసి నవ్వులు, గుసగుసలు లాంటివి బయలుదేరాయి. చివరలో బంగారక్కను ప్రవేశపెట్టడం ద్వారా కేతిగాడి హాస్యాన్ని మరొక మార్గానికి మార్చారు. తర్వాత కేతిగాడు బంగారక్క పాత్రలను తొలగించారు. తర్వాత లంకిణి హనుమంతుని యుద్ధాన్ని ప్రవేశపెట్టారు. లంకిణిని జయించి లంకలో ప్రవేశించి రాక్షస మూకలను ఓందరవందర చేశాడు. ఇంద్రజిత్తు హనుమంతుని బంధించి, రావణుని కొలువులో ప్రవేశపెట్టాడు. రావణుడు మరణశిక్ష విధించాలని చూశాడు. విభీషణుడు కలుగజేసుకొని కోతిని చంపడం పాపమని చెబుతాడు.

పైగా రావణునికి లక్షలమంది కొడుకులు, నూరు లక్షల మంది మునిమనుమలు ఉండి పేరు ప్రఖ్యాతులు గలవాడు గాబట్టి దూతను చంపరాదని హితవు చెబుతాడు. కావాలంటే కోతికి అవమానం చేసి పంపవచ్చును. కోతి వాలానికి లంకలోని, నాలుగు లక్షల వీధుల్లో ప్రజల బట్టలు తెచ్చి తోకకు చుట్టి, నూనె అద్ది, నిప్పు ముట్టించమని సూచించాడు. దానివల్ల కోతి తోక కాలి చస్తుంది. లేకపోతే రాముడిది గ్రహించి భయపడి పారిపోతాడని సలహా ఇచ్చాడు. రావణుడు ఆ శిక్షను ఖాయ పరుస్తాడు. "నా వాలాన్ని కాలిస్తే ఆ తోకతో నీ లంకాపురాన్ని కాలుస్తా"నంటాడు హనుమంతుడు. రావణునికి కోపం వస్తుంది. "ఏయ్! నా లంకాపురం నీ తోకతో కాలడానికీ గడ్డి కాగ కాలునా! దుట్టి కాగ కాలునా? కట్టెకాగ కాలునా! ఇనుము, ఇత్తడి, సీసము, తగరము, బంగారముతో తయారైన భవనాలను నీ ముఖం నీవేం చేయగలవు?" అని అచ్చమైన సామాన్య వ్యవహారంలోని బెదిరింపును విసురుతాడు. కథలోని పటుత్వమంతా భాషా శైలి మీదనే ఉంది. తోకకు నిప్పంటించమని భటులను ఆజ్ఞాపిస్తాడు రావణుడు.

"దూతను గలచుట భువిగలదే
దూతను గలచుట భువిగలదే
జగతిపై ఈ కరణి చేసిరే
ధరణిపై గలదే ఈ దారుణము" అంటూ ఆ దురాగతాన్ని నేపథ్యంలో ఆలపిస్తారు. హనుమంతుడు నిప్పంటుకున్న తన తోకతో లంకా పురంలోని భవనాలకు ముట్టించి, లంకను కాల్చి, సముద్రుని ద్వారా ఆర్పు కున్నాడు. తర్వాత కిష్కిందకు చేరాడు. చేరేటప్పుడు మరల పాట—

"ఓ రామ జయ రామ
ఓం కార రామ
ఓ రామ శ్రీరామ
ఓ పరంధామా'' అనే దానికి రెండో కాలంలో వాద్యాలు మ్రోగు తాయి. హనుమంతుడు కిష్కింద నుండి లంకకు బయలుదేరింది మొదలు సీత శిరోరత్నంతో తిరిగి వచ్చిన వరకు కూలంకషంగా వివరిస్తాడు. శిరో రత్నాన్ని చూసి రాముడు ఆనంద బాష్పాలు రాల్చాడు.

"రామలక్ష్మణ భరత శత్రుఘ్నులం నల్గురన్నదమ్ములం. ఇక నుండి నీవు ఐదవ వానివి. రామనామ మున్నంత కాలం చిరంజీవివై వర్ధిల్ల"మని దీవిం చాడు. పదునాల్గు సంవత్సరాలలో ఇంక రెండు నెలలు పూర్తయితే అయోధ్య వెళ్ళవచ్చు. కాబట్టి ఈ రెండు నెలల్లో సముద్రానికి వారధి గట్టించి, లంకను జయించి, సీతను చెర విడిపించి అయోధ్య చేరాలని సుగ్రీవునికి రాముడు చెప్పాడు. ఈమాటలు అయిపోగానే "మహాశయులారా, సుందరాకాండము అను లంకా దహనం అనే నాటకము సమాప్తమైనది. ఇందులో లోపములు, అప శబ్దములుండిన అలనాడు హాలాహలాన్ని ఈశ్వరుడు కంఠంలో ఎలాగున ఉంచు కున్నాడో ఈ నాటకములో సుశబ్దములుగాని, అపశబ్దములు గాని ఉండిన తమ కుమారులు తప్పులు చేసిన ఏలాగున మన్నింతురో, ఆలాగున మమ్ము మన్నించ ప్రార్థన" అని ప్రకటించాడు. ఇట్లా కథ అయిపోయింది. అది జానపద కళా రూపాలయిన కథా కథనాలలో ఉంది.

తప్పులుంటే మా తప్పులను మన్నించి, మా తప్పులన్ని ఒప్పులుగా భావించి, మీ పిల్లలు తప్పులు చేస్తే ఏవిధంగా మన్నిస్తారో అట్లా మన్నించమని

అడగడం, జానపద కళారూపాలైన బుర్రకథ, బైనీడికథ, జంగంకథ, మొదలైనవాటిలోగూడ కన్పిస్తుంది. ఇది కళాకారుల వినయాన్ని ప్రకటిస్తున్న విధానం. తర్వాత మంగళారతి ప్రకటించారు.

జై ఇందిరా రమణ గోవిందా!

గోవిందా! అంటూ 'గోవిందలు' కొట్టి మంగళారతి దరువు మొదలు పెట్టారు.

''పవమాన సుతుడు బట్టు
పాదారవిందములకు
నిత్యజయామంగళం'' అంటూ పాడి, త్వరితగతిలో -

"ఓ రామా రామా
కాపాడవయ్యా
ఓ రామకృష్ణా
కాపాడవయ్యా
ఆ సీతాతోటి
కాపాడవయ్యా
ఓ రామా రామా
కాపాడవయ్యా" రెండో కాలంలో వాద్యాలు మ్రోగించి, ఆవేగంతో పాడారు. తర్వాత ''తదిగిణతై తదిగిణతై" అని చరణంతో ముక్తాయించారు.

''గోవిందా, గోవిందా''
''అంజనేయ వరద గోవిందా'' అని
''జై నమః పార్వతీ పతే
హరహర మహాదేవ శంభో........'' అని నిలుపుచేశారు.

కథ అల్లికలో మొదట "నారాయణ నారాయణ" అంటూ విష్ణు స్తోత్రంతో మొదలుపెట్టి "హర హర మహాదేవ శంభో" అని శివ స్తోత్రంతో ముగించారు. కథా ఘట్టం వైష్ణవ మతానికి చెందినది. ప్రదర్శకులు పరిశుద్ధ శైవులు. ప్రదర్శన మొదటి నుండి చివరి వరకు ఎక్కువగా వచన రూపంలోనూ, సంభాషణ ద్వారానూ, సంవాద విధానంలోనూ జరిగింది. వాక్యాలుగానీ, పదాలుగానీ,

పదబంధాలుగానీ, స్వచ్ఛమైన అతి సామాన్యమైన వ్యావహారిక భాషలో నిర్మి తాలయ్యాయి. సరళమైన శైలిలో ఉన్న ఈ సాహిత్యంలో లోకోక్తులు, సామె తలు, పొడుపులు, నీతి కథలు మొదలైనవన్నీ చోటు చేసుకున్నాయి. పాత్రల విషయంలో ఉదారమయిన పాత్రల సంభాషణలు ఔన్నత్యాన్ని నిలబెట్టే విధంగా ఉన్నాయి. హాస్యం కథలో మధ్య మధ్య విరామాన్ని సృష్టించడానికి, ధారావాహిక శ్రవణం వల్ల బోరు కలగకుండా రిలీఫ్ ఇవ్వడానికి ప్రవేశ పెట్టారు. వాద్యాలు, హాస్య పాత్రలు, కల్పిత ప్రసంగాలు, అన్నీ కథకు ఇబ్బంది లేకుండా ప్రదర్శనం ఫలవంతం కావడానికి దోహదపడినాయి. హార్మోనియం, తాళాలు, తొక్కుడు బల్ల, మద్దెల, తప్పెట, మొ॥ వాద్యాలు ఉన్నాయి. వీటికి తోడు ప్రధాన కథకులు, తొక్కుడు బల్లను ఆక్రమించిన వారు కాలికి గజ్జెలు కట్టుకున్నారు. ఈ వాద్యాలు సన్నివేశానికనుగుణంగా వాడారు. యుద్ధ ఘట్టాలలో సంభాషణల్లో తొక్కుడు బల్లను, యుద్ధం చేసేటప్పుడు దానితోపాటు తప్పెట, మద్దెల, మూడో కాలంలో వాయించారు. దీనివల్ల జరుగ బోయే కథకు, ఆ ఘట్టానికి మంచి వారధిలాగుంది వాద్యాల ఘోష. యుద్ధంలో బలమైన పక్షం ఏదో ఇట్టే గుర్తు పట్టే విధంగా ఉంది వాద్యాల మ్రోత. శోక ఘట్టాల్లో హార్మోనియం, తాళాలు వాయిస్తూ "ఆఁ....." అంటూ తీసిన రాగాలు శోక తీవ్రతను తెలిపాయి సన్నివేశానికి, సన్నివేశానికి మధ్యలో వాద్యా లన్నింటిని, రెండో కాలంలో వాయించడం, ఏదో ఒక చరణంతో ముక్తాయిం చడంవల్ల ఒక్కొక్క సన్నివేశం క్షుణ్ణంగా అర్థం కావడానికీ, కథలో ఆ సన్ని వేశాలకున్న ప్రాముఖ్యతను గుర్తించడానికీ, వీలుగలిగే విధంగా ఉంది. కథతో ఏ మాత్రం పరిచయంలేని వారికి గూడా ఈ విధానం వల్ల ఒక్కొక్క సన్నివేశమే ఒక కథవలె కన్పించడానికి అవకాశం వుంది. నాటకంలో అంకా లుగా విడగొట్టే విధానానికి దగ్గరగా కన్పించినా ఎత్తుగడలోను, కథా కథనం లోను, ఉనికిలోను, ముక్తాయింపులోను తోలుబొమ్మలాటలో ఒక సన్నివేశానికి మరొక సన్నివేశానికి తేడా వుంది. నాటకంలో సన్నివేశం ముగింపు స్పష్టంగా తెలిసినా అది అయిపోయిన తర్వాతనే తెలుస్తుంది కానీ యిందులో వాద్యాలు రెండో కాలంలో ప్రయోగించి ముక్తాయించడం వల్ల సులభంగా సన్నివేశ ముగింపు గుర్తించడానికి వీలవుతుంది. కథ అల్లికలో సన్నివేశాలు ప్రధాన భూమికను ఆక్రమిస్తే, సన్నివేశాల కల్పనలో సంవాదం, సంభాషణలు, పాటలు, పద్యాలు మొదలయినవి వాద్యాల మిశ్రమాన్ని బొమ్మల అభినయానికి

జోడించి, ఈ అభినయాన్ని స్వభావానుగుణంగా తెల్పడానికి, వాద్యాలు ప్రధాన భూమికను స్వీకరించా యనవచ్చును.

ఇక ప్రదర్శకుల పక్షాన కథ అల్లిక చక్కగా ఉందని భావించినా, నిర్ణేతలు ప్రేక్షకులు కాబట్టి ప్రేక్షకులను దృష్టిలో పెట్టుకొని ప్రదర్శకులు కథ బిగింపుకు అవసరమైన అన్ని మసాలాలు జోడిస్తారు. ముఖ్యంగా హాస్య పాత్రలు ప్రవేశపెట్టి లోక వ్యవహారాలన్నీ అచ్చట చర్చించి ప్రేక్షకుల దృష్టిలో కథలో సందర్భానుసారంగా హాస్యాన్ని కథపై ప్రేక్షకులలో అభిరుచిని రేకెత్తించారు. నాటకాలలో అంకాలవలె ఈ హాస్య ప్రసంగాల పర్యంతం జరిగిన ఆటను అంకాలుగా ఊహించవచ్చు. హాస్య పాత్ర ఉదాత్త పాత్రలను దుఃఖంలో ఓదార్చుతూ, అల్ప పాత్రలను అపహాస్యం చేస్తూ, అవలక్షణాలున్న లోక వ్యవహర్తలను అపనిందలకు గురిచేస్తూ వాటి పాత్రను అవి నిర్వహించాయి. ప్రధాన గాయకుడు, కథకు మూల పురుషుడు. అతను చెప్పేటప్పుడు అతని ప్రసంగానికి ఎవ్వరూ అడ్డురారు. అతని మాటలు తరువాత వంతలు రిపీట్ చేస్తారు. ఈ వంతలలో భేదాలున్నాయి. ప్రధాన వంత ప్రధాన కథకుడి మాటకు ఎదురు ప్రశ్న వేయడం, సమాధానం రాగానే "ఆ........ఆ........" అంటూ రాగం తీయడం తెర మీద బొమ్మకు ఉదాత్తతను చేకూర్చాయి. తక్కిన వారంతా మామూలుగా "ఆ.........ఆ..........." అంటూ పాడారు. విపులాతి విపులమైన సంభాషణలు సరళ మార్గంలో ప్రవేశపెట్టారు.

వాద్యాలు, వంతలు, ఎట్లా కథా ఘట్టాలను ఒకదాన్ని మరొకదాన్ని కలిపాయో బొమ్మలు కూడా అతి ముఖ్యమైన పాత్రను స్వీకరించాయి.

బొమ్మలు కూడా కథాకథన ఘట్టాలను సన్నివేశాలతో కలుపుతూ, హావభావాలతో స్వభావాన్ని వెలిబుచ్చుతూ కథాక్రమ సంబంధాలను నిలిపాయి. సూక్తులు, సామెతలు సంబంధాన్ని కలిపాయి. కథను ఒక్కచోట నుండే తీసుకోలేదు వీరు. నీతులు, నీతి పద్యాలు, శ్లోకాలు కావలసివచ్చినపుడు, సుమతి, వేమన, భర్తృహరి సుభాషితాల నుండి తీసుకున్నారు. కథలోని ఘట్టాలలో కూడా కొన్ని తేలికైన పద్యాలను రంగనాథ రామాయణం నుండి కొన్నింటిని మోక్షగుండ రామాయణం నుండి తీసుకొని, కొన్నిచోట్ల వచనంతో

నడుపుకుపోయారు. అతి క్లిష్టమయిన ప్రార్థన, శ్లోకాలు, పద్యాలు, స్తోత్ర శ్లోకాలు, దండకాల లాంటివి కూడా ముందు చదివి ప్రతి పదానికి అర్థాన్ని వివరిస్తూ ఆ ప్రార్థనల్లో కథ సన్నివేశాల్లోని పాత్రలకు సంబంధాన్ని కూర్చి కథను నడిపించారు. కథా ప్రదర్శనలో మొదటి నుండి చివరివరకు కన్పించిన ప్రతి మాట, ప్రతి కదలిక, కథను జయప్రదం చేసుకోవడానికి వాడుకున్న కథా నిర్మాణాంగాలుగానే కన్పిస్తున్నాయి.

## 5. 3. సన్నివేశాల కల్పనం

ఆట మొదలు పెట్టినపుడు సన్నివేశాలుగా ఏమీ కనపడదు. ముందుగా ప్రార్థన ఉంటుంది కాబట్టి నాటక నాందీ కేతిగాడు, బంగారక్క ల ప్రసంగంలో వస్తాయి. వీరిప్రసంగంలో శృంగార సంభాషణలు, పౌరుల ప్రశంసలు కథా ప్రస్తావనం ఉంటాయి. తర్వాత బంగారక్క నిష్క్రమణం, అల్లాటప్పప్రవేశం వారి హాస్య ప్రసంగం ఉంటుంది. ఇవన్నీ ఈ నాటకంలో కూడా ఇట్లేఉన్నాయి. తర్వాత కేతిగాడు గణపతి వస్తున్నట్లుచెప్పి నిష్క్రమించాడు. గణపతి ప్రార్థన తర్వాత "గణపతి ప్రార్థన చేశాము. ఇప్పుడు బ్రహ్మరాణి సరస్వతి పార్థన ఎట్లుందయ్యా అంటే"అని సూత్రధారుడు సరస్వతి బొమ్మను ప్రవేశపెట్టాడు. కేతిగాడు, బంగారక్క లు నాటకానికి నాంది చేశారు. ఒక రకంగా ఇది సన్నివేశంగా తీసుకోవచ్చు. తర్వాత సరస్వతి తనవృత్తాంతం చెప్పి అచ్చట జరుగుతున్న నాటకాన్ని, ముఖ్యంగా సుందరకాండను దీవించిపోదామని వచ్చాననీ, బ్రహ్మలోకానికి వెళ్ళుతున్నానని చెబుతుంది. ఇచ్చట మరొక పాత్ర ఏమీ లేదు. ఇచ్చట ప్రార్థన, దీవన, ప్రస్తావన కన్పిస్తాయి. మరొక పాత్ర లేకపోయినా ప్రస్తావన కోసం కల్పించిన సన్నివేశంగా దీన్ని భావించవచ్చు సరస్వతి ప్రార్థనానంతరం రెండు ముఖ్యమైన సన్నివేశాలు నడిచాయి. ఇతర బృందాలు రెండు సన్నివేశాల తర్వాత ఒక అరగంట విరామం తీసుకుంటారు. ఈ విరామంలో ముఖ్య ప్రదర్శకుడు తెరముందుకు వచ్చి, గత దినం ప్రదర్శన సమయంలో అటువంటి విరామంలో అన్నదానం కోసం అర్థించినపుడు అన్నదానం అందించిన అన్నదాతలను ప్రశంసిస్తాడు. అంటే ప్రదర్శన రోజు తీసుకున్న ఆతిథ్యానికి దాతలను ప్రశంసిస్తాడు. అదే సమయంలో మరుసటిరోజున ప్రదర్శకులకు అన్నదానం చేయమని, అన్నదాతలకోసం అర్థిస్తాడు. ఒక్కొక్కమనిషికి ఒకరు చొప్పున గ్రామంలోని ప్రజలు భోజన నదుపాయాలను కల్పించడానికి

తమ తమ పేర్లు చెబుతారు. రేవటిరోజున అన్నదాతలు ఫలానావారని ప్రదర్శ కుడు చెప్పి తెరలోపలకు వెళ్ళి మరలా ఆట మొదలు పెడతాడు. అయితే నిమ్మలకుంటలోని ప్రస్తుత ప్రదర్శన ముందుగా డబ్బు ఒప్పుకొని నిర్ణయించు కున్న ప్రదర్శన కాబట్టి వీరి విరామమంతా ఊరకే ఉన్నారు. ఒకరకంగా చూస్తే ఈ విరామం, ఇందులో అన్నదాతల అభ్యర్థన కూడా ప్రత్యేక సన్నివేశం లాగానే కన్పిస్తుంది. ప్రస్తుత ప్రదర్శనలో విరామం విరామంగానే ఉంది. ఒక ముఖ్య ఘట్టంతో ఆట ముగుస్తుంది. చివరలో మంగళహారతి పాడుతారు. మంగళ హారతి పాడేటప్పుడు చాలా తొందరగానూ, ఏ బొమ్మ తెరమీద లేకుండాను పాడుతారు. కొందరేమో చివరి ఘట్టానికి సంబంధించిన బొమ్మలను అట్లేఉంచి పాడుతారు. ప్రతి సన్నివేశానికి చివరన మరొక సన్నివేశానికి మొదట అంటే ప్రతి రెండు సన్నివేశాల మధ్యన హాస్య ప్రసంగం ఉంటుంది. కేతిగాడు, బంగా రక్క, అల్లాటప్పలను హాస్యంలో ప్రవేశ పెడతారు అట్లాగే పెట్టారు.

ఒక్కోమారు సన్నివేశాల మధ్యలో కూడా డంబాలు పలికే పాత్రల వద్ద, పొగరుతో వ్యవహరించే పాత్రలవద్ద, దుష్టపాత్రలవద్ద, ఆయా పాత్రలను అవహాస్యం చేయించడానికి ప్రవేశ పెడతారు. వెనుకగా వచ్చి ఆయా పాత్ర లను కొట్టడం - పారిపోవడం, ఆ పాత్రలకు ముందుగా వచ్చి అడ్డునిలవడం మొదలైన కార్యక్రమాలు చేయిస్తారు. వీరం, భయానకం, బీభత్సవం, కరుణ రసాలతో కూడిన సన్నివేశాలలో ప్రేక్షకులు వెంటనే తేరుకోవడానికి సన్ని వేశం చివరన కేతిగాని హాస్య ప్రసంగం పెట్టిస్తారు. ఈ హాస్య ప్రసంగాల వలన ప్రేక్షకులు వెంటనే మామూలు స్థితికి వచ్చి మరొక సన్నివేశాన్ని చూడ డానికి సంసిద్ధులౌతారు. శృంగార, భక్తి రసాలలో కేతిగాని వ్యంగ్య హాస్య ప్రసంగాలు పెట్టిస్తారు. అందువల్ల ప్రదర్శన చివరివరకు ప్రేక్షకులు విసుగు చెందకుండా ఉల్లాసంగా ప్రదర్శనను తిలకిస్తారు.

ఈ హాస్య, వ్యంగ్య ప్రసంగాలలో దాదాపు సమకాలీన సామాజిక పరి స్థితులు, చెడు ప్రవర్తకుల విషయాలు, అందరూ ఏవగించుకొనే అధునాతన ఫ్యాషన్లు, దేశసమస్యలు ప్రస్తావనకు వస్తాయి.

సూత్రధారుడు, ప్రార్థన, మంగళ హారతి కాక మొత్తం ఒకనాటి కథను 6 సన్నితేశాలుగా విడగొడతారు. మొదటి మూడు సన్నివేశాలు జరిగిన తర్వాత

విరామం ప్రకటిస్తారు. ఇందులో కూడా భోజనాలకు అభ్యర్థన, ముందు రోజు ఆతిథ్యమిచ్చిన వారి పేర్లను, అప్పటి వరకు భోజనాదులు సమకూర్చిన వారిని ప్రశంసిస్తారు. అన్ని బృందాలలోను ఈ విరామ సమయంలో తెరముందు కేవలం భోజన సదుపాయానికి అభ్యర్థనకే కేటాయిస్తున్నారు. ఆతర్వాత చివరి మూడు సన్నివేశాలు ప్రదర్శిస్తారు.

అక్కడక్కడ ఉపఘట్టాలు, ఉప సన్నివేశాలు కథలో వస్తాయి. అయితే ఇవన్నీ కలసి ఒక్కటే ముఖ్య ఘట్టం అవుతాయి. భారతంలో ఇట్లాంటి ఘట్టాలు పది. రామాయణంలో పది ముఖ్య ఘట్టాలుగా ఉండవచ్చు. ఒక్కొక్క సన్నివేశంలో మూడు కథకు సంబంధించిన పద్యాలు, రెండు నీతి శ్లోకాలు, రెండు నీతి పద్యాలు చెబుతారు. అవి మరలా వంత పాడుతారు పద్యం చెప్పిన తర్వాత టీకా తాత్పర్యం చెబుతారు. ఈ టీకా తాత్పర్యాలకు వంత ఉండదు. ఇవి చెప్పినంత సేపు 'ఊ' కొడతారు. ఒక పాత్ర మరొక పాత్రకు మాత్రమే చెబుతున్నట్లుంది ఈ టీకా తాత్పర్య వివరణ. దాదాపుగా పురుషుడు పాడిన పద్యం లేదా శ్లోకం తిరిగి అందరిచేతా పాడబడుతుంది. ఇందువల్ల సన్నివేశానికి తగిన అర్థం ప్రేక్షకులకు పూర్తిగా బోధపడుతుంది. ప్రతి ఉప సన్నివేశానికి ఒక పద్యం, ఒక నీతిశ్లోకం, ఒక నీతిపద్యం తప్పనిసరిగా ఉంటాయి. ప్రతి ఉప సన్నివేశంలోనూ రసం లేకపోయినా సన్నివేశం చివరకు మాత్రం రసం తప్పని సరిగా ఉంటుంది. రస పరాకాష్ఠ ఉంటుంది. ప్రతి సన్నివేశంలోను, ఆ సన్నివేశంలోని ముఖ్యులైన ఒకరిమీదనే కథ ఎక్కువగా నడుస్తుంది. చిన్నపాత్రలు, అముఖ్య పాత్రలు ముఖ్య స్థానాన్ని ఆక్రమించలేవు. అందువల్ల కథ సూటిగానూ, స్పష్టంగానూ తెలుస్తుంది. అయితే ఉప సన్నివేశాలన్నీ కూడా ప్రశ్నార్థకంగా ముగుస్తాయి. అందువల్ల సన్నివేశాల చివరన దాని ముగింపు ఉంటుంది. ఇది చాలా అనుభవ పూర్వకమైన క్రియగానూ, ఒక సందేశం లేదా ఒక నీతిని బోధించేదిగానూ ఉంటుంది.

ఇటువంటి సన్నివేశ కల్పనం నిమ్మలకుంట తోలు బొమ్మలాట ప్రదర్శకులు చక్కగా చేశారు. గణపతి ప్రార్థనకు పూనుకున్నారు. గణపతి ప్రార్థనలో గణపతిని గురించి, నాటకానికి ప్రారంభంలో విఘ్నాలు తొలగించే వాడుగా భావించి ప్రార్థిస్తున్నట్లు నాటకంలో అది మొట్టమొదటి సన్నివేశంగా

ఉండాలన్నట్లు చేశారు సంభాషణ విఘ్నేశ్వరుని ప్రార్థన తప్పనిసరి సన్ని వేశంగా కన్పించింది. విఘ్నేశ్వరుని ప్రార్థన తర్వాత సరస్వతి ప్రార్థన కల్పించారు. సరస్వతిని బొమ్మలాటలో నాటక నాంది తెచ్చే పాత్రగా ప్రవేశ పెట్టడం అసలు ఉద్దేశ్యం. ఆ పాత్రచేత చెప్పించడం మాత్రం తాను బ్రహ్మ లోకంపోతూ దారిలో ఈ నాటకం గురించి తెలుసుకొని దీవించి పోదామని వచ్చానని. తాను సుందర కాండ అనే ఈ నాటకాన్ని, ప్రదర్శకులను దీవించి పోవడానికి వచ్చినట్లు తెల్పింది. ప్రదర్శకులు ఆమెను దీవెనకోసం ప్రవేశ పెట్టినట్లు ప్రస్తావించినా ఆ పాత్ర ఉద్దేశ్యం మాత్రం నాటకానికి నాందీ పలకడం ముఖ్యం. ఇక ప్రేక్షకుల దృష్టిలో ఆ పాత్ర ప్రవేశం - కేవలం ప్రార్థన కోసం ప్రదర్శకులు ప్రవేశ పెట్టారని. ఇట్లా ఒక్క సరస్వతి పాత్రను ప్రవేశ పెట్టి, ఆ పాత్రద్వారా చేయించిన పని చిన్నదేనైనా మూడు ప్రయోజనాలు పరోక్షంగా కన్పించాయి. ఈ సన్నివేశం లేకుండా ఆట క్రమం దెబ్బతినేటంత తరుగు కన్పిస్తుందిక్కడ. మొత్తం మీద ఒకేపాత్రను ప్రవేశ పెట్టి, తప్పనిసరి సన్ని వేశంగా సృష్టించి, నాందీ, దీవెన, ప్రార్థన అనే అంశాలు ప్రవేశ పెట్టారు.

సరస్వతి ప్రార్థన దీవెన కాగానే బంగారక్కను, ఆతర్వాత పోలుగాణ్ణి ప్రవేశ పెట్టారు. ఇదికూడా సన్నివేశంగానే మలచారు. ఇక్కడ బంగారక్క, పోలుగాడు అనే పాత్రలు కథలో నాటకానికి సంబంధించినవికావు. కథకూ ఈ పాత్రలకూ ఎలాంటి సంబంధం లేదు. కానీ కథలో ఈ పాత్రలు ఎప్పుడైనా వచ్చేట్లు, ఎప్పుడైనా పోయేట్లు మలిచారు. ఈ రెండు పాత్రలు వీరి జీవనానికి ఉపయోగపడేట్లు మలిచారు. వారి కోర్కెలు, వారి ప్రశంసలు, అసంతృప్తి, నిష్ఠూరాలు. సాధక బాధకాలు ఈ పాత్రల సంభాషణలద్వారా వెల్లడి చేశారు. ప్రదర్శకులకు గతంలో జరిగిన మేలు, కీళ్ళు, వారి జీవన పరిస్థితులను ప్రేక్ష కులుగా చేరిన ప్రజలకు చేరవేసేవిగా ఈ పాత్రలను వాడుకున్నారు. దీన్ని విపులంగా పరిశీలిస్తే ప్రదర్శకులు వారి అభిప్రాయాన్ని కూడా ప్రజలకు సరా సరి చెప్పలేని మూగవేదన పరిస్థితిలో గడుపుతున్నారని భావించవచ్చు. వారి పరిస్థితులను సరాసరి ప్రజలకు తెల్పడానికి మార్గం లేదు. ప్రజలకు ఒక్కొ క్కరి దగ్గరకు వెళ్ళి వారి దుస్థితి చెప్పినా ఆలకించి ఆదరించే వారుండరు. మరి ఎక్కువమంది చేరిన ఒక గుంపు వద్దకు వెళ్ళి తెల్పినా పట్టించుకోరు. కాబట్టి నాటకాన్ని తిలకించడానికి ప్రదర్శకులుగా వచ్చిన ప్రజాసమూహానికి

వారి ఆవేదనను, వారి దుస్థితిని బంగారక్క, పోలుగాడు పాత్రల ముఖంగా సంభాషణల ద్వారా తెలుపుతారు. తర్వాత ప్రేక్షకుల ఉదార బుద్ధిని ప్రశం సిస్తారు. దీని ద్వారా ఏదో లబ్ధి పొందవచ్చునని ఆశిస్తారు.

వారి జీవన పరిస్థితులు ఏ గ్రామంలోనైనా ఒకే రకంగా చెప్పుకుంటారు. "బీద కళాకారుణ్ణనీ, పొట్టచేత బట్టుకు వచ్చామనీ, ఈ యాచకుణ్ణి ఆదరించ మనీ, కథ చాలా ఉందనీ" మొదలు పెడతాడు. ఈ సన్నివేశాన్ని పూర్తిగా వారే వాడుకున్నా కథా ప్రస్తావన ఈ పాత్రలే తెస్తాయి. దేశంలోని మంచి చెడులూ, కథలు ఎన్ని రోజులు ప్రదర్శించబోతుందీ, ఒక్కొక్క కథా ఘట్టంలో ముఖ్య సారాంశాన్ని ఈ పాత్రల ద్వారా చెప్పిస్తాడు. ఈ కల్పిత పాత్రలతో సన్నివేశాన్ని సృష్టించుకున్నా ఈ కల్పిత పాత్రలు బొమ్మలాటలో ముఖ్యమైన ప్రఖ్యాతిని పొందాయి. బొమ్మలాట అనగానే ముందు గుర్తు వచ్చేది కేతిగాడు, బంగారక్క పాత్రలు. ఈ పాత్రలకు రామాయణం, భారతం, భాగవతం అనే తారతమ్యం లేదు. నాయకుడు, ప్రతినాయకుడు, నాయిక, దుష్ట పాత్ర లనే బేదాలసలే లేవు. వ్యంగ్యం, హాస్యం, అపహాస్యం ఈ పాత్రలకు ముఖ్య మైనా ఉదాత్త, ఔదార్య, ఆదర్శాలను ప్రకటించవలసినపుడు ఆయా విషయా లకు భంగం వాటిల్లని పద్ధతిలో ఉంటుంది సంభాషణ. ప్రేక్షకులనుండి డబ్బు రాబట్టడం, ప్రేక్షకులకు వారి సాధక బాధకాలు తెల్పుకోవడం, కథా ప్రస్తా వన తేవడం, కథ సారాంశాన్ని చెప్పడం, ప్రదర్శకుల పూర్తి అభిప్రాయాన్ని ప్రేక్షకులకు తెల్పడం మొదలైన అనేక ప్రయోజనాలు ఈ పాత్రల ద్వారా ముఖ్యంగా మొట్టమొదట ప్రవేశపెడుతున్న సన్నివేశం ద్వారా నెరవేరు తున్నాయి. బొమ్మలాట పూర్తి స్వరూపాన్ని, ప్రదర్శకుల స్థితిగతులను, గ్రామ ప్రజల ఔదార్యాల ఉన్నతిని, తద్వారా ఆ గ్రామం గొప్పతనాన్ని ఈ చిన్న సన్నివేశం ద్వారా తెలుసుకోవచ్చును.

బంగారక్క కేతిగాడు పాత్రలు సరాసరి ఫలానా పాత్రలు వస్తున్నాయి. అని చెప్పడమే కాకుండా అతి సామాన్య ప్రజలకు అర్థమయ్యే రీతిలో "కథకు పొద్దుపోతుంది, మళ్లా వద్దాం పా, మామా!" అంటూ రెండు పాత్రలు నిష్క్రి మిస్తాయి. ఆటలో విఘ్నేశ్వర, సరస్వతి, కేతిగాళ్ళ సన్నివేశాలు తప్పనిసరి. అది ఏ కథ అయినా కావచ్చు, లేదా ఏ ప్రదేశమైనా కావచ్చు. నాటక ప్రదర్శన జరిగితే తప్పనిసరిగా ఇవన్నీ ఉంటాయి.

"రామాయణంలో ఎన్నో కాంతలున్నాయి. అందులో సుందర కాండము మొదలవుతుంది" అని బంగారక్క అంటుంది. వెంటనే కేతిగాడు "ఆఁ. మొదట రామలక్ష్మణులు వస్తున్నారు" అనిపించి, తద్వారా సన్నివేశాన్ని కూడా ఈ పాత్రల ద్వారానే సూచించడం జరిగింది. ఈ సూచనతోపాటు సీతారామలక్ష్మణుల వనవాసం, మాయలేడి, సీతాపహరణం, వాలి సుగ్రీవుల యుద్ధం, సుగ్రీవ పట్టాభిషేకం, సముద్ర లంఘనం, హనుమంతుడు లంక చేరడం, సీత క్షేమాన్ని తెలుసుకోవడం, లంకా దహనం, హనుమంతుడు సీత శిరోమణిని రామునికివ్వడం అనే అంశాలు ఈ తెరపైన జరుగుతాయి. కానీ "(ఆఁ....) ఎందరో మహానుభావులు అందరికీ మా అభివందనాలు!"అని కథలో ముఖ్యమైన సన్నివేశాలను సూచించడం జరిగింది. ఈ సన్నివేశాల ప్రస్తావన కథా సమయాన్ని, పూర్తి కథా వివరాన్ని ఇచ్చింది. కథను ప్రస్తావించి, కథ లోని సన్నివేశాలను తెలిపి, తెరపైకి రాబోతున్న పాత్రలను ప్రస్తావన చేసి, చివరగా ప్రేక్షకులకు నమస్కారం పెట్టి ఈ పాత్రలు తెర నుండి వైదొలగినాయి.

సీతారామలక్ష్మణుల పాత్రలు నృత్యం చేస్తూ తెరపైకి వచ్చాయి. తర్వాత బంగారు లేడి వచ్చింది. సీతారామ లక్ష్మణులు రావడం, లేడి రావడం, రాముడు దానివెంట పడడం, లేడి చావడం, చస్తూ అరవడం, లక్ష్మణుడు రాముని వెదకుతూ వెళ్ళడం, రావణుడు మాయజంగం వేషంలో రావడం, సీతను అపహరించడం మొదలైనవన్నీ కలిపి ఒక ఉపఘట్టంగా తీసుకోవచ్చు. ఇందులో కొన్ని ఉపసన్నివేశాలుగా స్వీకరించవచ్చు. ఈ అన్ని ఉప సన్ని వేశాలను కలిపి ఒక సన్నివేశంగానూ తీసుకోవచ్చు. అయితే ఉప ఘట్టం అనడంకంటే సన్నివేశమనడమే!బాగుంటుందేమో.అయితే పైనతెల్పిన అన్ని ఉప సన్నివేశాలలోనూ సన్నివేశ లక్షణాలు కన్పించకపోవచ్చు. ఒక ఉప సన్ని వేశంలో అదనపు లక్షణాలు కన్పించవచ్చు. ఒకటి రెండు పద్యాలు తప్ప, సీతాపహరణం వరకూ ఎలాంటి నీతి పద్యాలుగానీ, శ్లోకాలుగానీ లేవు. సీతా పహరణం వరకూ అంతా సంభాషణంలోనే జరిగింది. సీతారావణుల సంవాదం, అందునా రావణుని పదితలలతో ప్రవేశపెట్టే సన్నివేశం చాలా ఆకర్షణీయంగా ఉంది. పది తలలతో భయంకరమైన ఆ ఆకారం చూడడానికి భయం కొల్పు తుంది. ఆ పరిస్థితుల కనుగుణంగా డప్పు, తొక్కుడుబల్ల మొ॥ వాద్య పరికరా

లతో ఉధృతమైన వాద్య నాదాన్ని ప్రేరేపించారు. దశకంఠ రావణుని ఆకారానికి తగినట్లు "హాఁ హాఁ" అనే శబ్దాలు చేస్తాడు. దశకంఠరావణుని ప్రవేశం రావణ పాత్ర చేయబోయే అకృత్యాన్ని సూచించేదిగా ఉంది. అంతేకాదు, సీతకు జరగబోయే ప్రమాదాన్ని పసిగట్టించేదిగా గోచరించింది.

సీతను ఎత్తుకొనిపోతున్న రావణుని జటాయువు ఎదిరించింది. రావణ జటాయువుల సంవాదం, తర్వాత యుద్ధం. ఇది పూర్తిగా సన్నివేశంగా స్వీకరించవచ్చు. కానీ ఇందులో సంవాదం, యుద్ధం, జటాయువు ఓటమి మాత్రమే ఉన్నాయి. అంతకుమించి ఏమీ లేవు. యుద్ధంలో మాత్రం ప్రేక్షకులనుండి ఈలలు, చప్పట్లు విన్పించాయి. ఆ తర్వాత రామలక్ష్మణులు రావడం, జటాయువును కలవడం, సీతజాడ తెలుసుకోవడం, జటాయువు మరణం, రామలక్ష్మణులు కిష్కింధ వైపు సాగడం - ఈ సన్నివేశం క్లుప్తంగా వచనం ద్వారానే ముగించారు. సీతజాడ తెలియడం ఈ సన్నివేశంలోని ప్రయోజనం. యుద్ధానికిచ్చిన ప్రాధాన్యత ఈ సంభాషణకు లేదు. యుద్ధ సన్నివేశంలో వాద్యాల మ్రోతతోనూ, బొమ్మల ప్రదర్శనతోను సన్నివేశాన్ని ఉత్కంఠ కల్గించేదిగా తీర్చిదిద్దారు. తర్వాత రామలక్ష్మణులు కిష్కింధ వైపు సాగిపోతుండగా సుగ్రీవుని పనుపున హనుమంతుడు రామలక్ష్మణులను దర్శిస్తాడు. ఈ ఉప సన్నివేశంలో సంభాషణ క్లుప్తంగా జరిగింది. దీని ప్రయోజనం సుగ్రీవునితో స్నేహాన్ని చేయబోయే భవిష్యత్ ఒడంబడికకు బీజాలు వేయడం. వాలి వల్ల సుగ్రీవునికి భయమున్నట్లు, "వాలి పనుపున వస్తున్న వీరులా" అనే అనుమానాన్ని హనుమంతుడు రామలక్ష్మణుల సమక్షంలో వ్యక్తం చేశాడు. వాలికి సుగ్రీవుడు భయపడుతున్నాడనే భావన హనుమంతుని సంభాషణ వల్ల ప్రేక్షకులకు బోధపడింది. ఈ చిన్ని ఉప సన్నివేశంలో కథకు మంచి ప్రయోజనాన్ని చొప్పించారు

సుగ్రీవుని వద్దకు రామలక్ష్మణులను హనుమంతుడు తీసుకురావడం మరొక సన్నివేశం. ఈ సన్నివేశంలో స్నేహం బలపడినట్లు, వాలిని చంపడానికి, సుగ్రీవునికి పట్టాభిషేకం చేయడానికి రాముడు అభయం ఇచ్చాడు. ఇచటి సంధి సీతను వెదకడానికి రామునికి ఒక రాజు సహాయం లభించడం అనేది కన్పిస్తుంది. ఇది కథకు ప్రయోజనమే. కాని ప్రదర్శనకు వస్తే సంభా

షణలు క్లుప్తంగా నడిపి తెరమీద ఏది చూడడానికి ప్రేక్షకులకు ఇంపుగా ఉంటుందో పరిశీలించి ఆయా సన్నివేశాలను మాత్రమే సుదీర్ఘంగా నడిపారు. ముఖ్యంగా యుద్ధ ఘట్టాలు. వీరి స్నేహ ఒడంబడికలన్నీ రెండు మాటలతో సంభాషణ జరిపారు. తర్వాత వాలి సుగ్రీవుల యుద్ధ సన్నివేశాన్ని ప్రవేశపెట్టారు. జటాయువు, రావణ యుద్ధం పది నిముషాలకు పైగా చూపించారు. వాలి సుగ్రీవుల యుద్ధం ఇరవై నిముషాలకుపైగా చూపించారు. యుద్ధం మధ్యలో సంభాషణలు ఎక్కువగా ఉండవు. కానీ బొమ్మలు యుద్ధం చేసే ఘట్టంలో తెరపై ఉత్కంఠను కలిగించాయి. మధ్యలో వాలి సుగ్రీవులలో వాలిని గుర్తు పట్టడానికి రామలక్ష్మణులు "వాలి వాడా వీడా" అనుకుంటూ సంభాషించడం మినహా ఎలాంటి సంభాషణలు లేవు. చివరకు వాలిని రాముడు బాణంతో చంపడం. వాలి రాముణ్ణి నిందించడం సంభాషణగానే ఉంది. రామాయణంలో వాలి రామునితో "నీవు నాతో చెలిమిచేస్తే రావణుని బంధించి నీ పాదాలముందు పడేసేవాణ్ణిగదా! రావణుని ఎన్నోమార్లు ఓడించినవాణ్ణి. అటువంటి బలవంతుడిని నాతో స్నేహం చేయక బలహీనుడితో స్నేహం చేశావు కదా!" అని అడుగుతాడు.

కానీ ఇక్కడ తన బలాన్ని చాటడం లేదు. "రాజైనవాడు క్రూరమృగాలను వేటాడుతాడు కానీ కోతిని చంపే రాజును నేను ఎక్కడా చూడలేదని" రాముని నిందించాడు. ఈ వాలి సుగ్రీవ యుద్ధం సుందరకాండలో ముఖ్యమైనదిగా చెప్పవచ్చు. తోలుబొమ్మలాటలో వాలి రాముణ్ణి అడిగిన విధానం రాముడు తప్పుచేశాడు అనే భ్రమ ప్రేక్షకులలో కలిగేవిధంగా ఉంది. ఈ సన్నివేశంలో ప్రదర్శనకు యుద్ధం, వాలి - రాముని సంభాషణ, తార విలాపం కథలో ప్రయోజనాన్ని తెచ్చిపెట్టాయనవచ్చు. ప్రేక్షకులలో ఇది ముఖ్యఘట్టం కాకపోయినా ఆపేక్షను నిలిపింది. ఒక నీతి సామెతను వాలితో చెప్పించారు. "కంచె నిజముగ చేనుమేసినా, కలదే కావన్నట్లు" రాముడు తనపై శత్రుత్వం వహించాడని తారను ఓదార్చుతాడు. రక్షకుడు భక్షకుడు కాకూడదనే ఈ సామెతను వ్యవసాయపరంగా చక్కటి విశ్లేషణాత్మక సూక్తి. ఈ సామెత లోక వ్యవహారంలో ఎక్కువగా కన్పించేదే, తర్వాత రాముడు సుగ్రీవునికి పట్టాభిషేకం చేసే ఘట్టం. ఈ సన్నివేశం క్లుప్తంగా ముగిసింది తర్వాత విరామం. సాధారణంగా విరామంలో ప్రదర్శకుల ఈతిబాధలు వ్యక్తం చేసు

కుంటారు. కానీ ఈ బృందం ఒక సహకార సంఘంగా ఏర్పడి ఇండ్లు కట్టించుకుని ఉంటున్నారు కాబట్టి, డబ్బు ఇచ్చి ఏర్పాటు చేసిన ప్రదర్శన కాబట్టి వారి సాధకబాధకాలేమి ప్రస్తావించలేదు. విరామం అందరికీ, అంటే ప్రేక్షకులకు, ప్రదర్శకులకు విరామంగానే కన్పించింది.

ఈ విరామం ఆట సగం అయిపోయిన వాతావరణాన్ని కలుగజేసింది. తర్వాత గంధోళిగాడు, బంగారక్కల ప్రవేశం. ఈ ప్రవేశం లోకంలో అదృష్టవంతులకు ప్రత్యక్షమైన అదృష్ట దీపికలవలె ప్రదర్శకులకు కలిగిన అదృష్టంగా చెప్పుకున్నారు. ఇందులో ప్రస్తుత కథలోని "సుగ్రీవ విభీషణులు రాముని గన్నట్లు" అని కథకుకూడా ముడి పెట్టారు. వారు గతంలో ఎన్నో ఇక్కట్లు పడేవారనీ, పరపతి సంఘంగా ఏర్పడి, తద్వారా ప్రభుత్వ సహాయం పొంది ఇండ్లు వేసుకోవడం వల్ల వారికి కష్టాలు తప్పిపోయాయనీ, దానికి ఎక్కువగా సహకరించి చేసిన వారు పూర్వీకులైన ఖదేరావు అనే బృందం నాయకుడనీ వారి పూర్వీకులను స్మరణ చేసుకున్నారు. నిజానికి ఈ సన్ని వేశాన్ని కల్పించుకొని గంధోళి, బంగారక్కల సంభాషణలద్వారా వారిసంఘం గురించీ వారి క్షేమాన్ని గురించీ తెల్పుకున్నారు. వారి ప్రశంస ఎక్కువ కావడంతో ప్రేక్షకులలో ఎవరో ఒకరు"త్వరగా కథ కానీయ్" అంటూ కేక పెట్టారు. ప్రదర్శకుల బృందానికి సంబంధించినవారు, తెరకు వెలువల ఉన్న ఒకరు ఐదు రూపాయలు "ఖదేరావు" పేరు మీదుగా చందాగా చదివించారు. మరలా ప్రశంస చేశాడు. ప్రశంసా కార్యక్రమం ఎప్పుడు వచ్చినా రామప్ప మాత్రమే చేశాడు. ప్రేక్షకుల నుండి "పొద్దుపోతుంది, కథకానియ్" అని కేక. వెంటనే సన్నివేశాన్ని మార్చివేశాడు. ఇది కల్పిత సన్నివేశం కాబట్టి, ఎక్కువ వ్యవధి ఇవ్వక వెంటనే మార్చివేశాడు.

హనుమంతుడు పరవశత్వంతో రాముని కీర్తనలు పాడుతూ ప్రవేశం. తెరపై రామలక్ష్మణులుంటారు. ఇదొక సన్నివేశం. ఈ సన్నివేశంలో రాముని భక్తుడుగాను, పరవశత్వంతో భజన చేసుకుంటూ హనుమంతుడు కనిపిస్తూ రాముని చేరుతాడు. పిలిపించిన కారణం అడుగుతాడు. రాముడు 'సీతను వెదకి రమ్ము, ఈ అంగుళీయం గొనుము' అని అంటాడు. సరాసరి హనుమంతుని లంకకు పంపినట్లు అతి క్లుప్తంగా నడిచింది సంభాషణం. కానీ ఈ సన్నివేశంలో

మరొక జట్టు సుదీర్ఘ సంభాషణ చేయడం రచయిత చూశాడు. సుగ్రీవుడు తన సైన్యాన్ని నలుదిక్కులకు పంపడం, అంతా వట్టి చేతులతో తిరిగి రావడం, సముద్రాన్ని లంఘించి లంకకు చేరాలనడం, సాగర లంఘనం నాచేతగాదంటే -నా చేతగాదనడం,జాంబవంతుడు హనుమంతుని బలాన్ని గూర్చి చెప్పి, హనుమంతుడొక్కడే సాగర లంఘనం చేయగలడని చెప్పడం. అపుడు హనుమంతుడు రాముని దర్శించి అంగుళీయం తీసుకొని లంకకు బయలుదేరడం అంతా సుదీర్ఘ చర్చగా ప్రవేశ పెట్టారు. నిమ్మలకుంట వారు సమయం తక్కువైనందువల్ల కథను క్లుప్తంగా సంభాషణలలో దొర్లించినారు. ఈ సన్నివేశంలో రాముని నుండి అంగుళీయం గొని బయలు దేరుతాడు. తర్వాత లంకలో ప్రవేశం.

లంకిణి ద్వారంలో లంకిణివద్దకుచేరి హనుమంతుడు తనరూపాన్ని సూక్ష్మ రూపంగా మార్చుకుని లంకిణి ఎదుటపడతాడు. లంకిణితో సంవాదం. హనుమంతుడు లంకిణితో సంవాదం చేసే సన్నివేశంలో ప్రదర్శకులు ఒక కల్పిత ఉప సన్నివేశాన్ని ప్రవేశ పెట్టారు. నిజానికి ఇది కథకు సంబంధించింది కాదు. బొమ్మలాట అస్తిత్వానికి మాత్రం ఇటువంటి కల్పిత ఉప సన్నివేశాలు ఆయువు పట్టులనక తప్పదు. గంధోళిగాడు, బంగారక్క పాత్రలను ప్రవేశ పెట్టారు బంగారక్క పాత్రను ఈ ఉప సన్నివేశాన్ని ముగింపు చేయించడానికి ప్రవేశ పెట్టారు. గంధోళిగాడు లంకిణితో వ్యంగ్య, హాస్య, శృంగార సంభాషణకు దిగుతాడు. లంకిణి కథలోని పాత్ర. గంధోళిగాడు ప్రదర్శకుల రిప్రజెంటేటివ్. కథలోని పాత్రతో ఒక హాస్య పాత్ర సంభాషణలకు దిగడం జానపద సంప్రదాయంలో ఉంది. వీధినాటకం, యక్షగానం, తూర్పుభాగవతం, చెంచునాటకం మొదలైన అన్నింటిలోనూ ఈ సంప్రదాయం కన్పిస్తుంది. ఐతే బొమ్మలాటలో మాత్రం ఈ పాత్రకు ఒక భార్యపాత్రను సృష్టించారు. అంతే గాదు. బొమ్మలాటలో ఈ పాత్రకు ఒక హద్దంటూ లేదు. ఏది మాట్లాడ కూడదనే నియమం దీనికి లేదు. విశృంఖల శృంగారాన్ని - గ్రామీణ పదాలతో చెప్పాలంటే పచ్చిశృంగారాన్ని ఈ పాత్ర మాట్లాడుతుంది. కథలోని పాత్రలతోనూ ప్రస్తావిస్తుంది. ఈ పాత్రకు ఒక పురుషాంగాన్ని జోడించి వెగటు, వ్యతిరేక సందర్భాలలో ఈ పురుషాంగాన్ని తెరమీద చూపించడం, దాన్ని ప్రస్తావించడం ఉంది. లంకిణితో హాస్య సంభాషణకు దిగిన కేతిగాడు అపహాస్య ధోరణితో పచ్చిసంభాషణకు దిగుతాడు.

లంకిణిది భయంకరమైన ఆకారం. వికృత స్వరూపం. మందబుద్ధి. హనుమంతునితో యుద్ధం చేయబోతోంది. పాత్ర మందబుద్ధిని ఆసరగా తీసుకొని కేతిగాని ద్వారా అవహాస్య ధోరణిని ప్రవేశపెట్టారు. లంకిణి ఎత్తును, లావును, జుట్టును ఎగతాళి చేస్తాడు. లంకిణి కేతిగానితో సంభాషణకు దిగుతుంది. వాడి ప్రశ్నలకు లంకిణి సమాధానం. లంకిణితో కూడా ఓ రేయ్ అని పిస్తారు చివరకు వీధుల్లో చిన్నపిల్లలాడుకునె దాగుడు మూతలాడుతాడు కేతిగాడు. కళ్ళు మూసుకోమంటాడు. లంకిణి కళ్ళు మూసుకున్న తర్వాత కేతిగాడు లంకిణి చళ్ళు పట్టుకుంటాడు. అది కళ్ళు తెరచి ఒక్కటేస్తుంది. ఇంతలో బంగారక్కవచ్చి "నన్నేడవలేదు కానీ, ఇంత పెద్దదాన్ని ఏడుస్తడు మొగోడు" అని కేతిగాన్ని మరొకటేస్తుంది. ఇదంతా కల్పిత హాస్య ప్రసంగం. కథలోని పాత్రలతో కథేతర పాత్రలు సంభాషించడం బొమ్మలాట సృష్టికే ఒక మూలాధారం. ఈ పాత్రలచే ప్రత్యేకంగా సన్నివేశాలు, ఉప సన్నివేశాలు కల్పించడమే కాక ఇట్లా కథలోని పాత్రలతో కలసి ఉప సన్నివేశాలను సృష్టించడం అపూర్వం. ప్రేక్షకులలో ఏర్పడిన అనాసక్తిని తొలగించడానికి, మామూలు సంభాషణలతో ఉత్సాహం లేని స్థితిలో ఉన్న ప్రేక్షకులను ఉత్కంఠోన్ముఖులనుగా చేయడానికి ఇది తోడ్పడుతుంది. మొత్తానికి ఈ ఉప సన్నివేశ కల్పనం ద్వారా ప్రేక్షకులలో ఆసక్తిని పెంచి, కథకు ఆకర్షణ కలుగజేసి పెద్ద ప్రయోజనాన్ని పొందారు ప్రదర్శకులు.

తర్వాత హనుమ లంకిణిల సంభాషణ, తర్వాత యుద్ధం మరొక సన్నివేశంగా మలచారు. లంకిణి హనుమల యుద్ధంలో హనుమంతుడు విచిత్ర రూపాలు ప్రవేశపెడతాడు. ఒకమారు చిన్న శరీరంతో, మరొకమారు పెద్ద శరీరంతో చిత్ర భంగిమల్లాగా లంకిణిని ముప్పతిప్పలు పెడతాడు యుద్ధంలో. హనుమంతుడు అతి పెద్ద శరీర రూపాన్ని ప్రవేశపెట్టగానే, లంకిణి అంతకు రెట్టింపు రూపాన్ని ప్రవేశపెట్టింది. హనుమంతుని మింగడానికి నోరు తెరిచింది. అపుడు హనుమంతుడు అతి చిన్న రూపానికి వచ్చి, నోటిలో ప్రవేశించి చెవి గుండా బయటకు వెళ్ళిపోతాడు. ఆ ద్వారం దాటుతాడు. అది ఒక యుద్ధ సన్నివేశం లాగా కంటే కూడా ప్రేక్షకులకు ఇంద్రజాలంలాగా కన్పించింది. ప్రేక్షకులు దాన్ని యుద్ధాన్ని చూసినట్లు కాక ఆనందంతో, ఉత్సాహంతో, ఒక ఇంద్రజాల ప్రదర్శనను చూసినట్లు ఉంది. ప్రదర్శకుల కళా నైపుణ్యంతో

లంకిణిని హనుమంతుడు ముప్పతిప్పలు పెట్టినట్లు అతి సామాన్యంగాను, అలవోకగాను జయించినట్లు చూపెట్టారు ప్రేక్షకులు రిలాక్సింగ్ మూడ్‌లో ఈ సన్నివేశాన్ని తిలకించారనవచ్చు. ఈ సన్నివేశంలోని లౌక్యం, లౌక్య సంభాషణలు, హృదయాలను ఆకర్షించగల చతురతలు ప్రేక్షకులను ఆకర్షించాయి.

తర్వాత మేఘనాథుడు గుర్రంపై వచ్చి హనుమంతుని బంధించే సన్నివేశం కూడా ముఖ్యమైనదే. హనుమంతుడు ప్రతిఘటించాడు. యుద్ధం లాగా కన్పించదు. మేఘనాథుడు హనుమంతుని సమీపించడం, బంధించడం అంతా ఒక చిన్న సన్నివేశంలో కూర్చారు. రెండే మాటలున్నాయిందులో.

రావణ సభలో హనుమంతునికి శిక్ష విధించేది మరొక సన్నివేశం. ఈ సన్నివేశంలో విభీషణుడు, రావణుడు, హనుమంతుడు ముగ్గురే ఉంటారు. సీతను సమీపించి, అంగుళీయమిచ్చి శిరోభరణాన్ని స్వీకరించేది మరో సన్నివేశం. అయితే ఇది క్లుప్తంగా వచన సంభాషణ ద్వారా నడిపారు. తర్వాత హనుమంతుణ్ణి బంధించడం, రావణ సభలో చర్చ. విభీషణునికి, రావణునికి వాగ్వివాదం జరుగుతుంది హనుమంతునికి శిక్ష విధించే నిర్ణాయక సభలో. రావణుడు మరణ శిక్ష విధించడాన్ని విభీషణుడు ప్రతిఘటించి అల్ప ప్రాణి మీద అంత శిక్ష అనవసరమనీ అందువల్ల పరాభవం చేసి వంపమనీ చెప్తాడు. ఈ సన్నివేశం రావణ విభీషణుల స్వభావాలను తెలిపేదిగాను, భవిష్యత్తులో విభీషణుడు రావణునితో విడిపోయి రాముని పక్షం చేరడానికి వారిద్దరికి మంచి చెడుల మధ్య వ్యత్యాసం ఉందని తెలిపే విధంగానూ ఉంది. చివరకు విభీషణుని సూచన మేరకు రావణుడు హనుమంతుని వాలానికి నిప్పంటించమన్నాడు. ఈ సన్నివేశంలో ప్రేక్షకులకు దొరికిన ఆయువు విభీషణుని సత్సం భాషణం,లంకాపట్టణంలోని మేడలు, వాటి విలువ, వాటికి వాడిన ఇనుము, ఇత్తడి, సీసం, తగరం మొదలైన లోహాలు, భోగభాగ్యాలు తెలుస్తున్నాయి. ఈ సన్నివేశం తర్వాత హనుమంతుని వీరవిహారం.

హనుమంతుడు నిప్పంటించబడిన వాలంతో లంకలో ఇండ్లనూ, సుందర భవనాలను తగులపెడతాడు. ఈ సన్నివేశంలో తెరపై ఏమీ

ఉండవు. హనుమంతుని తోక చివరన ఒక నిప్పు దివిటీతో కలిపి పట్టుకొని రెండో చేతిలో తెరలో ఆ వైపు నుండి ఈ వైపుకు, ఈ వైపు నుండి ఆ వైపుకు నాల్గుసార్లు తిప్పారు. ప్రేక్షకుల కది పెద్ద మంటగానూ, పొగలతో కూడిఉన్నదిగానూ, ఏవో తగలబడుతున్నట్లుగానూ కన్పించింది. ఈ చివరి సన్నివేశంతో పూర్తిగా దృశ్యమే. ప్రేక్షకులకు మాత్రం కనువిందొనర్చే దృశ్యంగా కన్పించింది. లంక తగలబడిపోయినట్లే ఉంది. ప్రదర్శనంలోని అతిముఖ్యమైనదీ, చివరిదీ అయిన ఈ సన్నివేశం ఇతర అన్ని సన్నివేశాలను అధిగమించింది. ప్రేక్షకుల నాకర్షించింది. తర్వాత హనుమంతుడు కిష్కింధకు చేరాడు.

చివరగా హనుమంతుడు రామలక్ష్మణులకు సీత వార్త చెప్పడం, సీత శిరోభూషణాన్ని అందజేయడం, దాన్ని చూసి రాముడు సీతను తలచుకొని దుఃఖించడం చూపించారు. ఈ సన్నివేశంలో ఉధృతంగానీ, ఉత్కంఠగానీ ఏమీలేకపోయినా ప్రేక్షకులు చూశారు. దీని తర్వాత మంగళహారతి పాడారు.

ఇట్లు సుందరకాండం అనే ప్రదర్శనాన్ని మొదలుపెట్టి, గణపతి ప్రార్థన, సరస్వతి దీవన - నాందీ, కేతిగాడు బంగారక్కల ప్రశంసలు, కథా ప్రస్తావన, సీతా రామ లక్ష్మణులు, మాయలేడి, రావణ ప్రత్యక్షం, రావణ జటాయువుల యుద్ధం, రామ హనుమల సంగమం, వాలి సుగ్రీవుల యుద్ధం, హనుమంతుని లంకకు పంపడం, లంకిణి - కేతిగాని హాస్యభాషణం, హనుమ లంకిణిల యుద్ధం, హనుమంతుని బంధించడం, రావణుని సభ, సీతను చూడడం, లంకాదహనం, సీత జాడ తెల్పడం అనే సన్నివేశాలను, కథను సంభాషణల ద్వారా ప్రదర్శించారు.

## 5.4. బొమ్మలను ప్రవేశపెట్టిన తీరు :

కథ ప్రదర్శనంలో బొమ్మలది ప్రధాన పాత్ర. కథకు అంటే ఆటకు ఆయా పాత్రలకు, తగిన ఆకారాలతో తయారుచేసిన తోలుబొమ్మలను తెరపై ప్రవేశపెట్టడంద్వారా ఆటను విజయవంతం చేస్తారు. ఒకే కథలోని ప్రతి పాత్రకు ఒక బొమ్మ ఉంటుంది. వేరు కథ ఆడించవలసి వచ్చినపుడు మరో కథలో వేరు పాత్రలకు వాడి, సామ్యమున్న బొమ్మలనుకూడా అవసరంకొద్దీ

వాడుకుంటారు. రామాయణంలోని లక్ష్మణుని పాత్రను, భారతంలోని అర్జును నికి, విభీషణుని పాత్రను కర్ణుడికి మొ॥ విధంగా ఉపయోగించుకుంటారు.

కొన్ని ప్రదర్శకుల జట్లకువలెనే ఈ నిమ్మలకుంట బొమ్మలాట వారి వద్ద కూడా తగినన్ని బొమ్మలున్నాయి. అన్ని పాత్రలకు బొమ్మలున్నాయి. మొట్టమొదట విఘ్నేశ్వర ప్రార్థనతో ఆట మొదలయింది. విఘ్నేశ్వరుని బొమ్మను ప్రవేశపెట్టారు. కొంచెంసేపు తెరకు కుచ్చి ఉంచి, ఈలోగా లోపల బొమ్మల పెట్టెనుండి తరువాతి కథకు అవసరమైన బొమ్మలను అందుబాటులో ఉండేవిధంగా ఒక క్రమంలో సర్ది పెట్టుకున్నారు. తర్వాత విఘ్నేశ్వరుని బొమ్మను ఆడించారు.

"గోవిందా! గోవిందా! గోవిందా గోవిందా.

పరమాత్మా కావారా నారాయణ" అంటూ మొదలుపెట్టి తాళాలతో లయను సరిదిద్దుకొన్నారు. తరువాత -

"తొండము నేక దంతమును
తోరపు బొజ్జయు వామ హస్తమును
మెండుగ గజ్జెలు మ్రోయగను
మెల్లని చూపుల మందహాసమున్"

అనే పద్యం పాడి, వినాయకుని రూపంలోని ప్రత్యంశాన్ని వివరించారు. తర్వాత వినాయకుడు నాటకానికి ప్రారంభకుడనీ, కాబట్టి ముందు ఆయన్ని కొలవాలనీ, ఆయన ప్రాధాన్యతను తెలుపుతూ, ఆ ప్రాధాన్యం అనే భావం ప్రవర్తనలో కన్పించే విధంగా బొమ్మను ఆడించారు. "ఈ యాట అంతటికీ ఈయనే పెద్ద కాబోలు" అనే గౌరవ భావం ప్రేక్షకులలో ఏర్పడేలాగుంది. ఆ విఘ్నేశ్వరుని ఆడించిన తీరు అంతా మగవారే వివరించారు. తర్వాత సరస్వతిని ప్రవేశపెట్టేరు. ఈ బొమ్మను తెరపై నిలబెట్టలేదు. సరాసరి ప్రదర్శనకే తెచ్చారు. రావడమే తెర మీదకు నృత్యంతో వస్తుంది. ఆమె చదువులకు తల్లి కాబట్టి, రెండో ప్రాధాన్యత ఈమెదే. విఘ్నేశ్వరుని పాత్ర పరిచయం నాటకారంభములో నాటకానికి సూత్రధారి అనే విధంగాను, హక్కుదారుడు అనే భావగర్భితంగాను, ప్రవేశపెట్టారు.

సరస్వతి విషయంలో ఇందుకు భిన్నంగా ఉంది. సరస్వతిని ప్రవేశ పెట్టేటప్పుడు తైత తర్ఝుణ తజ్ఝణతతా....అంటూ లయాత్మకంగా, లయ కను గుణమైన నృత్యంతో ప్రవేశ పెట్టారు. పాత్ర ప్రవేశించగానే ప్రదర్శకులంతా ఒక్కసారే "సోగతం సోగతం సోగతం సోగతం" అంటూ ఆహ్వాన పూర్వక స్వాగత వచనం 8 సార్లు పలికారు. అతి పెద్దవారు ఇండ్లకు వస్తే వినమ్రతా భావాన్ని వ్యక్తం చేస్తూ ఆహ్వానిస్తున్న పద్ధతిలో ఉంది వారి ఉచ్చారణ. దానికి అనుగుణమైన హుందాతనంతో తెరమీద ఒకవైపు నుండి మరో వైపు నడచి నట్లుంది సరస్వతి బొమ్మను ప్రవేశ పెట్టిన తీరు. తరువాత పాత్ర పరిచయం. ఆ పాత్ర ఎందుకొచ్చిందీ ప్రదర్శకులలో ఒకరు ప్రశ్నించడం— ఆమె తాను బ్రహ్మ దేవుని భార్య సరస్వతిననీ, బ్రహ్మ లోకానికి పోతూ పోతూ, ఈ నాట కాన్ని ఆశీర్వదించి పోదామని వచ్చాననీ తనని తాను పరిచయం చేసుకుంటుంది. సరస్వతి బదులు చెప్పే సంభాషణలో స్త్రీ పాల్గొంది. ఈ చెప్పేటప్పుడు ఆడించిన తీరు, సరస్వతి పెద్దరికాన్ని తెలిపే విధంగా ఉంది. ఆమెను ఆశీర్వ చనాలు యివ్వమని వేడుకుంటారు. సరస్వతి ప్రార్థన కాగానే కథా నాయ కుడు "ఈ నాటకానికి ప్రారంభకారుడైన జుట్టు పోలిగాణ్ణి, బంగారక్కను, పిలుస్తాము" అని పోలిగాడి అధికృతను వ్యక్తం చేసే విధంగాను, నాటకం మొత్తంమీద పోలిగానికుండే అధికారాన్ని తెలిపే విధంగాను భావయుక్తంగా పలికాడు.

"అయితే పోలిగాని భార్యను బంగారక్కను ప్రవేశ పెడదాము" అనే మాటను పలికి బంగారక్కను ప్రవేశ పెడతారు. "ఎట్లా వస్తున్నదయ్యా బంగా రక్క అంటే" అని బంగారక్క పాత్రపై ప్రేక్షకులలో ఉత్కంఠ కలిగే విధంగా సంభాషణలు ప్రవేశ పెట్టారు. ఆడ పాత్రల తరఫున ఆడవారే మాట్లాడారు. బంగారక్క పాత్రను ఆడవారే పలికారు. బంగారక్క పాత్ర ద్వారా ముందు హాస్యాన్ని ప్రవేశా పెట్టారు. ఈ హాస్యం గ్రామ వాతావరణానికి సరిపడేటట్లుగానూ, కొంచెం మొరటుగానూ ఉంది. ఆ హాస్య సన్నివేశంలో ఒళ్ళు జిల పుడుతుందని, తన చేతితో గోక్కునే విధానం, పాత్ర ప్రదర్శనలోని హావ భావాలు హాస్య జల్లుల్ని వెదజల్లాయి. తర్వాత తన భర్త పోలిగాణ్ణి పిలిచింది. వానికే మరొక పేరు గంధోళి గాడు. పిలక జుట్టూ, నల్లని ఆకారం, మొలకు మాత్రమే వస్త్రంతో, పంగనామాలు పెట్టి తెల్లని పళ్ళు ఇకిలిస్తూ

నవ్వు పుట్టించే ఆకారంలో గంధోళిగాడి ప్రవేశం. "ఓరి మొగోళ్ళూ...." అని బంగారక్క గంధోళి గాణ్ణి పిలిచే విధానం గ్రామాలలో అతి సామాన్య కుటుంబాలలో భర్తను బజారుకు వచ్చి పిలిచే పద్ధతి గుర్తు తెప్పేవిధంగా ఉంది.

అక్కడ బంగారక్క అభినయం కూడా పిలుపు భావాన్ని తెలుపుతున్నట్లుంది. గంధోళిరాగానే "దండాలండీ మొగుళ్ళకు" అని వినయం ప్రకటించే అభినయంతో పలికిస్తారు. గంధోళిగాడు నస్తూనే నడుం వంచి తలవంచి "భార్యగారికి వేయి దండాలు" అంటాడు. ఈ మాట అనేటప్పుడు ఆ పాత్ర ప్రవర్తన, గయ్యాళిపెళ్లానికి పెంకిమగని సమాధానం అనే భావాన్ని స్ఫురింపజేసింది. గంధోళిగాడు రాగానే గ్రామపెద్దల్ని ప్రశంసించడం మొదలుపెట్టారు. బంగారక్క పేర్లలను చెప్పడం, గంధోళిగాడు 'దండాలు' అనడం బాగుంది. సంభాషణలాగా సాగిన ప్రశంసా కార్యక్రమంలో ఆ రెండుపాత్రల అభినయం నిజంగా ప్రదర్శకులే ప్రశంసలు చేస్తున్నారు అనే భావాన్ని వ్యక్తం చేసింది. తర్వాత కథ ప్రారంభం. రామాయణంలోని సుందరకాండం ప్రస్తావన తెచ్చి తెరమరుగవుతారు. సీతా రామ లక్ష్మణుల పాత్రలను నృత్యం చేయిస్తూ ప్రవేశపెట్టారు. వనవాసంలో వారి నృత్య కార్యక్రమాల్ని తెలిపే పద్ధతిలో ఉంది.

వనవాసంలో వారి నృత్య కార్యక్రమాల్ని తెలిపే పద్ధతిలో ఉంది వారి నృత్యాభినయ ఘట్టం రామలక్ష్మణులు ఇష్టాగోష్ఠి మాట్లాడుకుంటూ కూడా నృత్యం చేయడం తోలుబొమ్మల ప్రత్యేకత. స్త్రీ పురుష పాత్రల భేదం లేకుండానూ, సుఖదుఃఖాది సమయాను వర్తనాలలో సైతం పాత్రలచే నృత్యం ప్రవేశపెట్టడం అనే విషయాన్ని ప్రత్యేకంగా గమనించవచ్చు. మాయలేడి బొమ్మను ప్రవేశపెట్టిన తీరు, దానిని చూసి సీత అభిలాష పడిన విధానం, బొమ్మల కదలికలను బట్టి లేడి పరుగెత్తుతున్నట్లు కన్పించడం, సీత దానివైపే చూస్తూ ఆ లేడిని కోరడం అభినయంలోనే భావాన్ని తెలిపే పరిపూర్ణ ప్రదర్శక నైపుణ్యాన్ని తెలుపుతుంది. ఆ లేడి కావాలనే కోరికను తెలిపే విధానం సాధారణ స్త్రీ తన భర్తను కోర్కెలు కోరేటప్పుడు ప్రవర్తించే విధంగా - అంటే అత్యంత సన్నిహితత్వాన్ని, ఆజ్ఞను జారీ చేసే పద్ధతిని కోరికలో మిళితం చేసి అడిగే విధానం అభినయంలో కనపడింది. అవి బొమ్మలైనప్పటికీ అభినయాన్ని ప్రదర్శించటంలో ఎంతో నేర్పరితనంతో ప్రదర్శింపజేసారు. లక్ష్మణుడు

రామునితో, లేడి మాయా మృగంవలె కన్పిస్తున్నదనీ దానికోసం తానే వెళ్ళెద ననీ పల్కినపుడు రాముడు ప్రతి సమాధానం చెప్పినప్పుడూ అభినయం సందర్భానుసారంగా ఉంది. లేడి పరుగును నిజంగా లేడి పరుగులా అన్నంత బాగా ప్రదర్శించారు.

"హా లక్ష్మణా, హా సీతా!" అని పలుకులు వినపడిన తర్వాత సీతా లక్ష్మణుల సంవాదం, దానికి బొమ్మల అభినయం సన్నివేశానికి తగినట్లుగాను, భావవ్యక్తీకరణ విధంగానూ ఉంది. సీత నింద తర్వాత, లక్ష్మణపాత్రను తెర నుండి తొలగించిన తర్వాత, రావణుడు జంగం వేషంలో ప్రత్యక్షమౌతాడు. ఈ బొమ్మ సాధుస్వభావయుక్తంగాను, ఆకర్షించే విధంగాను ఉంది. ఐతే ఆకర్షణలో సీత బొమ్మ సాధు బొమ్మను అధిగమించిందనే చెప్పాలి. యతుల వద్ద రాజాంతఃపుర స్త్రీల మర్యాదను తలపింపజేసే విధంగా సీత పాత్ర అభినయం ఉంది. తాను సీతను చెరపట్టవచ్చిన రావణుడననీ, నిజస్వరూపం ప్రవేశ పెట్టినపుడు సన్నివేశ పరాకాష్ఠకు చిహ్నంగా వాయిద్యాలన్నీ ఒకసారి మ్రోగించారు. ప్రదర్శకులు అందరూ అః హ్హాః హ్హాః అంటూ రావణుని దర్పాన్ని తెలిపే విధంగా నవ్వారు. ఇవన్నీ రావణుని పాత్ర ప్రవేశమ్మీద ప్రేక్షకులలో అపేక్షను, ఉత్కంఠను కలిగించాయి. పది తలల రావణుని బొమ్మ ముందు చేసిన నవ్వుడికి అనుగుణంగా, దర్పంగానూ, ఉగ్రరూపాకృతి లోను భీకరంగాను, ఎదుటివారిని అధిగమించేదిగానూ ఉంది. ప్రేక్షకులలో బొమ్మ చూడాలి అనే ఒక రకమైన ఆతృత కన్పించింది. సీత మూర్ఛిల్లిన విధం, రావణుడు సీతను మోసుకొనిపోతున్న దృశ్యం సహజంగా కన్పిం చాయి. జటాయువు ప్రవేశం, రావణ జటాయువు సంవాదం, భావయుక్త అభినయంతో జరిగాయి.

జటాయువు బొమ్మ చాలా పెద్దది. దాదాపు మనిషి ఆకృతికి సమాన మైన ఆకారంలో ఉండడం వల్ల రావణునితో యుద్ధం చేయిస్తున్నప్పుడు, ఇద్దరు సమానులైన మనుష్యులు యుద్ధం చేస్తున్న భావనే కల్గింది తప్ప ఏదో ఒక పక్షి, మనిషికి ఎటు సరిపోలని పిట్టలాంటి ఆకారంతో లేదు జటాయువు ఆకారం. రావణునితో యుద్ధ ఘట్టంలో యుద్ధ వాతావరణ భావాన్ని స్పష్టపర చింది. అంతేకాదు. రావణ జటాయుల యుద్ధం తెరనంతటిని ఆక్రమించుకొని,

రెండు బొమ్మలు ఎడతెరపిలేని పోరాటం సల్పుతున్నట్లు చూపించడంతో ప్రేక్షకుల నుండి ఈలలు, కేకలు విన్పించాయి. ఒక పక్షికి, 10 తలలున్న రావణాసురునితో ఉత్కంఠను రేపే యుద్ధం చేయించడం ప్రదర్శకుల ప్రతిభకు తార్కాణం. అల్లే జటాయువు యుద్ధంలో రెక్కలు తెగి క్రింద పడి పోయిన విధానాన్ని చూపిన తీరు "నిజంగా పక్షి రెక్కలు తెగాయి" అన్నంతగా ప్రేక్షకులనుండి "అయ్యో పాపం" అనే మాటలు విన్పించాయి. తర్వాత రామ లక్ష్మణులు సీతను వెదకుతూ ప్రవేశ పెట్టిన తీరు, ఒకే బొమ్మలో అంటే రామ లక్ష్మణుల పాత్రలకు, మొదటి నుండీ ఒకే బొమ్మను తెరపై ప్రవేశపెడుతూ కూడ సన్నివేశాల కనుగుణంగా అభినయం ప్రదర్శింపజేయడంవల్ల ఆ పాత్రల లోని, ఆ బొమ్మలు నూతనత్వాన్ని పొందాయి. అది కేవలం అభినయం వల్లనే సమకూరింది.

రాముడు విలపించే టప్పుడు నృత్యం చేయించారు. ముఖ్యంగా ఈ నృత్యం శోకాన్ని తెలిపే విధంగానే ఉంది. గ్రామాలలోని ప్రజలలో ఏదైనా ఆపదలు సంభవిస్తే ఏ విధంగా శోకాలు తీస్తూ అటూ, యిటూ తిరుగుతూ, వంగుతూ లేస్తూ - కూర్చుంటూ లేస్తూ ఏదేదో తలపింపజేస్తూ ఎట్లా విలపిస్తారో రాముణ్ణి ఆ భంగిమల్లో చూపించారు. ఇక్కడ రామ పాత్ర ప్రాధాన్యం కంటె, మనిషిలోని దుఃఖానికి ప్రాధాన్యత కనపడుతుంది. రాముడి దుఃఖం అందరికీ తెలిసిందే అయినా రామునిబొమ్మ దుఃఖిస్తూ చేసిన నృత్యం చూసినవారికి, హృదయం ద్రవించే భావన కల్గింది. ఇది ప్రేక్షకుల ముఖాలను చూసిన ప్రతి ఒక్కరూ గమనించగలిగిన స్థితి. జటాయువు సీత జాడను, రామలక్ష్మణులకు వివరించే సన్నివేశంలో అన్ని వాద్యాలు నిలుపు చేసారు. ఒక్క వివరణ మాత్రమే ఉంది. జటాయువు రావణునితో యుద్ధం చేసే ఘట్టంలో ప్రేక్షకులకు రావణునితో సమానంగా ఉన్నట్లు భావన కలిగే విధంగా కన్పించినా ఈ ఘట్టంలో శ్రీరాముని బొమ్మ ఎదుట రెక్కలు తెగిన స్థితిలో సమానంగా కన్పించలేదు. ఇ ద్రప్రదర్శకుల నైపుణ్యమే. తర్వాత సుగ్రీవుని కొలువు ఘట్టం ప్రవేశపెట్టారు.

రామ లక్ష్మణుల ప్రవేశం, హనుమంతుడు వారిని సమీపించడం, వారితో సంభాషించడం సన్నివేశానికి తగినట్లు చూపించినా రామలక్ష్మణుల

వద్ద హనుమంతుని చిన్న రూపంలోని బొమ్మను ప్రవేశ పెట్టారు. ఈ బొమ్మ కోతిని గుర్తు చేసేదిగానూ, నవ్వు పుట్టించేదిగానూ ఉంది. ప్రేక్షకులను ఆకర్షించడానికా అన్నట్లు హనుమంతుని చేత కుప్పిగంతులు వేయించారు. కాని సుగ్రీవుని కొలువులో ప్రవేశ పెట్టిన హనుమంతుని బొమ్మ పెద్దది. చాలా ఆకర్షణీయంగానూ, ఆ సభలోని వారందరినీ అధిగమించేదిగానూ కనిపించింది. చివరకు రాజు సుగ్రీవుని బొమ్మను కూడా అధిగమించేదిగా ఉంది. అంటే సుగ్రీవుని సైన్యం మొత్తంలో ఇతడే బలశాలి అనేది ఆ రూపం చూస్తేనే తెలిసే విధంగా ఉంది బొమ్మ ఆకారం. హనుమంతుని చిన్నబొమ్మ రాముని కాళ్ళమీద పడినపుడు ప్రేక్షకులలో భక్తి భావనకంటే హాస్య భావనకే ప్రాధాన్యత కల్గిందేమో! అంతా నవ్వారు. రాముని విశేషాలు తెలుసుకొని, సుగ్రీవుని వద్ద మరలా తిరిగి వెళ్ళిన హనుమంతుణ్ణి పెద్ద రూపంలో ఉన్న బొమ్మను ప్రవేశ పెట్టారు. రామలక్ష్మణులను సుగ్రీవుని కొలువులో ప్రవేశ పెట్టిన ఘట్టంలో రామలక్ష్మణులు, హనుమంతుని బొమ్మలు సమానంగా కన్పించాయి. అభినయంలో అన్ని పాత్రలను అధిగమించే విధంగా చేసారు.

తర్వాత వాలి సుగ్రీవుల యుద్ధ ఘట్టంలో తెరను గడగడలాడించారు ప్రదర్శకులు వాలి సుగ్రీవుల యుద్ధం. ఇద్దరు సమానులు. అతి భయంకరంగా పోరాడుతున్న ముష్టియుద్ధంలాగుంది. అయితే యుద్ధంలో వాలి ఆధిక్యతను చూపించారు. కథలోకూడా తేడాలేదు. కాబట్టి బల ప్రదర్శనలోమాత్రం వాలి బలాన్ని చూపించారు. తెర లోపలినుండి చూచేవారికి బొమ్మలు చిరిగిపోతాయేమో అన్నట్లు అనిపిస్తుంది. బయటినుండి చూసేవారికి యుద్ధం నిజమైన పోట్లాటలాగానే కనిపిస్తుంది. యుద్ధంలో వాలి హతుడైన తర్వాత "తార" విలపిస్తూ నృత్యం చేస్తుంది. ఆమె చేసిన హావభావాలు ఆమె స్థితిని తెలిపాయి. సుగ్రీవుని పట్టాభిషేకం జరిగింది అని ప్రకటించాడు. తర్వాత కథను నిలిపి హాస్యాన్ని ప్రవేశ పెట్టారు. సామాన్యంగా యుద్ధ ఘట్టాలు లేదా శోక ఘట్టాలతో ప్రేక్షకుల మనసులో ఒకరకమైన బరువుభావం ఏర్పడుతుంది. దాన్ని తొలగించడానికా అన్నట్లు హాస్యప్రసంగాలను ప్రవేశ పెడతారు. హనుమంతుడు రామునితో సంభాషించే ఘట్టం తర్వాత హనుమంతుని సాగర లంఘనాన్ని ప్రవేశ పెట్టారు. అతి చిన్న కోతి రూపాన్ని ప్రవేశపెట్టి కుప్పిగంతులు వేయిస్తూ ప్రదర్శించారు. తర్వాత లంకిణి ముందు చిన్న హనుమంతుని బొమ్మ

ప్రదర్శనం. లంకిణి ఆకారం వికృతంగానూ, భయంకర స్థితిని కల్పించేది గాను, గర్వం ఉట్టిపడే విధంగాను కన్పించింది.

6 అడుగుల విగ్రహం. మొత్తం బొమ్మల్లో ఇంత పెద్ద బొమ్మ లేదనే చెప్పాలి. ఈ బొమ్మ ఎదుట చిన్న హనుమంతుని బొమ్మ లంకిణి బొమ్మకు మోకాలి ఎత్తువరకే వుంది. ప్రేక్షకులకు ఈ రెండు బొమ్మల సంవాదం కానీ, సంభాషణ సన్నివేశంగాని, హాస్యాన్ని గొలిపేదిగా ఉంది. అంతేకాదు, ఈ రెండు పాత్రల యుద్ధ ఘట్టం కూడా హాస్యాన్ని మాత్రమే పుట్టించింది ప్రేక్ష కులకు. మధ్యలో హాస్య పాత్రలైన గందోళిగాణ్ణి ప్రవేశపెట్టి లంకిణితో అసం దర్భ హాస్య ప్రసంగాన్ని, హీన శృంగార ప్రసంగాన్ని ప్రస్తావించి, లంకిణి పాత్ర మందబుద్ధినీ, అల్పమైన మేధాశక్తినీ తెలిపినారు. హనుమంతుడి విశ్వ రూప ప్రదర్శనంలో బొమ్మ చాలా పెద్దది. లంకిణి బొమ్మను అధిగమించేది గానూ, ఆకర్షణీయంగానూ ఉంది. అశోకవనంలో సీతా రావణ సంవాద ఘట్టంలో రావణుని బొమ్మ ఒక తలతోనే ఉంది. దర్పం, ఠీవి అన్నీ ఉన్న బొమ్మ. ఆ బొమ్మముందు సీత బొమ్మ వెలవెల బోయింది. అయితే సంభాష ణల్లో అభినయంలోని భావాన్ని గమనిస్తే సీత పాత్ర అధిగమించేదిగాను, రావణ పాత్ర తక్కువస్థాయిలోను కన్పించాయి. రావణ మండోదరి సంవాద ఘట్టంలో కూడా ఒక్క తలతో ఉన్న రావణబొమ్మనే ప్రవేశ పెట్టారు. మండో దరిపాత్రతో ఔదార్యాన్ని ఉదాత్తనూ ఉన్నతినీ తెలిపే విధంగా అభినయం చేయించారు. అయితే రావణుని ఆజ్ఞాపూర్వకమైన ప్రవర్తన అభినయం మండో దరి సాధారణత్వాన్ని అధిగమించింది.

మండోదరి నీతిబోధ రాబోవు అపాయాన్ని సూచిస్తున్నట్లు ఉంది. సీత దుఃఖించే ఘట్టంలో సీత శోక నర్తనం చూపించారు. సీత పాత్రలో ఉదాత్తత కన్పించింది. అశోకవనంలో సీత శోకం సానుభూతిని పొందే విధంగా అభి నయం చేయించారు. అశోకవనంలో ముగ్గురు రాక్షసులతో హనుమంతుడు యుద్ధం చేసే ఘట్టంలో మూడు వికృతాల మధ్య ఒక ఉదాత్త పాత్ర, సాహసి పోరాడుతున్నట్లుగా తీర్చారు. సీతకు హనుమంతుడు అంగుళీయమిచ్చి రాముని యోగ క్షేమాలు తెలిపే ఘట్టంలో బొమ్మల అభినయం, సంభాషణలు మాత్రమే ఉన్నాయి. వాద్యాలు లేవు. రావణుని కుమారుడు మేఘనాథుడు

ధైర్యశాలి, సాహసి, ఉదాత్తుడు, శౌర్య, పరాక్రమశాలి అనే భావం, ఆ బొమ్మ ఆకారంలోను, అభినయంలోనూ కన్పించింది. విభీషణుడు రావణుని కొలువులో, రావణునికి నీతిబోధ చేశాడు. రావణుడు వినలేదు. అప్పటి విభీషణుని బొమ్మ ఆ కొలువు కూటమిలోని వారందరికంటే సౌమ్యంగాను, ఉదాత్తంగానూ కన్పించింది. రావణునికి నీతిబోధ చేసే సందర్భంలో బొమ్మ పూర్తి వినయాన్ని ప్రదర్శించింది. రావణుని బొమ్మను సౌమ్యమైన ఆకారంలోనూ, ఉదాత్తమైన అభినయంతోను, విభీషణుని బొమ్మ అధిగమించింది. హనుమంతుని చంపవద్దనీ, పరాభవించి పంపితే చాలనీ అన్నాడు విభీషణుడు.

ఆ సమయంలో రావణుని పాత్ర ముందు క్రౌర్యాన్ని దర్పాన్ని ఎదుర్కొని, ఓడిపోయిన వినయం వలె కన్పించింది విభీషణుడి పాత్ర. అయినా హనుమంతుని తోకకు నిప్పుపెట్టమని రావణుని ఒప్పించిన తర్వాత దర్పాన్ని జయించిన వినయంవలె విభీషణుడు కనిపించాడు. రావణుడు రాజే అయినా ఇచట విభీషణుని గుణగణాల చేత, వినయపూర్వక అభినయం చేత ఉన్నతంగా కనిపించింది బొమ్మ. రావణుని కంటె ఎత్తైనదీ, ఆరు అడుగులదీ విభీషణుని బొమ్మ. రావణుడు రాజు గదా! పైగా విభీషణునికి అన్న. అన్న కంటే తమ్ముని బొమ్మ పెద్దదిగాను, ఆకర్షణీయంగాను, ఉన్న దెందుకని ఆటగాడు రామప్పను అడిగితే "వాడు మంచోడు గదా! అందుకని పెద్ద బొమ్మ పెట్టాము వాడికి" అని అతను చెప్పిన సమాధానం చాలా లౌక్యంగా ఉంది. తోకకు నిప్పుపెట్టడం నిజంగా నిప్పుపెట్టినట్లు తెరపై ప్రవేశ పెట్టారు. ఒక చిన్న కర్రకు గుడ్డలు చుట్టి కిరోసిన్‌లో తడిపి దానికి నిప్పంటించి తెరలోపల దాన్ని హనుమంతుడి తోకలాగా తిప్పారు. హనుమంతుణ్ణి ఆకాశంలో బోరగిల పడుకొని ఎగురుతున్నట్లు చూపించి తెరకు దూరంగానూ తోక దగ్గరగా ఉన్నట్లుగానూ మంట మండే కర్రను పట్టుకొని హనుమంతుడు తిరిగినట్లు చూపించారు. ఈ ఘట్టం చాలా ఆకర్షణీయంగా ఉంది. లంకాదహనంతో సుందరకాండ పూర్తయింది. తెరపై బొమ్మలన్నీ తీసి మంగళారతి పాడారు.

మొత్తంమీద బొమ్మలను ప్రవేశ పెట్టిన తీరు వారి ప్రావీణ్యాన్ని తెల్పుతుంది. అయితే బొమ్మల విషయంలో సూక్ష్మ పరిశీలన అవసరం. భిన్న సన్ని

వేశాల్లో పాత్రలు విభిన్న రీతులలో, విభిన్న ఆకారాలతో ప్రదర్శన ఇవ్వ వలసి ఉంటుందేమో! అటువంటి సందర్భాలలో ఒక పాత్రకు అనేక బొమ్మలు కన్పించాయి. ఉదా : ఈ నాటకంలో హనుమంతుడి పాత్రకు - సుగ్రీవుడి దగ్గర మంత్రిగా ఉన్నపుడు ఆకారం, వేషం రాముడి వద్దకు సుగ్రీవుడి దూతగా వచ్చినపుడు ఒక రకంగానే ఉన్నాయి. సాగరాన్ని లంఘించేటప్పుడూ, లంక ప్రవేశించేటప్పుడూ చిన్న రూపంలోని బొమ్మను లంకిణి ఎదుట నిలిపారు. లంకిణితో యుద్ధం చేసినపుడు పెద్ద బొమ్మను ప్రవేశ పెట్టారు. లంకలో కోతి రూపంతో మరీ చిన్న రూపాన్ని, సీత వద్ద విశ్వరూపం చూపెట్టేటప్పుడు అతి పెద్ద విగ్రహాన్ని ప్రవేశపెట్టారు యుద్ధ ఘట్టాలలో ఎదుటి వారి ఆకారాన్ని బట్టి హనుమంతుని ఆకారం మారుతుంది. ఇట్లా భిన్న రూపాలున్నాయి. అయితే హనుమంతుని బొమ్మ సుగ్రీవ రామలక్ష్మణులముందు తప్ప, తక్కిన చోట్లలో ఇతర బొమ్మలను ప్రవర్తనలోను, ఆకారంలోను డామినేట్ చేసింది. అట్లాగే రామలక్ష్మణుల బొమ్మలు అడవిలో వేరు రూపంలోను, లంకలో యుద్ధఘట్టంలో వేరు రూపంలోనూ, మరికొన్ని సమయాల్లో చిన్న ఆకారంతోను ఉన్న బొమ్మలను ప్రవేశ పెట్టారు. రావణుడు యతివేషంలో వచ్చినపుడు ఆభరణాలు లేకుండా సౌమ్యంగా ఉన్న బొమ్మను పరిశీలిస్తే సీత బొమ్మ యతి బొమ్మను డామినేట్ చేసింది.

రావణుని బొమ్మ మామూలుగా ఉన్నపుడు ఒకే తలతో ఉంది. బొమ్మ చాలా బాగుంది. సీతను అపహరించే ఘట్టంలో 10 తలల బొమ్మను ప్రవేశ పెట్టారు. ఇదే విశ్వరూపం. పది తలల రావణుడి రూపం చాలా గంభీరంగాను, తానే సర్వమూ అయినట్టుగానూ ఉంది. ఈ పాత్ర ప్రవేశంతో, అన్ని వాద్యాలు ప్రయోగించారు. డప్పుతో ఎక్కువ శబ్దం చేసారు. ఆ ధ్వనిని బట్టి అభినయం వాద్య ఘోష అట్లే ఉంది. బొమ్మలను చూడగానే అతని గొప్ప తనం అంతా తెలిసే విధంగా ఉంది. ప్రతి పాత్ర కథాఘట్టాలలోని సందర్భాను సారంగా అభినయిస్తూ మాట్లాడుతుంది. ప్రేక్షకులకు అభినయం ద్వారా కథ సులభంగా అర్థమవుతుంది. సీతాపహరణంలో కథ వివరణ లేదు. అభినయం, వాద్యాల మ్రోత కథను అవగాహన చేశాయి. సీతను అపహరిస్తాడని సూక్ష్మంగా బోధపడుతుంది. అంత ఎక్కువ అభినయం పాత్రకు ఉంటుంది. అభినయం పూర్తిగా ఆయా సందర్భంలోని స్వభావాన్ని తెలిపేదిగా ఉంది.

ముఖ్యంగా రావణుని వేషాన్ని బట్టి అభినయంలో కూడా మొరటుగా, దర్పంగా ఉన్నాయి. అభినయానికి అనుగుణంగా సంగీత ధ్వనులుంటాయి. సంగీత ధ్వనులు పాత్ర స్వభావాన్ని బట్టి శ్రావ్యంగాను, ఎక్కువ తక్కువ స్థాయిలోను ఉంటాయి. రాక్షస పాత్రల విషయంలో, ముఖ్యంగా లంకిణి వచ్చినపుడు, ఆ పాత్ర కనుగుణంగా దర్పంగాను, వికృతంగాను, స్వభావాన్ని తెలిపేదిగానూ ఉంది.

పద్యం గాని, పాట గాని పరుషంగాను, పెద్దగానూ ఉచ్చరించబడింది. వాద్యాల ధ్వనులు కూడా లంకిణీ స్వభావాన్ని తెలుపుతూ అధిక మోతాదుల్లో ఉన్నాయి.

కథకు సంబంధించిన ప్రతి పాత్రకు దాదాపు పద్యాలు, పాటలు, వచనం ఉన్నాయి. అయితే సేవకుల పాత్రలకు, అతి చిన్న పాత్రలకు దాదాపు వచనమే ఉంది. అసలు ఆ పాత్రలు మాట్లాడే అవకాశాలే తక్కువగా కన్పించాయి. సంభాషణలు ఉన్నా రెండు చిన్న పాత్రల మధ్యనే ఉంది. చిన్న పాత్రలమధ్య ఎక్కువగా వచనంలోనే వుంది. హాస్యపాత్రలకు పద్యాలు లేనేలేవు. వచనం లేదా హాస్య గేయాలున్నాయి. హాస్యపాత్రల విషయంలో మొదట బంగారక్క ప్రవేశంలో మాత్రమే వాద్యాల ధ్వనులు కన్పించాయి. తర్వాత ఎప్పుడు తెరపై ప్రవేశ పెట్టబడినా వాద్యాల తోడ్పాటు లేదు. ఎక్కువగా వచనం మాత్రమే నడిచింది. బొమ్మల ప్రదర్శన తీరు అంటే అభినయాన్ని ప్రకటించే సందర్భాలు సామాన్యంగా కథా ఘట్టాలను వివరించే తీరులో ఉన్నాయి. పర్ణశాలవద్ద బంగారు లేడిని చూసినప్పుడు సీత రామునితో సంభాషిస్తూ చేసిన అభినయం, సీతాపహరణ ఘట్టాన్ని స్పష్టంగా తెలియజేస్తుంది. కథ వాద్యాలమధ్య వినిపించకపోయినా, రాముడు మాయలేడి వెంట పడడం చూస్తే వెంటనే రామాయణంలోని తర్వాత కథ గుర్తుకు వచ్చింది. జటాయువు రావణ సంవాదంలోని ప్రదర్శన అభినయం వారి యుద్ధాన్ని గుర్తు చేసింది.

రామ లక్ష్మణులను హనుమంతుడు కలసినపుడు వారు దుఃఖంతో ఉన్నప్పటికి, ఆ పాత్రలే డామినేట్ చేసినట్లు ప్రదర్శన చేయటం ఆ పాత్రల గొప్పతనాన్ని నిలబెట్టడం, వాలి సుగ్రీవ ప్రదర్శనలో బొమ్మలు అభినయం

వారి వారి స్వభావాలను తెలిపేదిగాను కథా ఘట్టాన్ని అందించేదిగాను ఉంది. హనుమంతుడు లంకిణితో యుద్ధం చేయించే ప్రదర్శన, లంకిణి అభినయం, లంకిణి దర్పాన్ని పాత్ర స్వభావాన్ని తెలిపింది. హనుమంతుడు చిన్న బొమ్మ అయినా మృదుత్వాన్ని తెలిపింది. లంకలో ప్రవేశించిన హనుమంతుడు సీతను కనుగొనడానికి చెందిన కథ ముందుగానే ఊహకు అందింది. ఇంద్రజిత్తు గుర్రంపై వచ్చి హనుమంతుణ్ణి బంధించేచిత్రం లంకలో హనుమంతుని తోకకు నిప్పు పెట్టడం, లంకాదహనం చేయడం, సీతకు అంగుళీయం ఇవ్వడం, పాత్రల అభినయం ప్రదర్శన తీరు కథలోని పద్యాలుగాని, పాటలు, వచనం గాని వాద్యాల ప్రమోతలో సరిగా వినిపించకపోయినా కథా ఘట్టాలను తెలిపే విధంగా ఉన్నాయి. సీత దుఃఖ సన్నివేశంలో హనుమంతునితో మాట్లాడి నప్పుడు, సీత భయాన్ని, నిస్సహాయతను, ఆవేదననూ, తెలిపే విధంగా అభి నయాన్ని ప్రదర్శింపజేశారు. మొత్తం మీద కథను ప్రేక్షకులకు విపులంగా అర్థమయ్యేటట్లు చేయడం ముఖ్య విధి. అందులో వాద్యాల ప్రమోతలో కథ వర్ణన సరిగా వినిపించకపోయినా, ఆ పాటల, పద్యాల భావం తొందరగా ప్రేక్షకు లకు అర్థం కాకపోయినా, బొమ్మల ప్రదర్శన తీరు, వెలిబుచ్చే అభినయం, ప్రేక్షకులకు వాటి స్వభావంతో సహా తెలిపినాయి. కథను సులభంగా అర్థం కావడానికి బొమ్మలు ప్రదర్శించిన తీరే ముఖ్యమైనదిగాను బొమ్మలదే ప్రధాన పాత్రగాను భావించవచ్చు.

## 5. 5. ప్రదర్శనలో వాయిద్యాల పాత్ర

తోలుబొమ్మలాట ప్రదర్శనంలో తాళాలు, మద్దెల, తప్పెట, తొక్కుడు బల్ల, గజ్జెలు ముఖ్యంగా సంగీత ధ్వనులకు ఉపయోగిస్తారు. ఈ తాళాలకు కంచుతోచేయబడిన రెండు గుండ్రటి 4 అంగుళాల వ్యాసార్థంలో ఉండేవివాడారు. వీటినికూడా తాళాలు అంటారు. మధ్యలో ఉబ్బెత్తుగాను లోపల భాగానికి కొంచెం వంపుగాను ఉంటాయి. మధ్యలో రంధ్రం ఉంది. రంధ్రాల్లో తాడు దూర్చి కొద్ది ముడివేసి వదిలారు. రెండు చేతుల బొటన - చూపుడు వేళ్ళ మధ్య ఈ తాటిని పట్టుకుని రెంటిని తాడిస్తుంటారు. ఎడమ చేతిలోని తాళం ఎక్కువగా కదలకుండా కుడిచేతిలోని తాళాన్ని మాత్రమే ఎత్తి ఎడమ చేతిలోని తాళం మీద కొడుతుంటారు. తాళాలు ముఖ్యంగా కథ మొత్తంలోనూ

ఆదితాళం వాడారు. అన్ని పాటల్లోనూ, అన్ని రాగాల్లోనూ దీన్ని వాడారు, 'తయ్యకు-తయ్యకు-తయ్యకు'-అనే శబ్దాన్ని ఒకటో కాలంలోను, 'తత్తద్దై, తత్తద్దై' తత్తద్దై అనీ, తకిగిదతోం, తరిగిడకధిం, తరిగిటకధిం అనే శబ్దాన్ని రెండో కాలంలోనూ వాడారు. 2+1, 1+2=**Three stroke tala.** ఇది మొదలు పెట్టినపుడు మొదటి కాలంలోనే నడచింది.

ప్రతి పాట ముక్తాయింపు మాత్రం రెండో కాలంలో ముగిసేది. పాటగానీ, పద్యంగానీ మొదలుపెట్టినపుడు తప్పనిసరిగా ఈ తాళాలను ఆది తాళంతో మొదటి కాలంలో మొదలుపెట్టి, కొంత నడచిన తర్వాత రెండో కాలంలో గతి నడిపి చివరకు పద్యం లేదా పాట అయిపోయిన తర్వాత ముగిస్తారు. ప్రతి పద్యం, పాట చివర్లలో వంతరాగాలుంటాయి.

ఈ వంతరాగాల్లో తాళాలు రెండో కాలంలో కొట్టారు. ఈ తాళాలు మ్రోగించినపుడు అంతటనూ హార్మోనియం 'ఉయ్‌య్' అంటూ ధ్వనిస్తూనే ఉంది. బొమ్మలు పాట పాడుతూ నృత్యం చేసే ఘట్టాలలో తాళాలున్నాయి. వినాయక ప్రార్థనంలోనూ, సరస్వతి ప్రార్థనా సమయంలోనూ, సీతారామ లక్ష్మణులు నృత్యం చేసేటప్పుడు, హనుమంతుడు నృత్యం చేసినప్పుడు, మండోదరి నృత్యంలోను తాళాలు మొదటి కాలంలో ప్రవేశ పెట్టారు. పాట మధ్యలో మాత్రం రెండోకాలంలో మ్రోగించారు పద్యాలు పాడేటప్పుడు ఎక్కువగా తాళాలు కన్పించలేదు తాళాలు ఉన్న ప్రతిసారీ తొక్కుడుబల్ల తొక్కడం కన్పించలేదు. నృత్య సన్నివేశాలలో తాళాలతోపాటు తొక్కుడుబల్ల తొక్కడం ఉంది. అయితే తాళాలున్న ప్రతి సన్నివేశంలో హార్మోనియం, మృదంగం ఉన్నాయి. ఈరెండే సంగీతం యొక్క కొలమానాన్ని నిలబెట్టాయనిపించింది. కాళ్ళకు కట్టిన గజ్జెలమ్రోత నృత్య సన్నివేశాలలో తాళాల ధ్వనులతో కలిసింది. అపుడు గజ్జెలమ్రోత, తొక్కుడుబల్లధ్వని తాళాలతో కలిసిపోయాయి. డప్పు వాద్యం అన్ని సన్నివేశాలలో లేదు ఉండదు.

డప్పు వాయించినపుడు దాదాపు తాళాలతోపాటు అన్ని వాద్యాలున్నాయి. యుద్ధ సన్నివేశాల్లో తాళాలతోపాటు డప్పు కన్పించింది. అయితే డప్పు వచ్చిన ప్రతిసారీ తాళాలు మాత్రం తప్పకుండా రెండో కాలంలోనే ఉన్నాయి. వాలి సుగ్రీవ యుద్ధం, హనుమంత లంకిణి యుద్ధం, అతికాయ హనుమల యుద్ధం

రామ రావణ యుద్ధ సన్నివేశాల్లో మొదట్లో దప్పు ఉంది. అన్ని వాద్యాలు ఉన్నాయి. యుద్ధ ఘట్టాలో తొక్కుడుబల్ల తప్పని సరిగా మ్రోగింది. హార్మో నియం మాత్రం మొదటి నుంచి చివరి వరకు మ్రోగింది. వచనం చెప్పేట ప్పుడు సంభాషణలు జరిగేటప్పుడు ఏ వాద్యమూ లేదు.

ఎక్కువగా వాడిన వాద్యాలలో మృదంగం రెండోది. ఈ మృదంగం ఉన్న ప్రతిసారీ తాళాలున్నాయి. రెండువైపుల తోలుతో మూయబడిన అడుగు వ్యాసార్థం గలిగిన గుండ్రటి చెక్కగొట్టం. తోలుతో రెండు వైపుల మూసిన తర్వాత రెండువైపుల అంచులనుండి తాళ్ళు లాగి బిగిస్తారు. ఈ తాళ్ళకు, చెక్కగొట్టానికి మధ్యలో అక్కడక్కడా రెండు అంగుళాల చెక్కముక్కలు దూర్చుతారు. వీటిని శృతి సరి చేయడానికి ఉపయోగిస్తారు. ఈ మృదంగం ధిమిత-ధిమిత-ధిమిత అనే శబ్దాన్నీ; ధిమిధిమిదిత్త-అనే శబ్దాన్నీ ఇచ్చింది. మృదంగం తాళం లేకుండా ఎప్పుడూ వాయించలేదు. పాటలు, పద్యాలలో ఈ మృదంగం వాడారు. అయితే సీతారాముల సంభాషణల్లో, హనుమ రావణ సంవాదంలో, వచనం విడదీసి చెప్పేటప్పుడు మృదంగం వాడలేదు. యుద్ధ సన్నివేశాలలో వాడారు. ప్రతి బొమ్మను అంటే బంగారక్క, సరస్వతి, హనుమ, రావణ, లంకిణి తెరపై తెచ్చేటప్పుడు రెండో కాలంలో వాడారు.

దప్పును దర్పంగల పాత్రలు తెరపై ప్రవేశపెట్టేటప్పుడు వాయించారు. హనుమ, రావణ, లంకిణి తెరపైకి వచ్చేటప్పుడు దప్పు వాయించారు. తాళాలు, మృదంగం రెండో కాలంలో వాడారు. జటాయువు రావణ యుద్ధంలోను, వాలి సుగ్రీవ యుద్ధంలోను, హనుమ లంకిణి యుద్ధంలోను, రామ రావణ యుద్ధం లోను ఈ దప్పును పెద్దగా వాయించారు. ఆట మొదలు పెట్టకముందు ఒక పిల్లవాడు ఊర్లో చాటింపు వేశాడు. అప్పుడది వాద్యంగా చెప్పడానికి వీల్లేదు. అప్పుడది వార్తా ప్రసార సాధనం. ఆట మొదలు పెట్టబోయేటప్పుడు తెరలో దళవాయి గోవిందు రెండు పుల్లలతో దప్పును పెద్దగా మోగించాడు. ఇది ఒక రకంగా నగారా లాగా ప్రారంభ సూచనను తెలియజేసింది. ఇది ప్రేక్షకులను తొందరగా తెరవద్దకు చేర్చడానికి, ఆట ప్రారంభిస్తున్నామని గుర్తు చేయ డానికి, తెరముందు కూర్చున్న ప్రేక్షకులు ప్రదర్శనవైపు దృష్టి సారించ డానికి ఉపయోగపడింది. బంగారక్కను తెరపైకి తెచ్చేటప్పుడు; గణపతి,

సరస్వతిని తెరపైకి తెచ్చేటప్పుడు కూడా డప్పు వాయించారు. అయితే నాటక ప్రారంభం కాబట్టి, మొదటి పాత్రల ప్రవేశం ప్రేక్షకులను కూడగట్టే ఉద్దేశ్యంతోనూ, ఆట మొదట బాగుండాలన్న పట్టుదలతో అట్లా చేశారేమోనని పిస్తుంది. పైగా ప్రదర్శన మొత్తంలో కూడా మొదట వాయించిన డప్పు మాత్రమే డామినేటింగ్‌గా ఉంది ప్రేక్షకులలో ఉత్కంఠను పెంచింది.

తొక్కుడు బిల్లను ఆట మొత్తంలో రెండు మూడు సందర్భాలలో ఎక్కువగా వాడారు. మొదట గణపతి, సరస్వతి, బంగారక్క పాత్రలను ప్రవేశ పెట్టినపుడు తొక్కారు. ప్రతి పాత్రను తెరపైకి తేగానే నృత్యం చేయిస్తారు. ఈ సందర్భంలో తప్పనిసరిగా తొక్కుడు బల్ల వాడారు. అయితే తాళానికను గుణంగా మాత్రమే బల్లమీద తొక్కుతారు. కాళ్ళకు గజ్జెలు కూడా ఉంటాయి కాబట్టి ఈ గజ్జెల కాలితో చెక్కపై తొక్కినపుడు ధ్వనిని పెంచుతుంది. నృత్యం చేసే సందర్భాలలో కూడా తొక్కుడు బల్లతో తాళాలు, మృదంగం తప్పనిసరిగా ఉంటాయి. ఐతే యుద్ధ సన్నివేశాలలో కూడా ఈ తొక్కుడు బల్ల వాడుతారు. అపుడు తాళాలు, మృదంగం లేదు. ముఖ్యంగా వాలి సుగ్రీవ యుద్ధం ద్వంద్వ యుద్ధం. అందులో తొక్కుడు బల్లను బాగా తొక్కారు. యుద్ధ ఘట్టంలో ఈ తొక్కుడు బల్లతోపాటు డప్పును వాడారు.

హార్మోనియం "ఉయ్ ఉయ్" అనే శబ్దాన్నిస్తూ ఆట మొత్తంలోను కన్పించింది. సంభాషణలు, సంవాదాలు జరిగేటప్పుడు మాత్రం హార్మోనియం వాడలేదు.

ఇట్లా వాద్యాలు సన్నివేశాలను, కథాఘట్టాలను, సందర్భాలను ప్రేక్షకులకు పట్టి ఇచ్చాయని చెప్పవచ్చు. వాద్య ధ్వనిని బట్టి సందర్భం గుర్తించే విధంగా ఉంది వాద్యాల పాత్ర. వాద్యాలు సన్నివేశ వాతావరణాన్ని కలుగ జేశాయి. ప్రారంభాన్ని (ఎత్తుగడ), ఉధృతాన్ని, ముక్తాయింపును స్పష్టంగా ఈ వాద్యాలు సూచించాయి. మొత్తం మీద బొమ్మలాటలో వాద్యాలు ముఖ్యమైన పాత్రనే పోషించాయి.

## 5. 6. హాస్యపాత్రలు ప్రవేశపెట్టిన తీరు

బొమ్మలాటలో హాస్య పాత్రలు లేనిదే ఆట రక్తి గట్టదు. అసలు బొమ్మలాట అనగానే ముందు గుర్తుకు వచ్చేది బంగారక్క, పోలుగాడు. నాటకంలోని చిన్న పాత్రలు డంబాలు పలుకుతున్నప్పుడు ఆ పాత్రలను అపహాస్యం చేయించేది పోలుగాని పాత్ర ద్వారానే. రెండు రసఘట్టాల మధ్యగానీ, కథాఘట్టాల మధ్యగానీ ప్రేక్షకులలో ఆసక్తి తగ్గకుండా ఉండటానికి, ఉత్కంఠను కొనసాగించటానికి ఈ హాస్యపాత్రల సంభాషణలు ప్రవేశ పెడతారు. ప్రదర్శనలకు తోడ్పడే గ్రామాలలోని ప్రజలను పొగిడించేదీ,లోభులైన వారిని తెగిడించేదీ ఈ పాత్రల ద్వారానే. చందాలు ఇచ్చినవారిని మహా దాతలనీ, మహా ప్రభువులనీ పదే పదే తెరమీద చెబుతుంటారు. ఇది విని పొగడ్తలంటే ఇష్టపడే వాళ్ళు ఎక్కువగా డబ్బును చందాలుగా ఇచ్చి మరీ మరీ పొగిడించుకుంటారు. బొమ్మలాటల్లో హాస్య పాత్రలు ముఖ్యంగా మూడు మగపాత్రలు, ఒకటి ఆడ పాత్ర ఉంటాయి. పేర్లు వారి వారి ఇష్టాలమేరకు పెడుతున్నారు ప్రస్తుతం. గంధోళిగాడు, భార్య బంగారక్క అనేవి ముఖ్య పాత్రలు. ఈ గంధోళిగాణ్ణి కాసాకాసా బుడ్డకేతిగాడు, కేతిగాడు, బుడ్డకేతిగాడు, జుట్టుపోలుగాడు, పోలుగాడు అనే పేర్లలో ఆయా జట్టులు వారికి నచ్చిన పేరును పెట్టుకుంటుంటారు. అదనపు పాత్రల్ని ముఖ్య పాత్రకు అల్లుడుగానో లేదా తమ్ముడుగానో లేదా కొడుకుగానో ప్రవేశ పెడతారు. మరొక మగ పాత్రను ముఖ్య పాత్రకు ప్రత్యర్థిగా ప్రవేశ పెడుతున్నారు. అయితే అదనంగా ప్రవేశ పెడుతున్న పాత్రలు నూతనంగా ప్రదర్శన రాణింపుకోసం ఆధునికంగా ప్రవేశ పెడుతున్నవి.

బొమ్మలాట మొదటి నుండి వస్తున్న పాత్రలు కేతిగాడు, బంగారక్క పాత్రలే. కొడుకు లేదా తమ్ముడు లేదా అల్లుడు పాత్రల్లో ప్రవేశ పెట్టబడే పాత్రకు తన్నాటున్ని, చిన్న కేతిగాడు, బంప్రాదిగాడు అనే పేర్లలో ఏదో ఒకటి పెడతారు. ప్రత్యర్థి పాత్రకు అల్లాటప్ప లేదా సడుగుల్లేనోడు అనే పేర్లు పెడుతుంటారు. ఈ సడుగుల్లేని వాడు అనే మాటకు శృంగార పరంగా అసమర్థుడు అనే భావానికి సమానంగా వాడుతారు. కొందరు గంధోళిగాడు, బంగారక్క భార్యాభర్తలుగా ప్రవేశ పెడుతున్నారు. ఈ రెండు పాత్రలకు తోడు మరి రెండు మగ పాత్రలు ప్రవేశ పెడుతున్నారు ఇంకొందరు.

తెరపై పాత్రలను ప్రవేశపెట్టేటప్పుడు కూడా కొందరు మొదట బంగారక్క పాత్రనూ, మరికొందరు బంగారక్క భర్త పాత్రను ప్రవేశ పెడుతున్నారు. ఈ మగ పాత్ర తెరపైకి రాగానే ముందుగా ఊళ్ళో పెద్దలను పొగడడం మొదలవుతుంది. ముందుగా ఆ గ్రామ మునసబు, కరణం, సర్పంచ్‌లను పొగడుతారు సూత్రధారుడే ఈ పాత్రతో సంభాషణ జరుపుతూ ఈ పాత్రచేత నమస్కారాలు చెప్పిస్తారు. ఒకరు ప్రవేశపెట్టే విధానం ఇట్లా ఉంటుంది.

వచ్చెరబాబూ కేతిగాడూ
నుదుట బొట్టూ పెట్టూకోనీ
సబను జూడా వచ్చినాడూ
వచ్చెరబాబూ కేతిగాడూ-

అంటూ ప్రవేశిస్తాడు. తర్వాత సంభాషణ ఇట్లా ఉంటుంది.

ఈ ఊళ్లో నాటకం వెయ్యడానికి, ఇక్కడ వెయ్యడానికి ఒప్పుకున్నందుకు ముందుగా ఈ వూరి 'కరణం' గారికి అని సూత్రధారుడు అనగానే కేతిగాడు "మహాప్రభువులు-దండాలు" అంటాడు.

సూ. ధా : మునసబు శ్రీ.......................గారికి
కేతిగాడు : మహాప్రభువులు - దండాలు.
సూ : నిన్న ఉభయం (భోజనం) చెప్పిన శ్రీ................గారికి.
కే : మహాదాతలకు దండాలు.
సూ : ఈరోజు ఆట చూడ్డానికి వచ్చిన అందరికీ.....
కే : మహానుభావులు....దండాలు.
సూ : తెరముందు కూర్చొని గోలచేసే పిల్లలకి....
కే : కోటి దండాలు.
సూ : కథ చెప్పించుకోని, చందాకు రేపురా! మాపురా! అని అర్నెల్లు తిప్పి చివరకు కందిచేలో దాక్కున్న శ్రీ పూరేటి శేషయ్యకు—
కే : చేతుల దండం పెట్టను. ఈ దండం పెడతా (బొమ్మకు ఒకపక్కన వేలాడగట్టిన పురుషాంగ చిహ్నాన్ని చేతితో ఎత్తి చూపెడతాడు.)

ఇది చందా లివ్వకుండా తప్పించుకునే ప్రజలకు హెచ్చరిక లాగా ఉంటుంది. పక్క గ్రామంలో ఫలానావాడు మోసం చేశాడనీ, అవమానకర మైన మాటలతో కేతిగాని పాత్ర ద్వారా సూచిస్తారు. పక్క గ్రామంలో ఫలానా వారిలాగానే ఈ గ్రామంలో ఫలానా వీధిలో ఒకరు ఇట్లా చెప్పుతున్నారని చెప్పిస్తాడు కేతిగాని ద్వారా. చందాలు ఇవ్వనివారి ముందరి కాళ్ళకు బంధాలు ఇవి. తర్వాత బంగారక్కను ప్రవేశ పెట్టి కథ ప్రస్తావన తెస్తాడు. మరి కొందరు భార్యాభర్తలు ఇద్దరిని ఒకేసారి తెరపై ప్రవేశపెట్టి సంభాషణ సాగిస్తారు. ఇంకొందరు కేతిగాని అల్లుడు లేదా మరొక బంధుత్వంతో ఇద్దర్నీ ప్రవేశపెట్టి సంభాషణ కొనసాగిస్తారు. కొందరు ముందుగా బంగారక్కను తెరపై ప్రవేశపెట్టి నాట్యమాడిస్తారు. ఆ పాత్రను వనార్చె ఒన్నూరవ్వ ఇట్లా ప్రవేశపెడతారు. బంగారక్క వస్తూనే—

బంగారక్క వచ్చినాదీ భామలారా
సుందరముగా చూపరార సుజనులారా
పసిడివన్నెల రెయికాదొడిగీ అమ్మలారా
నీలిరంగు చీరేకట్టి అమ్మలారా

నీటుగానూ వచ్చినాదీ అమ్మలారా........ అంటూ పాటపాడి నాట్యమారంభించి, పాట పాడించిన తర్వాత నాట్యమాడించిన తర్వాత సంభాషణ మొదలవుతుంది.

బంగారక్క : అబ్బబ్బ! వళ్ళంతా ఈ వూరి నీళ్ళుతాగి జిలపుట్టింది.

పక్కవాళ్ళు : చవుడు, సున్నం పెట్టుకో! తగ్గిపోతుంది. (ఆటలోనివారు మాత్రమే మాట్లాడుతారు. చవుడు, సున్నం నీటితో కలిపి ఒంటికి రాస్తే వళ్ళు బొబ్బలు వస్తాయి.)

బం : చవుడు సున్నమా! చవుడు సున్నం నేను గాదు పెట్టుకోవాల్సింది.
ఎవరికి పెట్టాలంటే-
వసే తసే అనేవాళ్ళకూ
వరే తరే అనేవాళ్ళకూ
అన్నంపెట్టే దాన్లో మన్నుపోసేవాళ్ళకూ
ఆట ఆడించి, పాట పాడించి
సంభావన ఎగగొట్టి పోయేవాళ్ళకు
చవుడు సున్నం పెట్టాలిరా!

ఇది చందాలు ఇవ్వనివారికి, బొమ్మలాటవారిని చులకనగా చూస్తూ అసభ్యంగా మాట్లాడేవాళ్ళకు చురకలాంటిది. పది మంది ముందు ఇట్లా ప్రతి చోట అవమానంగా మాట్లాడుతారని భయపడి చందాల విషయంలో గానీ, బొమ్మలాట వారియెడల మర్యాదగా మసలుకొనే విషయంలోగానీ జాగ్రత్త పడతారు ప్రేక్షకులు. తర్వాత-

పం : సరేగాని బంగారక్కా! నీ కెవరైనా తోడున్నారా!

బం : తోడు లేకపోవడ మేమిటి? దేశంలో కెల్ల అందగాడు, జుట్టుపోలుగా డున్నాడు! వాణ్ణి చూస్తే మూర్ఛపోతారు జనమంతా. పిలవమంటారా? అని—

"ఓ....మొగోళ్ళా...." అంటుంది.

పంత: "ఇంతమంది మగవాళ్ళలో ఏ మొగోళ్ళు రావాలమ్మా? నీ మగడెవరో ఆయన పేరుతో పిలువమ్మా!" అంటారు.

బం : ఓ....గాంధోడీ....
రారవోరి గాంధోడీ
రాకులేల బౌరా ఓరీ
కోరవెనకా వచ్చినావూ
కోరచూపూ కుందాపదనా
పందిజుట్టూ దువ్వుకోనీ
పొలిమేర దయ్యాలవాడ ॥రార॥ అని పాడుతుండగా పోలిగాడి ప్రవేశం.

బం : మొగుళ్ళకు దండాలండీ!

పో : కాలుదొక్కి తాళిగట్టిన నా పెళ్ళానికి పదివేల దండాలు. ఆడదాని కాళ్ళకు దండంపెట్టి ప్రదక్షిణంచేసి టెంకాయకొడితే ఏడాదికి మూడీత లీనుతుంది. (ప్రేక్షకులలో పెద్ద సందడి) "వెళ్ళివస్తా మొగోళ్ళు" అంటూ వెళ్ళిపోతుంది బంగారక్క. అప్పుడు చిన్న పోలుగాణ్ని ప్రవేశ పెడతారు.

చిన్న పోలుగాడు :

దాని మొగుడు దాన్నెత్తకపోతే
నేనెవర్నెత్తక పోనూ
దాని మొగుడు దాన్నెత్తకపోతే
నేనెవర్నెత్తకపోనూ

పో : ఓరేయ్! ఎవరినో తీసుకరమ్మంటే ఎత్తకపోతానంటావేరా! ఇంతకీ ఎవరెవర్ని తీసుక వచ్చావురా !

చి.పో. "రెడ్డిని, కరణాన్ని, పెదకాపుని...." అని ఊర్లో పెద్దవాళ్ళందరి పేర్లు చెప్పి వారందర్నీ తీసుకొచ్చినట్లు చెప్తాడు. అందరిపేర్లు ముందుగా సేకరించుకుంటాడు. అందరిపేర్లు చెప్పి వాళ్ళకు దండం పెట్టమంటాడు పోలుగాడు. చిన్నపోలుగాడు అందరికీ దండం పెడతాడు.

పో : కథకు పొద్దు పోతుంది. మరలా వద్దాం పదరా!

చి.పో: అట్లాగే పోదాం పద! (ఇద్దరూ నిష్క్రమిస్తారు.)

కేతిగాని ద్వారా పొగడ్తలు విని ఉప్పొంగిపోయిన పరిపాలకులు కేతిగానికి మాన్యాలిచ్చి శాసనాలు వేసిన దాఖలాలున్నాయి. కర్నూలు జిల్లా ద్రోణాచలం (డోన్) దగ్గర ఒకనాటి పాలకుడు మాన్యంఇచ్చి బొమ్మలాట వారిని ఆదరించి, ఆ మాన్యాన్ని కేతిగాడి పేరు మీదుగా ఇస్తున్నట్లు శాసనం చేయించాడని చెబుతారు. ప్రస్తుతం అది దాయాదుల వివాదాలలో పడిందని చెబుతున్నారు.

అనంతపురం జిల్లా ధర్మవరం మండలంలోని నిమ్మలకుంటవాసి దళవాయి గోవిందు తన ప్రదర్శన పర్యటనలలో గతంలో బంగారక్కను ప్రవేశపెట్టిన విధం తెలిపాడు. ప్రస్తుత పరిశీలనలో అన్ని విషయాలు రాలేదు. కొంతవరకు కలసిపోయాయి. పాటగాడే ముందుగా సభకు నమస్కారం తెలుపుతాడు. బొమ్మలాట సంప్రదాయంలో తెర మీదకు వస్తున్న పాత్ర పేరు చెబుతాడు. అంతేకాదు. ఆ పాత్రను తెరమీదకు ప్రవేశపెట్టేటప్పుడు వాద్యాలన్నీ అంటే మద్దెల, తొక్కుడుబల్ల, తప్పెట, తాళాలు, హార్మోనియం మొ॥ అన్నీ మ్రోగిస్తారు. ఆ మ్రోత తెరపైకి పాత్ర వచ్చేవరకు ఉంటుంది. ఇదే సంప్రదాయం జానపద రూపకాలైన వీధి భాగవతం, చెంచునాటకం, తూర్పు భాగవతం, యక్షగానం, చిందు భాగవతాలలో ఉంది. అయితే ఈ నాటకాలలో పాత్రను స్టేజి మీదకు ప్రవేశపెట్టేటప్పుడు పాత్రధారులలోనివారే ఇద్దరు ప్రవేశపెడుతున్న పాత్ర తల కన్పించకుండా ఒక గుడ్డను తెరగా అడ్డుగా పట్టుకొని పాత్ర అడుగుల కనుగుణంగా కదులుతూ స్టేజీ మధ్యకు తెస్తారు. అపుడు వాద్యా లన్నీ మ్రోగుతాయి. మధ్యకు వచ్చిన తర్వాత పాత్ర పరిచయం నృత్యంతోనే ఉంటుంది. పాత్ర ప్రవేశం సమయంలో రెంటికీ సామ్యముంది. బంగారక్కను ప్రవేశపెడుతున్నప్పుడు కథా సూత్రధారుడు-

సూ : ఈ నాటకానికి ఎవరొస్తున్నారయ్యా.

వం : అహా....

సూ : ముందుగా, తూర్పువాటి సిన్న దీ.

వం : అహా....

సూ : ఒకే పుట్టుబడి ఐన చిన్నది

వం : అహా....

సూ : బంగారక్క పేరు గలది

వం : అహా....

సూ : నున్నగా తల దువ్వుకొని

వం : అహా....

సూ : కొప్పు నిండా పూలు పెట్టుకొని

వం : అహా....

సూ:- పిర్ల సందు గోచి పెట్టుకోని

వం:- అహా.........

సూ:- వయ్యారంగా పిర్రలూపుకుంటూ

వం:- 'అహా హా....' అంటూ బొమ్మను ప్రవేశ పెడతారు.

ప్రక్కవంతలు:- ఓయమ్మ ఓయమ్మ ఓయమ్మా.

....అ....అ(.... అంటుండగా.

దప్పు "జెగ్ జెగ్ జెగ్ జెగ్ జెగ్.

జెగ్ జెగ్ జెగ్ జెగ్ జెగ్" అని శబ్దాన్నిస్తుండగా తక్కిన వాద్యాలు రెండోకాలంలో మ్రోగుతుండగా బంగారక్కను తెరమీదకు ప్రవేశ పెడతారు. నిమ్మలకుంటలో ప్రదర్శన చూసినప్పుడు ఇదే పద్ధతిలో ప్రవేశ పెట్టారు దళవాయి గోవిందు, రామప్పలు. వాద్యాల సంగీతాన్ని-

"తరిగిట తాక్కతక
దిరికిట తక దిరికిట తక
తదిగిణత తదిగిణత తదిగిణతా" అనే చరణంతో ముక్తాయి ం చారు.

"ఓయమ్మా విరహోము
నే తాళ లేనమ్మా విరహోము
వద్దాకే రాడాయే
వద్దాకే రాడాయే
పొద్దాటే బలమాయే
పొద్దాటే బలమాయే
ఓయమ్మా విరహోము
నే తాళ లేనమ్మా విరహోము"అనే పాట పాడించారు. చివరలో.

సూ : ఓయమ్మా

వం :- తాళలేనమ్మా అంటూ వాద్యాల మోతను పెంచుతారు. "తరిగిట తకథా తరిగిట తకథా" అని ముక్తాయించారు. తర్వాత హాస్య ప్రసంగాన్ని ప్రవేశపెట్టారు. ఒకరు చెప్పడం మరొకరు వినడం పద్ధతిలో సంభాషణగా ప్రవేశపెట్టారు.

ము. గా : ఓయబ్బ! ఓయబ్బ అన్నా!

వం : అఁ....

గా : నా దేహమంతా, నా శరీరమంతా ఒకేజిలెక్కువగా ఉందన్నా! (దేహం, శరీరం అనే మాటలు పునరుక్తం కావడం గేయాల్లోనే కాదు. ప్రదర్శనలలో కూడా పునరుక్తమవుతాయనే జానపద లక్షణాలకు నిదర్శనం.)

వం : ఏలమ్మా! ఏలమ్మట్లా

గా : ఏమోన్నా! ఈ గ్రామంల సీళ్ళుతాగగానే-

వం : అఁ....

గా : "నా తల, మొల దేహమంతా ఎగబెట్టిగికినా జిలపోలేదన్నా, నిమ్మలకుంట సీళ్ళుతాగగానే" .... (ఏ గ్రామంలో ప్రదర్శన ఇస్తుంటే ఆ గ్రామం సీళ్ళు తాగినందువల్లే జిల వచ్చిందంటూ గ్రామాన్ని ప్రశంసించడానికి ప్రస్తావనలోనికి తెస్తారు).

వం : 'అయ్యో! ఈ గ్రామం వారు మనకెంతో సహకరించారు. వాళ్ళ ఆదరణతోనే మనం ఆట ఆడుతున్నాం! కాబట్టి సీజిల, నీ శరీరతీరునుబట్టి వచ్చింది'. అంటూ హాస్య ప్రసంగాన్ని ప్రశంసా కార్యక్రమంగా మార్చినాడు.

గా : 'అవునన్నా! నీవు చెప్పిందే నిజం' అంటూ ప్రసంగం మార్చుతుంది. తర్వాత గంఢోళిగాణ్ణి ప్రవేశపెట్టారు. మూడురకాల బొమ్మల్ని ప్రవేశపెట్టి వాళ్ళంతా నా మొగుళ్ళేనని బంగారక్కతో చెప్పిస్తారు. బంగారక్క వెళ్ళిపోతుంది.

తర్వాత చిన్నపోలుగాణ్ణి ప్రవేశపెడతారు. తర్వాత చందాలు ఇచ్చిన వారిపేర్లను ప్రశంసిస్తారు. చిన్నపోలుగాడు "ఊ" కొడతాడు. "ఈ యాచకులకు చదివించిన శ్రీ..........గారైన "అని ప్రశంసించారు. ఇందులో నూరేళ్ళు దాతలకు, నూటపదేళ్ళు మాకు ఆయుష్షు ఉండాలంటాడు. ప్రేక్షకులనునుండి "ఇంకా నూటపదేళ్ళెందుకోయ్" అనే కామెంటు వచ్చింది. అది ప్రేక్షకులు సరాసరి ప్రదర్శకులతో ప్రదర్శన సమయంలో ఎట్లా సంభాషణకు దిగుతారు అనే అంశాన్ని ప్రేక్షకులు లీనం కావడాన్ని తెలుపుతుంది. "ఈ గ్రామానికి వచ్చాం. ఇచ్చట అన్నసంరక్షణ, మానసంరక్షణ, గోసంరక్షణ కావించునట్టి మహానుభావులైన కాపులు కలిగిఉన్న గ్రామం" అని గ్రామంలోని కాపుల దయాగుణాన్ని కొనియాడారు.

వం : "అవునవును, కావతులకు, వేల్పులకు
భూవతులకు, కాపే కన్నతండ్రి
వాండ్రే మనకి ప్రధానం" నాగలిపట్టిన రైతు కూడా మనలను ఎంతో సత్కరించినారు. అంటూ గ్రామ రైతులను ప్రశంసిస్తారు. తర్వాత-

గా : "ఈ నాటకం వేయిస్తున్నవారు హైదరాబాదు వారు బిట్టు వెంకటేశ్వర్లుగారు, కృష్ణదేవరాయల కాలంలో వెలుగు చూసిన ఈ కళ మళ్ళీ మన ప్రభుత్వం చేపట్టింది. వారికి ధన్యవాదాలు" అని మరలా ప్రదర్శన కర్తలపై ప్రశంసలు సాగించారు.

వం : "ఈ పొద్దు ఏం నాటకం".... అంటూ సరాసరి నాందికి బాట వేశారు.

గా : ఈ పొద్దు సుందరకాండ నాటక ప్రదర్శన జరుగుతుందని నాందీ కావించాడు.

వం : జరుగబోతున్న ప్రదర్శనలోని రామాయణ ఘట్టాలన్నీ ఏకరువు పెట్టాడు. ఇది నాటకాలలో ప్రస్తావన పద్ధతిలో నడిచింది.

గా : "అ(....మొదట రామలక్ష్మణులొస్తున్నారు" అని సూచన చేసి ఆ రెండు పాత్రలను తీసివేశారు.

లోకంలో అంటే సమకాలీన సమాజంలోని సర్వవిషయాలు ఈ రెండు పాత్రలు ప్రస్తావిస్తాయి. లోకం పోకడ, కళాకారులకున్న, సాధక బాధకాలు, ఇబ్బందులు, కళలకున్న ఆదరణ, సమాజంలో ఉన్న మంచి - చెడు, సంప్రదాయాలు, వివిధ స్వభావాలు మొ॥ అన్నీ చర్చించబాయి ఈ రెండు పాత్రలు. ఈ చర్చా సమయంలో హాస్య ప్రసంగాలు ప్రశంసలు, ఎత్తిపొడుపులు, అసంతృప్తి, తిట్లు, దీవెనలు అన్నీ గుప్పించారు. తర్వాత నాటక ప్రోత్సాహకులను ప్రశంసించి, నాటకం ప్రస్తావన తెచ్చి ఆ రెండు పాత్రలు నిష్క్రమించాయి.

తర్వాత వాలి సంహారం, సుగ్రీవుని పట్టాభిషేకం వరకూ కథ జరిగింది. మరలా బంగారక్క గంధోళిగాళ్ళను ప్రవేశపెట్టారు. ఈ మారు వాళ్ళకు క్వార్టర్సు ఇప్పించడానికి కృషి చేసిన వారి కుటుంబ పెద్ద ఖదేరావును గురించి ప్రశంసించారు. ఈ ప్రశంసను ప్రవేశ పెట్టేటప్పుడు ఒక సామ్యాన్ని తెల్పే పద్యాన్ని గంధోళి పాత్ర ద్వారా చెప్పించారు.

"పీర బలిదేవుని గన్నట్లు  
గంగ భాగీరథుని కొల్చినట్టు  
సమత (?) పోయినవేళ  
వడదెబ్బతిన్నట్లు  
సుగ్రీవ విభీషణులు  
శ్రీరాముని కన్నట్లు (అహా)  
తప్పిపోయిన బిడ్డ  
తల్లిని గన్నట్లు  
కాంచితమ్మగా....(అ(....)  
నన్ను రక్షించమంటి....  
మిమ్ముల చూడగా నా కన్నులపండువైనట్లున్నది"

అని తర్వాత వారి పెద్దలను ప్రశంసిస్తూ సంభాషణ మొదలుపెట్టారు. ప్రేక్షకుల నుండి "కథ కానివ్వమని" కేకలు విన్పించాయి. ప్రదర్శకులు వెంటనే బంగారక్క గంధోళిగాళ్ళను నిష్క్రమింపజేశారు.

తర్వాత శ్రీరాముడు హనుమంతుని పిలిచి సీత జాడ గొనిరః చెప్పిన తర్వాత హనుమంతుడు లంకను ప్రవేశిస్తాడు. లంకలో ప్రథమదా వద్ద లంకిణి కావలా కాస్తుంది. లంకిణి ద్వారంవద్ద హనుమంతునితో ల సంవాదం ఉంది. అచ్చట మరలా పోలుగాణ్ణి ప్రవేశ పెట్టారు.

లంకిణి మందబుద్ధిగల పాత్ర. పైగా రాక్షసి. హనుమంతుని చే చావుదెబ్బ తింటుంది. 'ఈ పాత్రను అవహాస్యం చేసి హనుమంతుని / తనాన్ని రెట్టింపు చేసేందుకు ప్రవేశ పెట్టారా' అనిపించింది. దుష్టపాత్రల దంబాలుపలికే పాత్రలవద్ద, అల్పపాత్రల సంభాషణలవద్ద ఈ కేళి ప్రవేశ పెట్టి, ఆ పాత్రలను కేతిగాని ద్వారా అవహాస్యం చేయిస్తారు. ఆ యంలో హనుమ పాత్రను తెరకు చెక్కారు. లంకిణి వికృత స్వరూపా లావును, ఎత్తును, అల్పబుద్ధిని కేతిగాడు అవహాస్యం చేస్తాడు. ఇక హాస్యం పచ్చి శృంగారంతో కూర్చి ప్రవేశ పెట్టారు. ఇది ప్రేక్షకులకు ః రిలీఫ్. మధ్యమధ్య హనుమంతుని ప్రస్తావన తేవడం కూడా ఉంది. లంకి ఆట ఆడుకోవడం, అసభ్య ప్రసంగంలో శ్రుతి మించడం, చివరగా బంగాః ప్రవేశించి మొగుణ్ణి కొట్టడంతో ప్రసంగాన్ని నిలుపు చేశారు.

ఇట్లా హాస్య పాత్రలను కథలో కరుణరస ఘట్టాల తర్వాత, రౌద్ర రసఘట్టాల తర్వాత, యుద్ధఘట్టాల తర్వాత ప్రేక్షకులకు రిలీఫ్‌కోసం ప్ర పెడతారు. సరాసరి రెండు హాస్యపాత్రలను సంభాషణ ద్వారా ప్రవేశ పె ఒక పద్ధతి. కథలోని ఒక పాత్రతో ఒక హాస్యపాత్ర సంభాషణ నడిపిం మరొకపద్ధతి. కథలోని పాత్రతో దుఃఖ సమయాలలో ఓదార్పు వచనాలతో డాంభికాలు పలికే సందర్భంలో అవహాస్య ప్రసంగంతోనూ, అల్ప పాత్ర అల్పమైన శృంగార ప్రసంగాలతోనూ సంభాషణలు నడిపిస్తారు.

## 7. ప్రేక్షకుల స్పందన

ఆటకు సన్నద్ధమయ్యారు. నగారా మొదలైంది. పిల్లలు కేరిం కొట్టారు. అందరూ (తెరలోపల) గోవిందా అంటూ గోవింద కొట్టారు. తెర వినాయకుని నృత్యం. బొమ్మ బాగుంది. నృత్యంలో గజ్జెలతో చెక్క తొక్కాడు. తెరకు అతిదగ్గరలో చిన్నపిల్లలు కూర్చున్నారు. వారి తః

యువతులు కూర్చున్నారు. ప్రార్థన మొదలు పెట్టగానే మగాళ్ళు చిన్నగా ఆడవారి వెనుకకు చేరి కూర్చున్నారు. తర్వాత సరస్వతీ ప్రార్థన ప్రారంభమైనది. సరస్వతి అన్నివైపులకు తిరుగుతూ నృత్యం చేయడం అద్భుతం. స్త్రీ ఆడించింది. స్త్రీ పాడింది. ప్రేక్షకులంతా నిశ్శబ్దంగా చూశారు. సరస్వతీ ప్రార్థన తర్వాత, బంగారక్క బొమ్మను ప్రవేశపెట్టారు, బంగారక్క మొల గిక్కుంటూ ప్రవేశం. స్త్రీలలో నవ్వులు. నడికారు వయసువారు మునిముసి నవ్వులు. స్త్రీ సంభాషణ చేసింది. ఇంతలో బంగారక్క భర్త గందోళిగాడు ప్రవేశించాడు. గంధోళి - బంగారక్క నృత్యం పిల్లల్లో నవ్వులు. ఈ బొమ్మల్ని ఆడించింది చిన్నపిల్లలు. ఆ గ్రామవాసి కొండారెడ్డి 5.00 రూపాయలు వాళ్ళకు కాన్కగా చదివించాడు. నేను 10/-లు కానుకగా చదివించాను. కానుకలు ఇచ్చినవారి కీర్తి నూరు ఏళ్ళు మాకు నూటపదేళ్ళు గలగాలి (రామప్ప). ఈ ముసలోడి కింకా బతకాలని ఉంది అని ఎగతాళి. ప్రభుత్వానికి ధన్యవాదాలు చెప్పాడు.

రామప్ప తెలిసిన ఆ ఊరి వారందర్నీ ఎక్కువగా పొగుడుతూ పోతుంటే ప్రేక్షకుల నుండి ఒకరు లేచి "బొమ్మలాటాయనా! కథ కానివ్వండి" అన్నాడు. వెంటనే పొగడ్తలు నిలుపుచేసాడు. ఆట మొదలుపెట్టడానికి ఒకింత విశ్రాంతి లభించినది. విరామసమయంలో వాద్యాలు శ్రుతి చేసుకున్నారు. ఈ సమయంలో సీతారామలక్ష్మణ బొమ్మలు చెక్కారు. తర్వాత ఆడించారు. సీతారామలక్ష్మణుల నృత్యం ప్రేక్షకుల నాకట్టుకుంది. రామలక్ష్మణులు 6 అడుగులు, సీత 4 అడుగుల బొమ్మలు. తర్వాత బంగారులేడిని ప్రవేశపెట్టారు. బంగారు లేడిని చిన్న అమ్మాయి ఆడించింది. రామలక్ష్మణుల సంవాదంలో హస్త చలనం ప్రేక్షకులను ఆకట్టుకుంది. మృగం వేటలో వాయిద్యాలు ఎక్కువగా ప్రయోగించి కథాఘట్టంలోని పట్టును విపులంగా అందించారు. లేడి కేక తర్వాత సీతా లక్ష్మణ సంవాదం జరిగింది. "సీత గతి తప్పుతుంది" అని సానుభూతిని తెలిపే విధానంలో అన్నారు ప్రేక్షకులు. లక్ష్మణ పాత్ర నిష్క్రమణం తర్వాత, రావణుడు యతి వేషంతో ప్రవేశించాడు.

ప్రే : ఈ రోజు బాగా ఆడుతున్నార్రా.

రా : రావణుడు తాళలేను నన్ను కౌగిలించు అంటూ వస్తాడు.

సీ : రాముడి భార్యను నన్ను ముట్టుకోవడానికి నీ కెన్ని తలలు-

రావణుడు : వెంటనే 10 తలల రావణుడు ప్రవేశం.

ప్రే : చూడు 10 ఉన్నాయి.

పిల్లలు: అబ్బా పది తలలు! ఎంత బాగుందిరా.

ప్రే : తెరముందు కూర్చున్న పిల్లలు ముందు లేచారు. వెనుకవారు సరిగా కనిపించడంలేదు కూర్చోండయ్య అన్నారు. సీత మూర్ఛ, రావణుడు సీతను తీసుకుపోవడం చూపిస్తారు.

ప్రే : స్త్రీలు కంట తడిపెట్టి చీరలతో తుడుచుకోవడం కన్పించింది. జటాయువు రంగ ప్రవేశం చేసింది.

ప్రే : స్త్రీ ప్రేక్షకులలో గుసగుసలు మొదలయ్యాయి. జటాయువు ప్రవేశం, రావణుని ఎదిరించడం, జటాయువు రావణ యుద్ధంలో పిల్లలు లేచి ఈలలు వేశారు. యుద్ధ ఘట్టంలో లోపల రామప్ప, రామకృష్ణ కొట్టు కున్నట్లు చేశారు.

ప్రే : అబ్బా జటాయువు కూలిందిరా.

ఒకడు: సినిమాలో నైతే గద్దలేపుకు పొయ్యాడురా.

రెండోవాడు : ఇందులో చూపెట్టలేదేమిరా.

ప్రే : ఈ రోజన్నీ కొత్త బొమ్మలేరా!

ప్రే : పురుషుల్లో రామాయణ చర్చ. ఒకదేమో 'అర్యబాకండిరా! రామ లక్ష్మణుల సంవాదం'

ప్రే : రాముని విలాపం ప్రేక్షకుల మౌనం, విచారంతో చూడడం, విషాదంతో రాముడు నృత్యంచేయడం, తన బాధ లక్ష్మణునికి తెలపడం గుర్తుంచుకో దగిన అంశాలు. ఊర్లోనుండి పలు వ్యవసాయిక కులాల స్త్రీలు వచ్చి, దూరంగా ఉన్న బొమ్మలాట వారి ఇళ్ళముందు కూర్చున్నారు.

జటాయువు రామలక్ష్మణులకు, రావణుడు సీత నెత్తుకుపోతున్న వార్త చెప్పి రాముని పాదాల మీద పడడంలో నటన బాగా చేయించారు. భలే బాగుందని ఒకరు.

ప్రే : అందుకేగా తోలుబొమ్మలాటకు 90 ఆమడ పోవాల అన్నది.

వాలిసుగ్రీవుల ఘట్టం. సుగ్రీవుడు రామలక్ష్మణులను వాలి తన మీదకు

పంపాడని భయపడడం,హనుమంతుడు ఎదురు వెళ్ళి వార్త కనుగొనడం, హనుమంతుడు కోతులకుప్పిగంతులు,వారికి దొరికిన సీతాదేవి ఆభరణాలు తెచ్చి ఇవ్వడం చూడముచ్చటగా చూపించారా ఘట్టాన్ని.పిల్లలు ఈలలు వెయ్యడం, ప్రేక్షకుల్లో, కొందరు మరాఠీలో మాట్లాడారు. వాలితో యుద్ధం చేయమని రాముడు సుగ్రీవునితో చెప్పడం వాలిని కిష్కిందను, తారను స్వాధీనం చేస్తాననడం. సుగ్రీవుడు సంతోషపడ్డాడు. హనుమంతుడు రామలక్ష్మణులను సందర్శించడం హనుమంతుని చిన్న బొమ్మ రాముని పాదాలపై పడ్డాడు. అంతా నవ్వారు. హనుమంతుని ఆకారంలో తెచ్చిన అలంకరణ, చేష్టలకు, అంతా కోతిని గుర్తు చేస్తుంది. వాలి సుగ్రీవ యుద్ధంలో ఒకరిపై ఒకరు పడుకున్నట్టుగా గుండ్రంగా తిరగడం ప్రేక్షకులకు ఆకర్షణీయ ఘట్టం.రామునికి ఆడగొంతు వచ్చింది. అంటే స్త్రీ పాడింది. వాద్యాలు, నవ్వులు, గోలలు, ఈలలు అన్నీ ఒక్కసారిగా కలిసిన ధ్వని.

ప్రే : అరెరే వాలి చచ్చాడ్రా!

'రాజులు మృగాలను వేటాడుతారు కానీ కోతుల్ని వేటాడుట నేను చూడలేదు' - వాలి. ఇది రంగనాథరామాయణములోనుండి ఉటంకించబడింది. గాయకుల గొంతులో దుఃఖం. యుద్ధ సన్నివేశంలో వాద్యాలు. తార ప్రవేశం, విలాపం, దుఃఖాభినయం, అంగద పట్టాభిషేకం, సుగ్రీవుని పట్టాభిషేకం

ప్రేక్ష : ఓర్నీయమ్మ గంధోళిగాడు బేటకె వెళ్ళబెట్టిండు. పురుషులు-యువతులు చిన్నగా నవ్వారు. ఖదేరావును పొగడడం కన్పించింది. ఖదేరావు వాళ్ళకు సొసైటీ ఏర్పాటు చేసి, ఇళ్ళు కట్టించాడని వారి పొగడ్త. ఇక చాలు కథ కానియ్యండయ్యా. రామలక్ష్మణుల ప్రవేశం. హనుమంతుని కీర్తన. ముసలివాళ్ళు కొందరు వచ్చారు. పిల్లలు కొందరు నిద్రపోయారు.కొంతమంది స్త్రీలు లేచారు. 'కథ బాగుంటే పోతున్నారేమిటి' అని పురుషులు అన్నారు. "చలిగాదయ్యా దూరంపోవద్దు" అన్నారు స్త్రీలు. హనుమంతుడి పెద్ద బొమ్మ ప్రవేశం. 'ఎటు దాటుదు ఈ వారధి' పాట నృత్యంతో ప్రేక్షకుల్ని ఆకట్టుకుంది. హనుమంతుడు చిన్న రూపం దాలుస్తాడు. లంకిణి ప్రవేశం. లంకిణి పెద్ద బొమ్మ - 6 అడుగులు.

ప్రే : ఈలలు అబ్బ - అహో - బాగుంది బొమ్మ. కోతి నృత్యం, లంకిణి నృత్యం చేస్తుంది.

ప్రే : ముందువారు లేవారు. కూర్చోండి కూర్చోండి వెనుక ఉన్న ప్రేక్షకులు.

ప్రే : గంధోళిగాడి ప్రవేశం. బేటరీ లేపుకొని వచ్చాడు. పంపుసెట్లు పుల్ల - బేటరీ కథ చెపితే రామప్ప చెప్పాలిరా హాస్యం. మరలా మగవాళ్ళు వచ్చారు. గంధోళి లంకిణిని ఎగాదిగా చూసి, ఇంతమనిషికి పైనే జుట్టు అంటుందే, నెలకు బేడ్లకు ఎన్ని దుడ్లు ఖర్చుపెడుతున్నావు లంకిణి అంటాడు. ప్రేక్షకుల్లో నవ్వులు.

ప్రే : ఇదేమన్న విఠలాచార్య సినిమా అనుకున్నావా? మగ ప్రేక్షకులు - ఆడవారిపై పుకు నెట్టుకుంటూ రావడం.

ప్రే : కథ గానియ్ సామి!

ప్రే: రెం. : ఆశికం బాగుంది ఉండనియ్యండయ్యా. ఇదేంటి ఎత్తుగా ఉందని లంకిణి చన్ను బట్టుకుంటాడు గంధోళి. ఒక దెబ్బ కొడుతుంది, బేటరీ లేపుకొని బంగారక్కను కరుసుకోవడం.

ప్రే : ఓయబ్బ కరుసుకున్నారయ్యా నన్ను ఏడవలేడు గాని అంత పెద్ద మనిషి కావాలట అంటుంది బంగారక్క. హనుమంతుడు లంకిణిల యుద్ధం. ఈలలు, గోల, ఏయ్ ఏయ్. ప్రేక్షకులలో హుషారు, కేకలు, లంకిణివధ జరుగుతుంది. అశోకవనంలో సీత విలాపం, రాక్షస స్త్రీలు నవ్వడం, సీత ఘట్టంలో ఆడవాళ్ళు దిగాలుగా చూడడం.

ప్రే : చలిగాలి కదా కొందరు లేచిపోతున్నారులే రావణుడు. సీతవద్ద నృత్యం చేస్తాడు. కొంతమంది వెనుక పడుకోవడం కన్పించింది. రావణుడు సీతను కోరడం, పిల్లలు పెద్దల్ని కథ అడగడం. కథకుల గొంతు బొంగురు బోవడం మండోదరి సౌందర్యం అద్భుతం.

ప్రే : ఒక ప్రేక్షకుడు తెరమీది రావణుడి మీదకు రాయి వేశాడు. రావణ మండోదరి సంవాదం ప్రేక్షకుల నాకర్షించింది.

ప్రే : హాస్యం కావాలయ్యోయ్ అని ఒక కేక వినిపించింది. బంగారక్కను ప్రవేశపెట్టారు. అల్లుడు అత్తా శృంగార ఘట్టం. గంధోళి బేటరీ లేపుకొని రావడం అత్తా అల్లుడి నృత్యం సరసం చూపించారు.

ప్రే : ప్రేక్షకుల్లో నవ్వులు. గంధోళిగాడి ప్రవేశం స్త్రీలు నిర్లజ్జగా చూడడం తెరమీద రతి-క్రీడ చూపడం, గంధోళిగాడు అల్లుణ్ని కొట్టడం, హాస్యాన్ని తెరనుండి తొలగించారు.

కథ : సీత వెనుక అశోక వృక్షం - సీత పాత్రను చిన్న పిల్ల మంగమ్మ (9 సం॥) పాడింది. సీత - నీ నామ దేహంబేది? అంటుంది. సీతకు హనుమంతుడు నిజస్వరూపం చూపెట్టాడు. ముగ్గురు రాక్షసుల మధ్య ఆంజనేయుని నృత్యం. యుద్ధంలో - వాద్యాలు అన్నీ ప్రయోగించారు. అక్షాసురుడు (రావణుని కుమారుడు) ప్రవేశిస్తాడు. హనుమంతునితో యుద్ధం చేస్తాడు. గోలలు, ఈలలు, చావడం, మేఘనాథుని గుర్రం ప్రవేశం కోతిని బంధించి రావణుని ఎదుట పెడతారు. రావణ విభీషణుల సంవాదం.

కోతిని చంపితే కోతి హత్య అని విభీషణుడు నీతి చెబుతాడు. రావణునికి. విభీషణుడి బొమ్మ రావణునికంటె పెద్దది. "వాడు మంచోడు కాబట్టి" (రామప్ప). ఎందుకని పెద్దదని అడిగితే రామప్ప చెప్పిన మాటలు. లంకాపురంలోని నాల్గు లక్షల వీధుల బట్టలు తెచ్చి తోకకు చుట్టి నిప్పుపెట్టమని విభీషణుని సలహా. లంకాదహనం అంటే సుందరకాండ. సముద్రుడు కోతి తోక నిప్పు ఆర్పడం. ఆంజనేయుడు రామునికి, అశోక వనంలోని సీత గురించి చెప్పడం, శిరోరత్నం ఇవ్వడం, లంకావారధి కట్టడం, రామరావణ యుద్ధం, సీత విడుదల, అయోధ్యప్రయనం.

ప్రే: ఆహా - బాగుందిరా! బాగుందిరా!

సుందరకాండము అనే లంకా దహనం నాటకం సమాప్తమయ్యింది. ఇందులో లోపాలోపాలు అప శబ్దములుండిన, అలనాడు హాలాహలాన్ని ఈశ్వరుడు కంఠములో ఉంచుకున్నట్లు, ఈ నాటకంలో సుశబ్దం గాని, అపశబ్దం గాని వుండిన, తమ కుమారులు తప్పులు చేసిన, ఏలాగున మన్నింతురో ఆలాగున మమ్ము మన్నించ ప్రార్థన.

రామప్ప : జై ఇందిరారమణ గోవిందా, గోవిందా.

అందరూ!

ఆటగాళ్ళు కూర్చుని అంతా నమస్కరించడం హర హర మహాదేవ శంభో—

మంగళమ్

ప్రేక్షకులు అందరూ లేచి వెళ్ళినారు, అన్నీ సర్దుకొని లోపలకు వెళ్ళారు వారు.

## 5.7. ప్రేక్షకుల స్పందన

బొమ్మలాట ప్రదర్శకులు ప్రేక్షకులను దృష్టిలో పెట్టుకొని ప్రదర్శిస్తారు. వచ్చిన ప్రేక్షకులలో పెద్దలెందరున్నారో, స్త్రీలెందరున్నారో, యువతులు, యువకులు ఎంత పరిమాణంలో ఉన్నారో పిల్లలెందరున్నారో సరిగ్గా అంచనా వేసుకొని ఆ తర్వాత ప్రేక్షకులను బట్టి ప్రదర్శన తీరును మార్చుతారు. ఇందులో ముఖ్య ఉద్దేశం ప్రేక్షకులను ఆకర్షించడం. ప్రేక్షకులు ఎక్కువ మంది పెద్దవారైతే కథలో శ్లోకం చదివి, పద్యం చెప్పి దానికి వ్యాఖ్యానం చేస్తాడు. ప్రతి మాట విడదీసి చెప్తాడు. పెద్దలంతా కేవలం కథాగమనానికే ఆకర్షితులౌతారు. యువతీయువకులు ఎక్కువగా ఉన్నట్లయితే హాస్యాన్ని, హాస్యంలో శృంగారం విశృంఖలంగా ప్రవేశ పెడతారు. పిల్లలు ఎక్కువగా ఉన్నట్లైతే కథ అంత అభిరుచితో చెప్పరు. పిల్లల్ని అల్లరి చేయకుండా తన ఆధీనంలో ఉంచుకోవడానికి సందర్భం, సన్నివేశం అనే నియమాలు పాటించకుండా కేతిగాణ్ణి, అల్లాటప్పను ప్రవేశ పెడతారు. కథ కేవలం కరుణంలోనో, శృంగారంలోనో, రౌద్రంలోనో నడిపితే ప్రేక్షకులలో అభిరుచి నశిస్తుంది. సామాన్యంగా ప్రేక్షకులలో పెద్దలు, యువతీ యువకులు ఉంటారు కాబట్టి అక్కడక్కడా హాస్యాన్ని, శృంగారాన్ని ప్రవేశ పెట్టి ప్రేక్షకులను ఆకర్షిస్తారు. ఒకే ప్రవేశంమీద ప్రేక్షకులంతా ఆకర్షించకపోవచ్చు. కానీ ముందొకరిని, తర్వాత మరొకరిని ప్రవేశ పెడతారు.

ఆట మధ్యలో ప్రేక్షకులలో ఒక వర్గం బోరుకు గురయ్యే అవకాశం ఉంది. తద్వారా నిట్టూర్పులతోనూ, అలసత్వంతోనూ శబ్దాలు చేస్తుంటారు. ముఖ్యంగా యువతీయువకులు, పిల్లలు ఈ కోవలోనివారే కాబట్టి ప్రదర్శన అంతా ప్రేక్షకులను ఆకర్షించే విధంగా తయారు చేస్తారు. కొందరు ఆట మధ్యలో వెళ్ళిపోతారు. వారిని ఏమీ చేయరు. కానీ ఆ తర్వాత ఎవరూ కదలకుండా ఉండేందుకు కథలోను, హాస్యంలోను మంచి మసాలాలు తగిలిస్తారు. ప్రదర్శకుడి చూపంతా ప్రేక్షకులను ఆకర్షించడంలో కేంద్రీకృతమై ఉంటుంది. ..

# VI. అనుబంధం

## (బొమ్మలాట - ప్రదర్శించిన కథ)

### తోలుబొమ్మలాట కథ - నిమ్మలకుంట

అందరూ : గోవిందా గోవిందా గోవింబా గోవిందా
పరమాత్మ కావరా నారాయణ
ఓ రామా శ్రీ రామా నారాయణ
ఆ॥ శ్రీరామా జయరామా నారాయణ
ఆ॥ నారాయణ వేగారా నారాయణ
ఆ॥ ఓ రామ జయరామ నారాయణ
ఆ॥ గోవిందా భక్తపాలన దీనావన
ఆ॥ ఓ రామ శ్రీరామ నారాయణ ॥ఓ రామ॥
ఆ॥ మహాతేజ సుందార నారాయణ
ఆ॥ జగజ్జేత శ్రీరామ నారాయణ
ఆ॥ ఆ........ రెండోకాలం వాద్యాలు
తాళాలలో - తరిగిటకది తరిగిటకదిం
తరిగిటకతోం

స్త్రీ : ఆ॥.... .... అంటూ రాగం.

పురుష : తొండము నేకదంతమును
తోరపుబొజ్జయు వామ హస్తమును
మెండుగ మ్రోయగను గజ్జెలు
మెల్లని చూపులు మందహాసమున్ ఆ॥....ఆ ...

స్త్రీ : ఆ॥.... ఆ.... రాగం....

పు. : తత్తదై తత్తదై తత్తదై

కలిసి : స్వాగతం, స్వాగతం, స్వాగతం, స్వాగతం,
స్వాగతం, స్వాగతం, స్వాగతం, స్వాగతం.

క. నా. : ధిత్తా ఝణతా ధిత్తా.

స్త్రీ : రాదాయనే బామరాదాయనే.
రాదాయనే బామ రాదాయనే.

కలసి : సరస్వతి బామ.
వేడుకజూడా ॥సరస్వతి॥
రాదాయనే బామ రాదాయనే
రాదాయనే బామ రాదాయనే
సరస్వతి బామ వేడుక జూడ.
మళ్ళీ రెండో కాలంలో వాద్యాలు.
తాతై తాత తధిమితా తధిమిత.

క.నా: అమ్మా ఇక్కడికొచ్చినవారు ఎవరమ్మా తల్లీ.

స్త్రీ.వ: బాలకా! ఇక్కడికొచ్చినవారు ఎవరని ఎచ్చరించుచుంటివా.

క.నా: ఆఁ

స్త్రీ వ: బ్రహ్మంతా, ప్రజాపతి, పితామహ, ఆఁ ఆ బ్రహ్మదేవుని భార్యయగు నా దేవి, భారతీదేవి.

క.నా: ఏమమ్మా.

స్త్రీ.వ: ఆఁ

క.నా: సృష్టికర్తయగు బ్రహ్మదేవుని పట్టంపు రాణియగు నీ పేరు భారతీ దేవనగా, సరస్వతీదేవందురాతల్లీ?

స్త్రీ.వ: అవును.

క.నా: ఇందులో రాగతంబేమో చెప్పవమ్మా.

స్త్రీ.వ: ఈ రోజు జరుగబోవు కథ ఏమనగా

క.నా: ఆఁ

స్త్రీ.వ: సుందరకాండము, లంకాదహనమును, చూచి ముక్తి పొందించుటకు (వ: ఆఁ) బాలబాలికలకు (వ:ఆఁ) గ్రామానికి అభివృద్ధి చేయుటకై మీరు ప్రార్థించగా మేము వచ్చినాము.

క.నా: మరి ఎచ్చటికి బోవుచున్నావమ్మా?

స్త్రీ.వ: నేనసలు బ్రహ్మపట్నము చేరుచున్నాను.

క.నా: ఆఁ బ్రహ్మలోకము వెళుతున్నావా?

స్త్రీ.వ: వెళ్ళిరామ్మా?

పాట

స్త్రీ. పురుషులు : మాం పాహి
మా జయ జననీ
మమ్మేలే
మా జయ జననీ ॥మాం॥
మాం పాహి మా జయ జననీ
మమ్మేలే జయ జననీ
వరవీణా పుస్తకపాణి
.... .... .... .... ....
మాం పాహి .... .... .... రెండో కాలంలో
తకిటతా, తకిటతా, తకిటతా,

క.నా: అయితే

పు.వ: విఘ్నేశు ప్రార్థన గావించినాము.
ఆఁ!

క.నా: ఆఁ సరస్వతీదేవి ప్రార్థన గావించినాము.

స్త్రీ.వ: ఆహాఁ ...

క.నా: కాబట్టి ఈ నాటకానికి ప్రారంభదారుడనగా జుట్టు పోలిగాడు, బంగారక్క.

పు.వ: ఆఁ తూర్పునాటి చిన్నది, ఆ బంగారక్కను కాస్త ఇలాగున పిలవండి.

క.నా: ఆ బంగారక్క ఎలా వస్తుందంటే
ఆఁ ఏది? కాస్త ఆవిధం చెప్పండమ్మా!

స్త్రీ : తగ దిది మదనా .... ఆఁ

స్త్రీవంత: ఓయమ్మ ఓయమ్మ ఓయమ్మ
.... .... .... .... .... .... ....

.... .... .... .... .... .... ....

ఆఁ........ ఆఁ........ ఆఁ........

నా................

అ...............

(రెండో కాలంలో తాళం)

క.నా: తరిగిట తాక్కతక దిరికిట తకదిరి కిటతక

తదిగిణత తదిగిణత తదిగిణత

పాట ఇద్దరు కలిసి దరువు

తాళ లేనమ్మా విరహము

తాళలేనే విరహము

ఓయమ్మా

నే తాళలేనమ్మా విరహము

వద్దాకే రాడాయే

వద్దాకే రాడాయే

పు : పొద్దాటే బలమాయే

పొద్దాటే బలమాయే

స్త్రీ : ఓయమ్మా విరహాము

ఓయమ్మా విరహాము

(రెండో కాలంలో)

స్త్రీ : నే తాళ

లేనమ్మా

ఆఁ ........ ........ ........

కేవలం వాద్యాలలోనే తాళం

తరిగిటతథా తరిగిటతథా........3

స్త్రీ : ఓ యబ్బ ఓ యబ్బ అన్నా

పు : ఆఁ

స్త్రీ : నా దేహమంతా నా శరీరమంతా

బలే జిలెక్కుతూవుందన్నా

పు : ఏలమ్మా ఏలమ్మట్లా?

స్త్రీ : ఏమోన్నా! ఈ గ్రామంల నీళ్ళు తాగగనే

పు : ఆఁ

స్త్రీ : నా తలా, మొలా దేహమంతా ఎగబెట్టి గీకినా జిల పోలేదన్నా, నిమ్మల కుంట నీళ్ళు తాగగానే

పు : ఏమమ్మా నిమ్మలకుంటలో (ఆఁ)
ఆ కొత్త బోరింగు నీళ్ళు దాగి

స్త్రీ : ఏమో ఈ కొత్త కాలువ నీళ్ళో ఈ కోటర్సు నీళ్ళో తాగేతలికేమో ఎగ బెట్టి గీకినా పోలేదన్నా. జిలెత్తి ఆఁ.

పు : అమ్మా, ఈ నీళ్ళట్లాంటివి కాదు. మన గవర్నమెంటు వాళ్ళు మాకేదో ఆదరన జేసి

స్త్రీ : ఔనన్నా

పు : మా కెంతో..........గ్రామస్తులు, నిమ్మలకుంటలో గ్రామస్తులు........

స్త్రీ : ఔనన్నా వాళ్ళ ఆధ్వర్యముతో,........సహాయముతో

పు : సహాయముతో ఆ వాళ్ళు కలుగజేసినారు.

స్త్రీ : ఔను

పు : ఆ నీళ్ళు అట్లాంటివి కాదు.

స్త్రీ : ఆఁ...............

పు : కాబట్టి శరీర ప్రకృతి వలన ఏమో కాబట్టి నీవొక్క దానివే వున్నావా నీ మొగుడో....

స్త్రీ : అయ్యో, నాకు ఈడుకాడు, జోడుకాడు, వెంటకాడు, అంతా ముగ్గు రున్నారన్నా నాకు

పు : ఎవరమ్మా వాని పేరు

స్త్రీ : నానా కస్తూరి మిశితమైన గంధోశిగాడు

పు : గంధోశిగాడు?

స్త్రీ : ఆఁ ఆఁ

పు : వాణ్ణి జుట్టుపోలిగాడు అంటారే?

స్త్రీ : అతడు నా పెనిమిటి.

పు : ఓహో వానికి అర్జునవకున్నట్లు పది పేర్లువున్నాయా?

స్త్రీ : ఔనన్నా.

పు : అమ్మా నీవేమో....చూసినావు నీ మొగుణ్ణి పిలిపిస్తావు

స్త్రీ : పిలిపిస్తాను.

పు : పిలిపియ్యి.

స్త్రీ : పిలిపిస్తానన్నా, ఓ....రారా సామీ
గంధోళీ; రారాసామి గంధోళీ రారాసామీ.......
తాళం మద్దెల ప్రారంభం
పాట ప్రారంభం. దరువు

కలసి : రారా నా గంధోళీ
రావు ఏలారా
రారా నాసరసకింకా
రావు ఏలారా సామి ॥రారా॥
తాపమింకా తాళాలేను
హై
తాపమింకా తాళాలేను ॥తాప॥

స్త్రీ : ఆఁ రారా నా సరసకింకా
రావు ఏలారా
తాపమింకా తాళాలేను ॥తాప॥
..........................
..........................
..........................

పు : ఆఁ రారా నా సరస కింకా
రావు ఏలారా
ముక్తాయింపు
తధిమి తధిమి తధిమితా.

స్త్రీ : ఓ రామప్ప

పు : ఆఁ

స్త్రీ : ఇదిగో జూడు నా పెనిమిట్లు ఎంత మంది ఉండారో

పు : అమ్మా చాలమందున్నారు గాని

స్త్రీ : అంతా పెనిమిట్లే

పు : అయితే ఈ గ్రామాని కొచ్చి

స్త్రీ : బలే శోసబుట్టి ఈ నాడు నడుం బోయి

ప్రేక్షకులలో ఒకడు :- రామన్నా రామన్నా ఇదో రూపాయిలిస్తా నా పేరు జదువు. కొండారెడ్డి

పు : ఆఁ మహానుభావుడైన........

పు : వరహాలుడా........

స్త్రీ : ఏం మావా? ఏం మావా?

పు : ఓర్నీ యెక్క పాడు

పు : కొండా రెడ్డి తనపేరుతో బవుమతిగా అంటే ఆఁ....తారక సుధాకర, భాస్కర మొదలైన ఇరువది ఏనుగుల్ని (చేత్తో దీని?) మోసినట్టి ఆ తరుణకులాబ్దిసోముడు (ఆఁ) ధన్యుడు....నీకు ప్రసన్నమైనట్లు (ఆఁ) ఆ కొండారెడ్డి తనపేరుతో.

స్త్రీ : తన తండ్రి పేరుతో.

పు : తండ్రి పేరుతో.

స్త్రీ : తండ్రి పేరుతో కుమారుడు చదివించినాడు.

పు : అయిదు రూప్యములు.

స్త్రీ : వీరనారాయణప్ప కుమారుడు కొండారెడ్డి.

పు : ఆఁ కొండారెడ్డి అతని పేరు దిగద్దేశముల

....విరామము....

పు : ఒరే అల్లుడా ఒక విషయం.

వం : ఏంది మామా?

పు : ఈ గ్రామంలో యావన్మందీ చూసే నాట్కానికి చేసిన వారు ఎవరూ అని.

(వెనుకనుండి మన ఆఫీసరు వెంకటేశ్వర్లుగారు ఇచ్చారని అయిదు రూ॥ చదివించండి).

వం : ఇదిగో మామా, ఈ గ్రామానికి (ఆఫీసరు వెంకటేశ్వర్లుని చదివించండి). కాదుమామ ఇదిగో.

వం : ఇదే చల్లని సమయమందు మామను సంహరించి మరొక్క మామ. (భళీ భళీ భళీ).

గర్వమణిచి ఇంకొక మామను రద్దుచేసి, ముందొక మామకు ఆత్మబందువై మాకు ధన్యతనిచ్చు మామకు మామయైన ఆ వర మాత్మడు వారికి ప్రసన్నమయ్యేడిన్ ఇదే రామాయణకథయందు (ఔమామ).

ఒకరు : హైదరాబాదు.

వం : మన భాగవతులకు చదివించినట్టి హైదరాబాదు అయిన తెలుగు విశ్వ విద్యాలయ కేంద్రములో ఉన్నట్టి మహానుభావుడైనట్టి.

స్త్రీ : వెంకటేశ్వర్లు.

వం : వెంకటేశ్వర్లు వారి కీర్తియెల్ల.

పు : వెంకటేశ్వర్లుకూ జై.

స్త్రీ : ఇదుగో వారి తల్లి దండ్రుల పేరున.

వం : వాళ్ళన్నదమ్ములు, బావమరుదులు పైకి మరే పై దెబ్బగా వుండాలని.

పు : ఆఁ.

వం : ఇదుగో ఇంకా మహానుభావులైనట్టి వారు ఈ యాచకులకు చదివించిన వారికి జై జై ద్యానములు గలిగి దనకవాటములు గలిగి గాలి మేడలు గలిగి ఘనముగా వర్ధిల్లి, అన్నదమ్ములు ఆయుష్వంతులై, బావ మరుదులు భాగ్యవంతులై.

స్త్రీ : అవును. వారి సంపద అనేక సంపదలు గలిగి (ఆఁ) అభ్యుదయం గలుగు.

పు : నూరేళ్ళు వారికి కలిగి నూటపదేళ్ళు మాకు గల్గి.

స్త్రీ : ఇంకా నూట పదేళ్ళెందుకోయ్ నీకు.

వం : వారి

స్త్రీ : వారి కీర్తి

పు : ఓరల్లుడా

వం : ఆఁ ఏం మావాఁ

పు : ఓ అత్తా ఓ మేనమావా

స్త్రీ : ఏమి ఏమ్రా

పు : అయితే నాటకము ఏత్తున్నాముగాని, నాటకము కళాకారులును చూపిత్తున్న వారు మహానుభావులు వరూతిని

వం : ఈ గ్రామాని మనము పోతాము ఈ గ్రామములో అయితే అయితే మరి అన్న సంరక్షణ, మాన సంరక్షణ, గో సంరక్షణ గావించినట్టి మహానుభావులైనట్టి కాపులు కలిగి వుండగానే కాపురాలు చేసేతురు.

స్త్రీ : అవును మావాఁ

వం : కావతులకు, వేల్పులకు, భూపతులకు, కాపే కన్న తండ్రి, కాండ్రే మనకి ప్రధానం నాగలిబట్టిన, ప్రతి రైతు గూడా మనకు ఎంతో సత్కరించినారు గాబట్టి

వెనుక గోల

కుక్కల అరుపులు

వం : ఆ తెలుగు కేంద్రములో వాళ్ళు కలసి........ ...

పు : మాకిక్కడా ప్రోగాం ఇచ్చినారు. ఆ ప్రోగ్రామనగా........ఈ నాటకము ఏమి అంటే సుందరకాండ అను ఆట ఆడుతున్నాము.

వం : అందుకే మామ పండితులకు పామరులకు ఆనందము కలుగజేసే ఈ తోలుబొమ్మలాట శ్రీ కృష్ణదేవరాయల కాలము నుండి ఎక్కువగా పోషింపబడింది.

స్త్రీ : ఏంది మావా శ్రీ కృష్ణదేవరాయలు పరిపాలనలోనా

వం : ఆఁ

స్త్రీ : అబ్బా పూర్వము నాటిదే నంట మామా

పం : అటువంటి కళ క్షీణించి పోతున్నదని చెప్పి

స్త్రీ : క్షీణించి అంటే

పం : చాలా మూలకు బడిపోయిందత్తా

స్త్రీ : ఎవరూ చూడకా, పాటించకా ఇది ఎవ్వరికి కావట్లేదులే మామా. పాత కళ అని.

పం : కాదు కాదు.

పు : కాదు కాదు నీకు తెలియదు

పం : అది ఎట్లంటే

పు : దీంట్లో సారం నీకు దెలియదు, పద్యం అర్థం అయితే

పం : అట్ల కాదులే మామా

పు : ఆనందంగుంటది

పం : మామా

................విషాదం

పం : పాలను..... ....అదే గోవును సాకి పాలు పిండి పాలు కాచితే ఏమవు తుంది?

స్త్రీ : పెరుగవుతుంది మామా

పెరుగును చిలికితే ఏమవుతుంది

పం : ఆ యెన్నవూస లాగున (ఆఁ)

ఈ సీన్మా ప్రదర్శన (ఆఁ)

తోలుబొమ్మలాట నుంచే తయారయింది.

స్త్రీ : (అయ్యో).

స్త్రీ : అయ్యో. అందుకే ఎవరూ పాటించలేక ఎనక్కబడిపోయింది.

పం : అందుకోసమని ఈక్షీణించిపోయినట్టి, ఈ కళను, మన ప్రభుత్వం వారు చేపట్టినందుకు వారికి మా ధన్యవాదములు సమర్పించుతూ (సర్కారువారికి జై).

స్త్రీ : మామా పూర్వీకులంతా ఉండిరి, (ఆఁ) తొంబై యామడబోయి తోలు బొమ్మలాట, అరవై యామడబోయి అవుల పబ్బం చూడాలా అని ఇట్లాంటివన్నీ కొాన్పెన్లు ఏస్తావుండరాయే.

పు : ఏమంటే, నీకు నేను దుడ్డుబెట్టి కొనకొస్తాంటినీపొద్దు నాకే ఎవక్కే స్తండావే?

స్త్రీ : అందుకేనా మామా.

వం : అందుకే మన తెలుగుదేశము (ఆఁ) అయితే వరకట్నం రద్దు కూడా చేసినారు (ఆఁ)

పు : ఈ పొద్దు సుందరాకాండ నాటక ప్రదర్శన అయితుంది.

వం : రామాయణంలో ఎన్నో కాండలు ఉన్నాయి కాబట్టి, బాలకాండము, అయోధ్యకాండము, కిష్కింధాకాండము, సుందరకాండము (ఆఁ) యుద్ధకాండము అను కాండములు, మొదటి నాటకము మహాసుంద రంగా ఉంటుంది కాబట్టి, ఈ దినము సుందరకాండము ప్రారంభ మయితుంది.

పు : ఆఁ మొదట రామలక్ష్మణులొస్తున్నారా?

వం : శ్రీరామ లక్ష్మణులు........వనవాసము వస్తున్నారు. ఆ మాయా లేడి, సీతాపహరణము, వాలి సుగ్రీవుల యుద్ధము, ఆంజనేయస్వాముల వారు అయితే సముద్రము దాటి, లంకాపురము చేరి సీతామహాదేవి క్షేమము, రామునికి చెప్తాడు. ఈ కథ ఈ తెరపై జరుగుతుంది. కాని, (ఆఁ) ఎందరో మహానుభావులు అందరికీ అభివందనములు స్వీకరించి కథ బిగిన్ చేయి.

ప్రేక్షకులు ఒకరు : కథ కానియ్యండయ్యోయ్ పొగడ్తలు చాల్లే.

............విరామం ...........

వాద్యాల శ్రుతి

స్త్రీ : ఆఁ....అఁ....ఆఁ

పు : మా యన్న

వం : శ్రీరామ

స్త్రీ : శ్రీరామ లక్ష్మణులూ వచ్చిరపుడూ ॥శ్రీరామ॥
రామలక్ష్మణులూ వచ్చే
సీతా ఆఁ భామాతోడా ॥రామా॥

ఆఁ................
రెండోకాలంలో వాద్యాలన్నీ
ముక్తాయింపుగా
తైత తైత తైతతా అని మోగుతాయి.

క.నా: లక్ష్మణా

వం : అన్నయా............అగ్రజా............అన్నయా............

క.నా. : ఘోర ఆరణ్యప్రాంతంబున వచ్చి.

వం : ఆహా

క.నా. : ఈ యొక్క పంచవటీ తీరములో.

వం : ఆఁ.

క.నా. : చిత్రకూట? పర్వతముపైన ఈ పంచవటీ తీరమున నివశించితిమిగా.

వం : అహా

క.నా. : అన్నా ఇందులో సంతోషముగా ఇచ్చట ఎంత కాలమైనా ప్రవర్తింతుముగా.

స్త్రీ : అన్నయా ఎంతకాలమైనా ప్రవర్తన చేయవలసినదేమగా రాఘవా.

స్త్రీ : ప్రాణేశ్వరా ఆ మృగంబు చూడుము ఎంత వింతగా నున్నదో, మనోహరా.

క.నా. : ప్రాణేశ్వరీ.

స్త్రీ : ప్రాణేశ్వరా ఆ మృగము ఎంత వింతగా నున్నదో.

క నా. : ఏ మృగము (శృతి మొదలు - రాబోయే పద్యానికి అనుగుణంగా).

స్త్రీ : దేహమెల్లను వింతచే తేజరిల్లు
కొమ్ములందును మాణిక్య కోవలనగా.... ఆఁ........
ఆఁ........ ఆఁ........ ఆఁ........
ప్రాణేశ్వరా (ఆఁ హ) దీని అందమ్ము చూడగా మనస్సెంతో ఆనందించుచున్నది. దీనిని పట్టి తెచ్చి మన కుటీరముయందు యుంచిన ఎంత వింతగా నుండునో కదా! ఎట్లైనా పట్టి తెచ్చి నా కోర్కె తీర్చుము నాథా!

క.నా. : సీతా! ప్రాణేశ్వరీ! ఆ లేడికై నీ వింత కోరవలయునా! (ఆఁ) అవశ్యము నీ ఆజ్ఞ ప్రకారమే ఆ లేడిని బంధించి తెచ్చి నీకప్పగించెదను. లక్ష్మణా

వం : అన్నయా

క.నా: వదిన కోరినది. ఆ లేడిని పట్టితెచ్చుటకై నేనిప్పుడే పోవుచున్నాను. మీ వదినను బహు జాగ్రత్తగా కాపాడుము

వం : అగ్రజా నాయొక్క విన్నపము వినుము (పద్య పక్కి)
అన్నా........ఆ........
నా విన్నపంబిదే విన్నవింతు
సాదుతరమైన మృగము కాదు తెలుప
దనుజమాయకారణమె ధరణినాధ
సారమరయక వేటాడ
తలపవలదే........

స్త్రీ : (సీత) అ....అ....ఆ........

వం : అన్నా శ్రీరామా! లోకములో దేవసృష్టి అనగా ఆ యొక్క బ్రహ్మ దేవుని సృష్టియందైనా ఇంత చిత్రమైన మృగము వుండలేదు కదా! ఇదంతయు ధనుజమాయ కారణముగా దోచుచున్నదన్నా!

క.నా: లక్ష్మణా నీవేల సందేహించెదవు. నిక్కమైన మృగమైన పట్టి తెచ్చెదను. రాక్షసుడైన నాఘోర శరంబులచేత పడగొట్టి ఈ తాపసుల, ఆ చెరంతా విడుదల కావించెదను. నా ఆజ్ఞ మారు మాటాడక మీ వదినను కాపాడుము.

వం : అన్నయ్యా నీమాటను జవదాటుతానా! అమ్మా తల్లీ!

స్త్రీ : లక్ష్మణా!

వం : పోదము రావమ్మా. పంచవటీ తీరములో

స్త్రీ : మహాభాగ్యము లక్ష్మణా
(తెరపై శ్రీరాముడి వేట మృగము పరుగు దానిని సూచిస్తూ దప్పుపై చర్రీ వాద్యం మ్రోగుతుంది)
వెనుకనుండి
హా లక్ష్మణా హా సీతా

వం : అమ్మా

స్త్రీ : మీ అన్న కేదో ఆపద కలిగినట్లుగానున్నది.

వం : తల్లీ! అమ్మా! అగ్రజుండగు మా అన్నగారికి ఆపదే గలిగిన ముల్లోకములు తల్లడిల్లవా! ఆ నక్షత్రములు ఝుల్లున రాలవా! సూర్యచంద్రాదులు తేజో విహీనులు కారా! అమ్మా ఎన్నటికైనా ఎవడో దుష్ట రాక్షసుడు మాయను పచరించుటకై ఈ మాట పలికాడు తల్లీ. కొంచెం ఊరడిల్లు.

స్త్రీ : లక్ష్మణా, ఆ దనుజుల మాయలచే చిక్కి మీ అన్న ఎంత ఇక్కట్టులు చెందెనో, ఏ ఆపదలో యున్నాడో తొందరగా పోయి నీవు రక్షింపుము.

వం : అమ్మా ఊరడిల్లుము తల్లీ. మా అన్నకు ఏ ఆపదా కలుగదు. ఎవడో దుష్ట రాక్షసుడు మమ్ములను పరీక్షించుటకై ఈ మాట మాటాడాడు.

స్త్రీ : ఛీ లక్ష్మణా! భరతుని తమ్ముడని నమ్మినందులకు రాజ్యం బపహరించి మమ్ముల నడవుల పారదోలెను. నీవు మిత్రునివలె వచ్చి శత్రుత్వము సాధింప నెంచితివా? ఛీ! నీ మొక మ్మింక చూడరాదు పొమ్మా వలకు.

వం : హరిహరి! శ్రీరామచంద్రా. తల్లీ, తల్లీ ఆ రీతినే అనుకున్నా; భూత ప్రేత పిశాచ బ్రహ్మ రాక్షసులే నిలువు గాక, ఆ సూర్యచంద్రులే సాక్ష్యము గాక అమ్మా ఊరడిల్లుము. నీ మొగుడు శ్రీరాముల వారి కడకు పోవు చున్నాను.

రావణ ప్రవేశము. నటుడూ మారాడు.

క.నా: హరహరమహదేవ! శంభోశంకర! సత్కుల కటాక్షణా (?) భవతీ భిక్షాందేహి! మాతా అన్నపూర్ణేశ్వరీ! హరహర మహదేవ! శంభోశంకర.

స్త్రీ : యతీశ్వరా రమ్ము కూర్చొనుము. యీ ఆసనమును అలంకరింపుడు మహాత్మా.

క.నా: సుందరీమణీ! పురుషులు లేని సమయమున అతిథులు పరపురుషులు గృహమునుండరాదు. ఇదే మర్యాదలు కాదుగాని, త్వరగా భిక్షం వేసిన నేను పోయెదను. అయినా నీ వెవరవు ఏకాంతంబున నీవు ఒంటరిగా నుండుటకు కారణంబేమి? (ఆఁ) నీ పేరేది? నిన్ననవరతము సుఖించే పురుషుడెవడు? (ఆఁ) నీ కథాక్రమంబేదో చెప్పవే ఇందువదనా.

స్త్రీ : అయ్యా నాపతి శ్రీరామచంద్రుడు. దశరథుని పుత్రుడే శ్రీరామ చంద్రుడు. నా పతి తండ్రి పనుపున అరణ్యక్లేశములు గడచుటకై వచ్చియున్నాము తమ్ముడగు సౌమిత్రితో. ఇప్పుడే వింతమృగమ్మిటు రాగా నా కొరకై ఆ లేడిని పట్టితెచ్చుటకై వెడలిపోయినాడు. మీరిటు కొంచెము విశ్రమించిన వారింతలో నరుదెంచి నీ కుచితసత్కారంబు లొనర్తురు మహాత్మా.

క.నా.: సుందరీమణీ నీ యుదంతమంతయు నాకెరిగించితివి. ఈ త్రిలోకంబు లేలునట్టి నా పేరు రావణబ్రహ్మ. ఎన్నియో దినములనుంచి నిన్ను పట్టరాని మోహముచేత పట్టవలయునని తలచినవాడను. నిన్నుయిప్పుడే చెర పట్టెదను.

స్త్రీ : ఆఁ ఓరీ నీచుడా! సకల శాస్త్ర విద్యా విశారదుండగు ప్రభు రాముని భార్యను కోర నీకు ఎన్ని తలలు కలవురా?

క.నా.: అహ....హ... హ........అయినా నాకెన్ని తలలున్నవో చూడు. నా తలలు ఆకలించి చూడవే సుందరీ. (మద్దెల, తాళాలు, డప్పు వేగంగా కాసేపు మోగుతాయి. యతి వేషంలో నున్న రావణుని బొమ్మపోయి దశకంఠ రావణుని బొమ్మ ప్రత్యక్షం అవుతుంది.)

సీత విలాపం.

హా! రామా!

క.నా.: ఔరా! ఇప్పుడే మూర్ఛిల్లినది. అయినా ఈమెను నా గజశూలము చేత ఉండబడిన భూమిని పెకలించుకొని. నా పట్టణము లంకాపురి పట్టణమునకు గొనిపోయెద.

(మళ్ళీ వాద్యాల మోత)

కొంచెం విరామం.

స్త్రీ : ఆ...........ఆ...........

ఓ........సెలవాయె

కావవయ్యా రామా! ఆఁ...........

క.నా.: ఆఁ.......హ.హ.హ........

స్త్రీ : పాట

ఓరీ రాక్షసుడా!

రావణా!........

ఓ రామా!

కావవయ్యా

ఆ........నా........

ఆ...............

అయ్యో ఎంత చెడు కాలమాసన్నమయ్యేను.

కొద్ది విరామం.

జటాయువు ప్రవేశం.

వృ.వం. : సాగుతున్న ఈ ప్రయాణము లంకాధరుడు తీసుకు వెళుతున్నాడు రావణాసురుడు, వైదేహిని అనగా ఆ యొక్క సీతాదేవిని, తీసుకువెళు తున్నాడు. దుర్మార్గుడు. తీసుకువెళుతున్నాడు. యుద్ధము. నే నిప్పుడే ఎదిరించి ఆ సీతాదేవిని విడిపించెద. లేకున్న వానిచేత చచ్చెద. ఓయీ రాక్షసాధమా.

క.నా. : ఆ.

వృ.వం. : ఆ సీతాదేవిని ఈ ధరాతలంబున ఈ దుర్మార్గము చేస్తున్నావు.

క.నా.: ఎవడవురా నీవు?

వృ.వం. : నేను జటాయువుడను.

క.నా : ఔరా.

వృ. వం. : నేను జటాయువుండగా....ఏ పాపము ఎరుగని సీతాదేవిని కొని పోవ నీ తరమగునేరా?

క.నా. : ఏమి ఈ సీతను విడిచి నేను పురికేగవలయునా? లేకున్న నా తల నూడదీయుదువా? హ.... హ.... ఒరే జగమున కిండీయుడ? వైపొగ రెక్కి నీ సరి ఎవ్వరు లేరని నిక్కెదవా? ఏమి ఈమెను వూరక నీకు విడిచిపెట్టి పోవలయునా? అరేయ్. ఇదే ఖడ్గముతో నిన్ను నరికిపెట్టి పోయెద. (రావణ జటాయువు యుద్ధప్రదర్శన రెండు బొమ్మలు తెరంతా కదులుతాయి. వాద్యాలు మూడు వేగంగా ఉరుకుతాయి).

(జనంనుంచి ఈలలు కోలాహం)

(జటాయువు రామా శ్రీరామా అంటూ కింద పడుతుంది ప్రేక్షకులు కొందరు అయ్యో అయ్యో అంటారు. దృశ్యం అయిపోతుంది.

తిరిగి రామలక్ష్మణుల ప్రవేశం)

వృ.వం : అన్నయా నమస్కారం

క.నా : తమ్ముడా (అన్నయ్యా) మీ వదిన సీతను ఒంటరిగా పంచవటి తీరంలో విడిచివచ్చుట న్యాయమా? నేనిప్పుడే ఆ మృగమునే తెగలనా

పు.వం : నేచెప్పిన మాత్రము చేతనే వాడు నిజమగు మాయామృగమే, హా లక్ష్మణా ఆర్తనాదము వినగానే ఆమె వెంటనే, నీకాపద సంభవించిన దని నన్ను అనరాని మాటలు, వినరాని పలుకులు బలికినది. అది విన జాలక నేను వచ్చినాను నా తప్పు.

క.నా : అంత మాత్రమున నీవు వచ్చినావు కదా!

పు.వం : అయినా దుష్టరాక్షసులేమి కావింతురు. అన్నయా నాకు సెలవిండు... అన్నయా ఈ కుటీరమంతా పర్ణశాలంతా వెతికి చూసినా ఆమెయు అగుపింపదే

క.నా : తమ్ముడా ఏదిదారి

హా:....సీతా

పాట

అందరూ : నా ప్రాణసఖియగు సీత ॥నా ప్రాణ॥

అయ్యో నాప్రాణసఖి

కాసరావా ॥అయ్యో॥

నా ప్రాణమెట్లా నిలచు ॥నాప్రాణ॥

నేనెట్లా ఇకా

తాళూదూ

రెండో కాలంలో

నా ప్రాణసఖియగు

సీతా...............(నా ప్రాణ)

ఆ:........ఆ:........

(రాముడు నృత్యం చేస్తూ విలపిస్తాడు)

పు.వం: హా సీతా...........ఏలా...........ఆ...........సీతా...........

(విలాపంగా రాగం ...........ఆ ...........)

స్త్రీ : ఆ...........ఆ...........

క.నా: తమ్ముడా పంచవటి తీరములో ఎందు సంచరించి నా భార్య మాయ
మైంది (ఆ)
పద్య పక్కి
బాల.......వనముల కేగెనో
బాగ్యమీద
ఏ వనముల కేగెనో ఎందుండెనో చూతము రమ్మ

పు.వం: అన్నయ్యా ఈ ప్రదేశమంతయూ, నదులు, కోనలు కుటీరము ఈ ప్రదేశమంతయూ వెతికి చూచిననూ (ఆహా) ఆ మహా తల్లి కనిపించ కున్నది. ఇచ్చోట చూచిన విరిగిన రెక్కలు కలిగి, మా వదనను భ్రమించి పక్షి రూపము దాల్చినాడు. నా శరంబుతో వీనిని బడవై చదను.

క.నా: స్వామి శ్రీరామచంద్రా! రామరామ! రామాస్వామి! నేను రాక్షసుండను కాను. నీకై శత్రువును కాను. తండ్రీ ఆ దశరథ మహారాజు యొక్క మిత్రుండను. బాల్య సహోదరుడను తండ్రీ అ............

పు.వం: అనగా సూర్య దేవుని కుమారులు దశరథ మహారాజుని సహోదరులా

క.నా: అన్నా పూరుకుండెదను.

క. నా. : ఆ దుష్టాత్ము డగు రావణాబ్రహ్మ నీ వైదేహి, ఆ సీతాదేవిని కొని పోవుచుండగా వానితో నేను యుద్ధము చేయగా నా పక్షము లనే రెక్కలను నరికి, ఇక్కడ పారవేచి ఆ సీతాదేవిని గైకొని లంకాపురము చేరెను. నేను నీ రాకకై ప్రాణములు దాల్చియున్నాను స్వామి! ఒక్క తూరి నీ పాదము లంటనిమ్మ ప్రాణములు విడిచెద.

పు. వం. : లక్ష్మణా

స్త్రీ : అన్నయ్యా

పు. వం. : మన కొరకై ఈ పక్షేంద్రుడు నిష్కారణముగా ప్రాణత్యాగు డైనాడు కాబట్టి ఇతనిని గైకొనిపోయి గోదావరి నది ఒడ్డున అయినా పరలోక గమనము వంటి అగ్ని సంస్కారము గావించి రమ్మ.

స్త్రీ : అన్నయ్యా హా..... భాగ్యము హా! రామా!

పు. వం. : అన్నయ్యా (శబ) చెప్పిన ప్రకారముగా ఆ కిష్కింధ వైపుగా పోయి చుట్టూనూ సీతను గాలింతుము.

క. నా. : తమ్ముడా లక్ష్మణా! పక్షిరా జందులకు వుపకారముగా చేసితిమి. ఈ కిష్కింధకు పోదము రమ్ము.

(దృశ్యము ముగిసింది)

(వాద్యాలు వేగంగా కదులుతాయి)

(ఆ కిష్కింధలో వాలి సుగ్రీవుల ఘట్టం, సుగ్రీవుడి సంభాషణతో దృశ్యం ప్రారంభం)

పు. వం. : ఓహో.... నాయనా.... వాలుండును ... సమత.... కుండును (?) మహేంద్రుడు, జ్యోతిర్ముఖుడు, ఏమో డెభ్భై రెండువేల కపిసైన్యము లారా-

స్త్రీ.వం : ఆఁ

ఇంతవరకు మాయన్నయగు వాలితో శత్రు భయంబు లేక గడిపితిగా (ఆఁ) ఆ వాలి పంపున ఎవరో మునివేషధారులై, శస్త్రచామరములు (చాపములు) ధరించుకొని (ఆఁ) అనగా ఈ ఋష్యమూకలో కూడా వుండనీయకుండా వస్తున్నారే (ఆఁ)! ఈ ప్రదేశమునుండి వేరే ప్రదేశమునకు పోదము రండు (ఆహా)

పు.వం : కాదు కాదు. (ఏ మన్నయ్యా) ఆ అంజనేయ

క.నా. : ఏమాంజనేయ వారు వస్తున్న శరచాప హస్తులై వస్తున్నట్టి వారు వాలి పనుపున వస్తున్నారు కాదా?

పు.వం : ఆ శరచాప హస్తులై వస్తున్నవారు వాలిపంపున వస్తున్నవారు కాదు. ఎవరో మునివేషధారులు. నేను పోయి (హనుమ) వాని తెరంగెరిగి రాగలవాడను.

క.నా : ఏమయ్యా వాలి పంపున వస్తున్నారా లేక ఇతర కారణంబులచేత దారి తప్పి వస్తున్నారా? (ఆఁ) ఆ తెరంగెరింగి త్వరగా రమ్ము (ఆఁ)

పు.వం : ఆ త్వరగా వచ్చెదను.

ఆ భాగ్యము స్వామీ

(పైకెక్కడమా పైకెక్కండి)

స్త్రీ : పాట

దేవా దేవా
వందనమ్మి దేవా
దేవా దేవా
వందనమ్మిదే ॥దేవా॥
ఇదే...........
ఆ ..............
రెండో కాలంలో వాద్యాలు
ముక్తాయింపు
అఁతదిగిణత తదిగిణతా

పు.వం : వందనములు వందనములు శ్రీకరశర నీ మహిమ? వర్ణింపతరమె....
ఆ .... ఆ .... పరంధామ ఖండితరిపు వో .... నినుదలచగ .... నందోరగ
దలచిన ?; పరంధామా.

స్త్రీ : ఆ .... ఆ .... ఆ .... (దీర్ఘ రాగం)

క.నా : దేవాది దేవా! స్వామి!

స్త్రీ : ఆహా!

క.నా : మీరెవరు. మీ పాదారవిందములకు నమస్కారములు గైకొనుము (అఁ)

పు.వం : అయ్యా వటుని వేషమున వచ్చిన నీవు మహా భక్తుని లాగా అగు
పిస్తున్నాదవుగాని, దశరథ మహారాజు పుత్రులకు

క.నా : స్వామి ఎవరు మీరూ ....

పు.వం : దశరధ మహారాజులకు పుత్రులము.

క.నా : మీ యొక్క గృహము

పు.వం : మాది అయోధ్యా రాజ్యము. నా పేరు శ్రీరామచంద్రుడు. నా తమ్ముం
డు లక్ష్మణుడు. ఏదియో కారణముచేత చిత్రకూటాద్రి అరణ్యమందు
భార్యను పోగొట్టుకొని (ఓహో) ఎవరి వలనో ఈ సుగ్రీవుని, సుగ్రీవుని
వృత్తాంతము దెలిసికొని, సుగ్రీవుని స్నేహము గావింతమని వచ్చితిమి.
ఆయన ఎక్కడ, ఆయన విధము తెరంగు మాకెరింగింపుము.

క.నా: స్వామి (ఆఁ) అసుగ్రీవరాజు మంత్రిని నేను నా పేరు హనుమంతు డందురు. (ఆఁ) కావున వాలిచేత దెబ్బలు తిని ఆ సుగ్రీవుడు మిమ్ముల శరచాపంబుల జూచి భయభ్రాంతుడై మీ చెంతకు పంపినాడు తండ్రీ. స్వామి నా రెండు బాహువుల కూర్చొనండి. ఆ కిష్కిందకు నేను తీసి కొని పోతాను.

పు.వం : అంజనేయా (ఆఁ) నీ భుజములమీద కూర్చోని మేము రాలేముగాని, మేము కాలినడకచే వచ్చెదము. మా యుదంతమంతయూ సుగ్రీవునితో విన్నవించు.

క.నా. : ఆఁ మహాద్భాగ్యము.

క.నా. : రాజా సుగ్రీవా (అహాఁ)! వారు వాలి పనపుచేత వచ్చినవారు కారు. ఆఁ కారణము జెప్పెద (ఆ)........ ఎవడో........ అయోధ్యాపురమట (ఆఁ) దశరథ మహారాజు కుమారులట. పెద్ద రాజులు. (ఆఁ). వారి తమ్ముడి పేరు లక్ష్మణుడు. ఎవడో పంచవటీతీరములో చిత్ర కూటాద్రి పర్వత ములో ఉన్నప్పుడు, సీతాదేవిని, తన భార్యను చేనందుకొనిపోయినాడట.

స్త్రీ.వం : ఆహాఁ

క.నా. : ఆభరణములనగా, (ఆఁ) సీతాదేవి ఆభరణాలు మాచేత చిక్కినాయి కదా (ఆఁ).

పు.వం. ఆ గిరికందరంలో దాచినామే, ఆ నగల మూట గై కొనిరమ్ము.

క.నా. : మరి అదియే........

పు.వం. : ఆఁ నీవు పోయి రామచంద్రునికి నమస్కరించి, సంధి యొనర్చు కొని రమ్ము.

వాద్యాల శృతి.

పాట

అందరూ : ఓ రామా శ్రీరామా

శ్రీరామా జయరామా

రామరామ శ్రీరామరామ

రఘురామ రామ.

రెండో కాలంలో పై చరణం

పద్య ఫక్కి.

క.నా: అసురవంశ విరామ
ఆకాది (?) రామా
అర్కకులసోమ
అలకింపుము వరాంధామ
రామరామా.......అ.... ...

స్త్రీ పం: ఆ........ఆ........ఆ........

పు వం: దేవాదిదేవా! రామచంద్రా! తమయొక్క చరణారవిందములకు వదివేల వందనములివే వదివేల వందనములు.

క.నా: అయ్యా సూర్యనందనా....కలశ....ప్రతుడవు సుగ్రీవా (అస్పష్టం).

పు.వం: మహాభాగ్యం దేవా.

క.నా: నీ యుదంతమంతయు నా భక్తుండగు ఆ ఆంజనేయుని చేత విన్నాను. కాబట్టి నీ యన్నతో వాలితో కలసి యుద్ధము కావింపుము. మీ అన్నను. సంహరించి మీ అనగా మీ కిష్కింధ రాజ్యము, తారాదేవిని నీకు పట్టాభిషేకము గావింతును.

పు.వం: స్వామి ఏమంటివి! నా అన్నయగు ఆ దుష్టాత్ముడగు వాలిని మీరు సంహరించిన, సీతాదేవి ఎక్కడవుండిన,ఏ దశలో యుండిన, ఆకాశము, పాతాళములో వుండిన, ఏ ప్రదేశములో వుండిన సీతాదేవిని క్షేమముగా తేగలవారము. నా కార్యము సాధింతురా స్వామి?

క.నా: సుగ్రీవా! (ఆఁ) అయినా ముందుగా వాలితో కలహించి యుద్ధము గావింపుము. తదుపరి నా పరాక్రమము మీకే తెలుస్తుంది.

పు.వం: స్వామి!

క.నా: లక్ష్మణా! ఆ వృక్షము చాటుకు పోవుదము రమ్ము.

పు.వం: అయితే కిష్కింధకు పోయే మార్గము చేస్తాను.

క.నా: ఆఁ చెయ్యి. (ఆఁ అజ్ఞ)
వాద్యాల శ్రుతి-పాట ప్రారంభం.
శరణు శరణో
రామచంద్రా, కావరావేరా!
దేవాదిదేవా!
కావరావేరా!

(పాట అంతా అస్పష్టం. రెండో కాలంలో పాట ముగుస్తుంది.)
తెరపై వాలి సుగ్రీవులు ఒకరిపైబడి ఒకరు యుద్ధం చేస్తుంటారు.
వాద్యాలన్నీ వేగంగా కదులుతాయి.)

క.నా : వాడా వాలి, వీడా?

వెనుకనుండి స్త్రీ గొంతు : ఆఁ వాడు కాడుకాడు. వాడు....ఆఁ....ఆఁ వాడు
కాదు వీడు. అని కాసేపు
తెరవెనుక కోలాహలం.

స్త్రీ : వీడు కాదన్నయ్యా, వాడు. వెయ్యి బాణాలు.
వెయ్యి. వాద్యాల వేగం.
రామరామ! రామరామ!

క.నా: అయ్యో, శ్రీరామచంద్రా! ఎంత ద్రోహం గావించితివయ్యా. అయినా బలమైన మృగములను ఎక్కడైనా రాజులు ప్రపంచములో వధించుతున్నారు గాని, కోతినిచంపే రాజును ఇక్కడే చూస్తున్నాను. శ్రీరామచంద్రా....చేత క్షమించుము, ఈ శరంబు పెరుకుము

పు.వం : దేవేంద్రా (?) కుమారా ఓయీ వాలి నిన్ను సంహరించనేమనగా ఒక్క రాజైనవాడు దుర్మార్గుల సంహరించుట, యీ యొక్క దుర్మార్గుల సంహరించుట నీతిగాని (ఆఁ) నువు దుర్మార్గుడవు. నిన్ను చాటుగనో సంహరించితిని (ఓహో) తప్పలేదు (ఆహ) నీవిప్పుడే నా శరజాలంబులచేత హతుండవైతివి....
వాద్యాలవేగం-బాణంతీయడం
తార ప్రవేశం - విలాపం

స్త్రీ.వం : (రాగంలో)
నా ప్రాణనాయకా
నా జీవితేశా...ఆ....
మాటాడు
నాతోనీవు (దుఃఖాభినయం)
అడిలో చెదరి
ఓ........ఏడుపు

అయ్యో... మనోవాచా జీవితేశ్వరా
నాకింత మాటాడు నాథా
ఎవరో రుషులు
జయించనే లేరుగా
పోపోవ పాపాత్మ
దలపగా జూచి
పాపపు ఈ బ్రహ్మ (?)
పట్ట యిద్దరిని
చేయందగునే కాస్త
వినయంబు లేక
భర్తగా నన్ను
ప్రేమతో బిలచి
చెప్పిపోదువు నీ
క్షేమ మొప్పగనో........ ..
ఆ..................
అయ్యో మనోహరా
ప్రాణేశ్వరా...............రాగం

**స్త్రీ :** హా ప్రాణేశ్వరా నీ వకాలమృత్యువునకు లోనగుదువని అక్కటా కల యందైనా తలంపనైతినిగా. మనోహరా, నాకింకెవరు. దిక్కు నా కుమారుడు అంగదుడు ఎంత విలపించుచున్నాడో? ప్రాణేశ్వరా. నాకు చెప్పకపోయినందుకు నీకు యీ చావు సిద్ధించెనా........ఆ........

**పు.వం:** తారాదేవి ఏమి శోకించినా ఏమి ప్రయోజనము?

'కంచే నిజముగ చేనుమేసినా
కలదే కావన్నట్లు'

దాను (అఁ) శ్రీరామచంద్రుడే మనపై శత్రుత్వము వహించిన మనకు వేరే గతి ఏమి వున్నది. నీవు శోకించిన బాలుండై అంగదుడు భయపడుతున్నాడు గాని, నీవు సుగ్రీవుని చేవట్టి శ్రీరామచంద్రుని ప్రార్థించు. శ్రీరామచంద్రా తార శోకముచేత నిన్నన్నట్టి మాటలు క్షమించి, ఆ కుమారుని పట్టాభిషేకము గావింపుము తండ్రీ.

క.నా: మర్కటోత్తమా (ఆఁ)! ఇదిగో ఆయుధమ్ము పెరికి వేసితిని. ప్రాణములు విడువుము.

పు.వం: ఆ..........రామ రామ రామ

క.నా : తారాదేవి అంగదుని చేత (ఆఁ) రాజ్యము పట్టాభిషేకము గావింతుము

స్త్రీ : ఆఁ మహాభాగ్యము! స్వామీ మహాభాగ్యము

క.నా. : సుగ్రీవా?

పు.వం : ఆఁ స్వామి. ఈ వాన్ల కాలము నాచేతగానేరదు. వేసవి కాలము వచ్చిన వెంటనే, మీ వదిన సీతామహాదేవి క్షేమము గ్రైకొని వచ్చేవాడను నేను. (ఆఁ)

క.నా. : సుగ్రీవా సప్తలోకములు తిరిగి (ఆఁ) నా భార్య ఎక్కడున్నదీ తెలిసి రావలయును.

పు.వం : ఈ విధమున గద శ్రీరామచంద్రుడు కద ఆ సీతామహాదేవిని దుర దృష్టముగ వనవాసమునందు, పోనార్చుకొని (ఆఁ) అలవోకముగా వాతిని బాధగావించి ఆ తర్వాత సుగ్రీవునికి పట్టాభిషిక్తుని గావించిన వాడాయెను.

ఆహాఁ

కొద్ది విరామం

క.నా : అ........లా

పు.వం : ఆ.... ఏం.... మామా

క.నా : ........ గంధోళిగాడి ప్రవేశం

వీర బలిదేవునిగన్నట్లు (అం)
గంగ భాగీరథుని తాల్చి (?) నట్టు (ఆహాఁ)
గురుత (?) పోయిన వేళ
వడదెబ్బ తిన్నట్లు
సుగ్రీవ విభీషణులు
శ్రీరాముని కన్నట్లు
తప్పిపోయిన బిడ్డ
తల్లిని గన్నట్లు
....... ............

కాంచితమ్ముగా (ఆఁ)
నన్ను రక్షించమంటి
ఆరెరే (ఆఁ) మిమ్ముల చూడగా నా కన్నుల పండు వైనట్లైనది. ఈ యొక్క ఈ కొత్త పిట్టి గ్రామములో ఏమి సీత కోటర్సులో మామా!

క.నా : కోటర్సులో (ఆఁ) ఖదేరావు అనగా ఆయన ద్వారాగా (ఆఁ) కోటర్సులు వచ్చినాయి. బొమ్మలు చేసేవి వచ్చినయ్ (ఆఁ) మమ్మల్ని చక్కగా కాపాడుతున్నారు. (ఆఁ) ఆయన ద్వారాగా గవురుమెంటోళ్ళు ఎంతో ప్రఖ్యాతిగా చెసినారు. ఆయన ద్వారాగా (ఆఁ) మాముందు ఖదేరావు అన్న అంజన్నప్ప, (ఆఁ)! అంజనప్ప తమ్ముడు ఖదేరావు, (ఆఁ) ఖదే రావు తమ్ముడు నేను రామన్నను. (ఆఁ)! కాబట్టి వరసాదిగా వాళ్ళందరిని అనుకున్న గాని ఇదుగో వాళ్ళ పేరుతో అయిదు రూ॥ దక్షిణ యిచ్చి పోగు చేస్తున్నారు. ఖదేరావుకు జయ

ప్రేక్షకులలో ఒకరు : ఓర్నీయెక్క ఎవుళ్ళిచ్చింది చెప్పవేరా (ఆఁ)

క.నా : ఖదేరావు కోడలు, చలపతి పెళ్ళాం వెంకటాయమ్మ (ఆఁ)

ప్రే : ఆఁ కథగానియయ్యా
కొద్ది విరామం
వాద్యాల శ్రుతి

ప్ర.గా : పాట

జయ జయ శ్రీరామా
రఘువరా
శుభకర శ్రీరామా ॥పంత॥
తారక రామా
దశరథ రామా
దనుజవిరామా
పట్టాభిరామా ॥జయ॥
రామా రఘుకుల
జలనిధిసోమా
భూమి సుతా కామా
శ్రీరామా ॥రామా॥

కామిత నాయక
కరుణా ధామ
కోమల నీల
సరోజ శ్యామా
వాద్యాలు రెండో కాలం
పద్య పక్కీ

క. నా. : శ్రీ రఘురామ చంద్రా
మమ్ముల బిడ్డలజేయు
మహాప్రభో
నీ తారకనామ మంత్రము
తాపస వృద్ధులకే
నలభ్యమా .... ....
రామా .... ... ....

స్త్రీ : ఆ.... ఆ....

క. నా. : పరంధామా (ఆహా) ప్రచండ రాజ్య మండలీ ఘటికోద్దండ మండిత విజయ అఖిల దయా రామా (ఆ) త్వన్నామమ్మునకు బోలె వీణా మంగళిత కరుండనై (ఆ) నీ చరణదాసుండనై నమస్కరించు చున్నాను. నా దొక ప్రశ్న గై కొనుమా ప్రభువా రామా.

స్త్రీ : ఆంజనేయా?

క.నా: పరంధామా.

స్త్రీ : సుధీవ! అకల్మషుండవై వర్ధిల్లుమా పావనీ.

క.నా: పరంధామా! నన్ను పిలిపించిన కారణమేమో సెలవిప్పించండి.

స్త్రీ.వం: ఆంజనేయా? (ఆ) నిన్నటివరకు జరిగిన ప్రార్థనమును తెలుపుచున్నాను.

క.నా: అది ఏలాగు.

వాద్య కృతి

స్త్రీ.వం: (పద్యపక్కీ).
వాయుసుతా రమ్మా....ఆ
ఈ అంగుళీయకము గొమ్మ

లంకకు వేగపొమ్ము
సీతకు నాయొక్క
సేమము లేసెప్పి
ఆమె క్షేమము సెప్పి
నా చేతముదయనిమ్ము
ఆ........ఆఁ............ఆ........
ఓ హనుమ (ఆఁ) వాద్యాలు తేవు
నా వాక్యంబులు వినుము నేనొసంగెడి ముద్రికంగొని, (ఆఁ) అతి ఘోరముగా పారుచున్నట్టి సముద్రములందాటి (ఆఁ) లంకకు ఏగెగవు (అహఁ) నా సీత యొక్క క్షేమ వృత్తాంతంబు దెచ్చి నా శోకంబు మాన్పుమా.

పు.వ: వరంధామా.

క.నా: ఆంజనేయా.

పు.వం : నీచేనగు ఈ అంగుష్టమును గైకొని తక్షణము మగుడనే వెళ్ళి అతి ఘోరముగా పారుతున్న సముద్రమును లంఘించి లంకాపురము ప్రవేశించి నా వనిత సీతామహాదేవిని పొడగని శిరోరత్నమును గొని రావలయునా స్వామీ.

శ్రీ : అవును ఆంజనేయా

క.నా: ప్రభు మరి చెపుతున్నాను వినుడు....
వాద్యాలశ్రుతి, పద్య పక్కీ.
పోయెద ఎటకైనను
వదలనూ........(?)
నా....ఆఁ........
దైత్యులు నెదురు పడిన
దనకగ (?) భువిలో
మోదంబునముందు బిడ్డగా
ఓ.....నేవిధంబున
ఇదుగో పోదు....

శ్రీ : ఆ........ఆ........ఆ........

పు.వం : పరంధామా! నేనీ ఈ ఘన స్వరూపము చేత ఆ లంకాపురమునకు ఎటుపోదును?

శ్రీ : ఆంజనేయా (ఆఁ) లంకాపురమునకు పోవుశక్తి సామర్థ్యము సిద్ధింపుం డిన అలనాడు దుష్టులైన రాక్షసులైన ఖరాదూషణాదులపై ఎత్తిన దశావతారములు నీకు ప్రసాదించెదను గ్రైకొనుము.

పు.వం : మహాభాగ్యము దేవా

శ్రీ : ఆంజనేయా యిటు రమ్మా
(వాద్యాలు వేగంగా మోగుతాయి)
వెనుకనుండి ఓం శివా! ఓం శివా! అని అంటారు.
ఆఁ............

క.నా : స్త్రీని జంపిన స్త్రీ హత్య, శిశువును జంపిన శిశుహత్య, గోవును జంపిన గోహత్య, కోతిని జంపిన కోతిహత్య అంటారు కాబట్టి కోతిని జంపిన వాడు ఏమవుతాడయ్యా? బిడ్డలు లేక సంసారము లేక ఏకాకి అనగా ఒక్కరు తపియించుతారు. కాబట్టి. అటువంటి వాళ్ళు కోట్ల కర్మలు అనుభవించాలి. నీవు లక్షమంది కొడుకులు, మూడు లక్షల మునిమనుమలు, పదిలక్షల (ఆ సేన్లు ? వున్నవాడవు. నువ్వు ప్రపంచా నికి పేరు పొందినవాడవు. కాబట్టి దూతను చంపరాదన్నా.

పు.వం: సోదరా! కోతిని జంపినా, కోతి తమ్ముని జంపినా, కోతివాడని. వాడు కొంపలు ముంచేవాడు.

క.నా : కాదన్నా అది నిజమే. కాని వచ్చిన దూతకు అవమానము చేయాలి. ఏమి అవమానము అనగా, కోతికి సత్తు వాలము. వాలము అనగా తోక. దానిని-

పు.వం: కాదు విభీషణా! అయినా వీడు వనచరుడు కూడా సూక్ష్మరూపమున నున్నవాడని పలుకుతున్నాడవే గాని, గోకర్ణంబున అంగుష్ఠ మాత్ర మున నేలను వుండి పదిహేనేండ్లు తపస్సు గావించి బ్రహ్మతో వర మును పొందాను. అప్పుడు నేను ఏ జాతిచే గాని, మృగముచే గాని, అయితే చావు లేకుండా వరమును పొందాను గాని, బ్రహ్మదేవుడు కరుణించి నరుడు వానరుడు తప్ప తక్కిన జాతులతో నీకు చావు లేదని చెప్పినాడు. అప్పటికి నేను నరుడినే వానరుడు అనుకొంటిని.

అరె యిప్పుడు చూడగా వాడే వీడు, వీడే వాడు. ఈ కోతిని విడిచే సాధకముందా?

క.నా. : అన్నయ్యా! ఆనాడు ఆ బ్రహ్మదేవుడు వరమిచ్చినపుడు, వనచరాధముడు అనే వాడు లేడు, అంటె కలియుగము పుట్టలేదు. మానవుడు లేడు, కాబట్టి నరవానరులచేత........ నరుడు లేడు వానరుడు లేడు.

పు. వం : ఆఁ........

క.నా. : కలియుగము లేదు, కలియుగములో పుట్టినది ఏదీ లేదన్నా. కోతికి తోక ఎంతో........ ఆఁ కోతికి అందము తోక ........ వారికి మన లంకా పురములో ఎన్ని వీధులున్నాయి.

పు.వం. : నాలుగు లక్షల వీధులున్నాయి.

క.నా. : నాలుగు లక్షల వీధుల్లో బట్టలు దెచ్చి, ఆ నాలుగు లక్షల వీధుల్లో బట్టలన్నీ తోకకు జుట్టి, బాగా నూనెలో అద్ది (ఆఁ) అగ్ని ముట్టిచ్చు. (ఆఁ) వాడు దానితో కాలి కాలి అట్టనే చచ్చిపోతాడు. లేకపోతే, ఆ తోక లేక రాములవారి కడకు పోతే........నేను పంపిన ఒక్క కోతికే ఈ కార్యము సాగించాడే! నేను పోయినా ఇంతే కదా! ఇంతే జరుగుతుందని చస్తేరాడు. అయోధ్యకు పోతాడు.

పు. వం. : సెభాష్! ఒరేయ్! గోటితో బోయేదానికి గొడ్డలి ఎందుకని.

క.నా : ఆఁ........

పు. వం. : యుక్తంటే యిదేగాని మనము తక్షణమే ఆఁ గుడ్డలు తెప్పించి, భటులను పంపించి, ఈ కార్యము తప్పనిసరిగా చేయండి.... ఒరేయ్ మర్కటాధమా మా లంకాపురం వచ్చినందుకు ఇది నీకు శిక్ష.

క.నా. : నా వాలంబునకు కాల్చిన ఈ లంకాపురము కాల్చివేసిన ఇదే నీకు శిక్ష (మద్దెల క్రతి చేయడం).

పు. వం. : అయ్ నా లంకాపురము నీ తోకతో కాలడానికి గడ్డికాగ కాలునా, దుట్టికాగ కాలునా, కట్టెకాగ కాలునా, ఇనుము, ఇత్తడి, సీసము, బంగారముతో తయారయిన భవనాలను నీ ముఖము నివేం చేయగలవు? తప్పించుకోవడానికి మార్గం వన్నినావు అంతే. వెనుదీయు వాడను కాను. ఎందుకనగా ఆకాశము వీడి క్రింద పడినా నేను లొంగను. వేసిన

అడుగు వెనుదీయను. అరేయ్ సైనికులారా (రాజేంద్రా) వీడిని తీసుకు పోయి ఆ పని కానివ్వండి. (రాజేంద్రా భాగ్యము)

(వాద్యాల శృతి - పాట ప్రారంభం)

దూతను గలచుట భువిగలదే
దూతను గలచుట భువిగలదే
జగతిపై ఈ కరణి చేసిరే
ధరణిపై గలదే ఈ దారుణము (పాట అస్పష్టం....)

పు. వం. : ఈ విధంబుచేత గదా రావణ బ్రహ్మ చేత ఆజ్ఞబొందినట్లు అసురులుచేసిన అప్పుడుగద ఆంజనేయుడు బంగారు భవనాలు, వాయశాలలు, ఆయుధ శాలలు, శస్త్ర శాలలు అనేకమైనటువంటి లంకా పురంబును, గోపురములు, రథములు దహనము గావించి హాలాహలముగా సముద్రంలోనికి పోతే సముద్రుడు చేతులెత్తి పైకివచ్చి అలలతో ఆర్పినాడు ఆంజనేయుడి వాలమును. శ్రీరామ చంద్రుని కడకు పోతున్నాడట. శ్రీరామచంద్రుని దగ్గరికి.

పాట

ఓ రామ జయరామ
ఓంకార రామా
ఓ రామ శ్రీరామ
ఓ పరంధామా (మొత్తం మళ్ళీ)
(రెండో కాలంలో)
పద్యం ........ అస్పష్టం)
ఆఁ ........ ఆఁ ........ ఆఁ

క.గా : దేవా

పు.వం : ఆఁ

క.నా : అ మీరు చెప్పిన ప్రకారముగా (ఆఁ) ఆ సుగ్రీవుడు చెప్పిన ప్రకారముగా (ఆఁ) ఆ సముద్రాన్ని లంఘించి లంకాపుర ద్వారములో, ఆ [illegible] రెండు ద్వారములలో రాక్ష

సులను సంహరించి, లంకాపురము కలియ వెతికి, ఆ అశోక వనములో సీతా దేవిని కనుగొని మీరిచ్చిన ఆ అంగుళీయకము సీతా దేవికిచ్చి, ఆ సీతాదేవి మీ భార్య శిరోరత్నము గైకొని వచ్చితిని. ఇదే కొమ్ము రత్నము ఇక్ష్వాకుతిలకా ............

ఇదిగో కొనండి స్వామి.

శ్రీ.రాం : ఆంజనేయా, ఆంజనేయా

క.నా : ఆఁ ........

శ్రీ.రాం : ఈ శిరోరత్నము చూచిన మాత్రముననే ఆనంద బాష్పములు అగోచరముగా రాలుచున్నవి. లక్ష్మణా దుఃఖించటానికి, అవకాశము లేదు. కాబట్టి, నీయందు తప్పులున్నవా! ఆంజనేయా అనుజుల నల్వురము అన్నదమ్ములము, రామ,లక్ష్మణ, భరత, శత్రుఘ్న- మేము నలుగురం అన్నదమ్ములం. నా భార్య క్షేమము దెచ్చి, నా శోకము దీర్చిన నీవు అయిదో వాడవి. కాబట్టి శిలగా శాశ్వతమైనా, రామ నామమున్నంత పర్యంతము, నిత్య పూజా శిలస్తూపంబుగా నీకు వరంబు ప్రసాదించినాను.

అటులే స్వామీ!, సుగ్రీవా ఇట తక్షణంబే రేపు దినంబున మన సైన్యమంతయూ సమకూర్చుకొని ఆ సముద్రం మీద వారధి బంధనం కట్టు చేస్తుగా ఇక రెండు మాసములే పదునాలుగు సం॥లలో కొదవగా మిగిలినవి. స్వామీ! రెండు మాసములలో లంకాపురం బంతయూ దురోచనము గావించి ఏట్టి తరంబున నా భార్యను చెర విడుదల గావించుకొని, అయోధ్యా పురంబు పోవుచున్నాము కాబట్టి మహాశయులారా సుందరా కాండము అనే లంకా దహనము అనే నాటకము సమాప్తమైనది. ఇందులో రామా లోపములు ఎన్ని అపశబ్దములుండిన అలనాడు హాలహాలాన్ని ఈశ్వరుడు కంఠములో ఎలాగున ఉంచుకొన్నాడో, ఈ నాటకములో సుశబ్దములుగాని అపశబ్దములుగాని వుండిన, తమ కుమారులు తప్పులు చేసిన ఏలాగున మన్నింతురో, ఆలాగున మమ్ము మన్నించ ప్రార్థన.

అయ్యా! మంగళారతి

రామప్ప : జై ఇందిరా రమణ గోవిందా
గోవిందా

అందరూ : గోవిందా గోవిందా

రా : ఆ( శ్రీరమణా గోవిందా

అందరూ : గోవిందా

రా : పవమాన సుతుడు బట్టు

అందరూ : పాదారావిందములకు

నీ నామ రూపములకు
నిత్య జయా మంగళం
పావనా నారదాది
పాదాలు పట్టుచుండ
నీ నామ రూపములకు
నిత్యజయమంగళం.
(వేగంగా)
ఆ రామా హరా హరా
ఓ రామా రామా
కాపాడవయ్యా
ఓ రామా కృష్ణా.
కాపాడవయ్యా
ఆ సీతాతోటి
కాపాడవయ్యా
ఓ రామా రామా
కాపాడవయ్యా
తదిగిణతై తదిగిణతై.
ఓ...............
గోవిందా గోవిందా.

అందరూ : గోవిందా గోవిందా

ఆంజనేయ వరద గోవిందా - తవిం.
జై నమః పార్వతీపతే.
హరహర మహదేవ.
శంభో...............